# సాహితీ సమాలోచనం

## 1992 - 1993

1992 & 1993 సంవత్సరాలలో వెలువడిన
సాహితీ ప్రక్రియలపై ప్రసంగ వ్యాసాలు



యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

**SAHITHI SAMALOCHANAM : 1992-93**
A Review on literary trends in 1992 & 1993
Published by YUVA BHARATHI, literary and cultural organisation, Tilak Road, Hyderabad - 500 001.



యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 145

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

వెల : రూ. 30-00

ప్రతులకు :

**యువ భారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :
**విష్ణా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,**
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.



# ముూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువభారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్ని, ప్రజాస్వామ్య విధానాన్ని, నిర్మాణాత్మక కార్యశీలాన్ని, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్ని ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్పైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన

అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్ని సాహితీ వాతావరణాన్ని సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్ని, రచనా పాటవాన్ని, ఆలోచనాశక్తిని, అధ్యయన శీలాన్ని, ధుడితిస్ఫూర్తిని అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణపూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలిప్రచురణలు. 1970 లో 'మారుతున్న విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి,

దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరం పరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొద లయ్యాయి. 1971 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభా లహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన Telugu Novel మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచు రించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచు రించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మ భూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5.30 గంllలకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు',

'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

ప్రతి నెలా మొదటి ఆదివారం జరిగే 'సమాలోచనం'లో 1992, 1993 సంవత్సరాల సాహిత్య సమీక్ష కార్యక్రమాలు నిర్వహించాం. ప్రతి యేటా ఆ సంవత్సరంలో వచ్చిన సాహిత్యాంశాల సూచిని, సమీక్షను ప్రచురించాలని యువభారతి ప్రయత్నం. ఆ దిశగా సాగే యాత్రలో ఇదొక మొదటి మజిలీ మాత్రమే.

ఈ గ్రంథంలో వ్యాసాలు సమర్పించిన వ్యాసకర్తలు ఆచార్య ఎన్. గోపి గారికి, డాక్టర్ సి. మృణాళిని గారికి, శ్రీమతి అడివి సూర్యకుమారి గారికి, డాక్టర్ బి. జయరాములు గారికి, ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి, డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య గారికి కృతజ్ఞతాభివందనాలు. ప్రతి యేటా వార్షిక సాహిత్య సమీక్షలు చేస్తున్న వారిలో ముఖ్యంగా డాక్టర్ ద్వా నా. శాస్త్రి గారినీ, డాక్టర్ కడియాల రామమోహనరాయ్ గారిని మరువలేం. దీక్షావ్రతంగా సాగించే వారి సంవత్సర సాహిత్య సమీక్షలను ఈ సంపుటిలో ప్రచురించటానికి దయతో అంగీకరించినందుకు వారికి మా హృదయపూర్వక వందనాలు! యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రు'లకు, 'భారతీ మిత్రు' లకు, 'భారతీ భూషణు'లకు, ప్రకటన దారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విప్లాప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు :

వార్షికోత్సవ సభలను స్పాన్సర్స్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనరు జె. బాపురెడ్డిగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభిమానించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు, జి. వి. సుబ్రహ్మణ్యం
6.3.1994. అధ్యక్షుడు.

# విషయసూచిక



# ఆంధ్ర జనతకు, నవతకు యువతకు అంకితమ్ము

చిమ్మ చీకట్లను చీదరించుట కంటె
చిరుదివ్వె వెలిగించు శిల్ప మెరిగి
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
సందీప్తి పోషించు సభలు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళా శిల్ప
వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
నిర్మాణ శిక్షణ నీతి నెరపి

భారతీపాద మంజీర భవ్యరవము
తెలుగు వారల గుండెలో వెలుగునట్లు
చెలగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము!
ఆంధ్ర జనతకు యువతకు అంకితమ్ము!!

—డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

# 1992 సమాలోచనం – సమీక్ష

—డాక్టర్ బి. జయరాములు

"చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటే, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది."

అనే ఉద్దేశంతో ప్రారంభమైన యువభారతి (సాహితీ సాంస్కృతిక సంస్థ) నేటివరకు అనేక సాహిత్య సంబంధమైన కార్యక్రమాలను నిర్వహించింది. నూట యాభైకి పైగా ప్రచురణలను వెలువరించింది. "లహరి" కార్యక్రమాలను నిర్వహించి, సాహితీప్రియుల సమాదరణను పొందింది. ప్రతి వార్షికోత్సవంలో ఈ 'లహరి' కార్యక్రమం నిర్వహింపబడుతూ వుంది. 'నందిని' మాసపత్రిక యువభారతి అధ్యక్షుల ప్రధాన సంపాదకత్వంలో వెలువడుతూ వుంది. ఈ పత్రిక ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ప్రాంతాలలోఉన్న సాహితీ ప్రియులకు యువభారతి కార్యక్రమాలను ఎప్పటికప్పుడు తెలియజేస్తూ వుంది. రజతోత్సవాల్ని జరుపుకొని యువభారతి మరింత వేగంగా తన కార్యక్రమాలను నిర్వహించుకుంటూ ముందుకు సాగుతూంది. యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి నిర్మాణ, నిర్వహణలో అనేక కార్యక్రమాలు మిక్కిలి జనాదరణను పొందుతున్నాయి. యువభారతికార్యక్రమాల్లో ముఖ్యమైంది 'సమాలోచనం'.

వివిధ విషయాలపై విభిన్న దృక్పథాల సమాలోచనం ఈ కార్యక్రమం. ప్రతి నెలా మొదటి ఆదివారం తప్పకుండా ఒక కార్యక్రమాన్ని యువభారతి ఏర్పాటు చేస్తుంది. ఆ కార్యక్రమానికి ఆంధ్రదేశంలోని ప్రముఖ సాహితీవేత్తలను, సాహిత్యేతర రంగాలలోని ప్రముఖులను పిలిచి, వారిచేత ఉపన్యాసా

లిప్పించి, ఆబాల వృద్ధులను అలరిస్తూ, విజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఈ కార్యక్రమం నిరంతరం సాగాల్సింది కాబట్టి అశోక్ నగర్‌లో ఉన్న నగర కేంద్ర గ్రంథాలయాన్ని వేదికగా యువభారతి నిశ్చయించుకొంది. ఆంధ్ర సాహితీ ప్రియులకు నెలలో మొదటి ఆదివారం వచ్చిందంటే ఆ రోజు సాయంత్రం గం. 5.30 లకు యువభారతి కార్యక్రమం ఒకటి ఉంటుందని గుర్తుకు వస్తుంది. ప్రతి సంవత్సరంలోలాగే 1992 లో కూడా 'సమాలోచనం' కార్యక్రమాలను పన్నెండింటిని నిర్వహించింది. ఈ కార్యక్రమాలకు సమాజం నుండి మంచి స్పందన లభించింది. ప్రముఖులంతా యువభారతి ప్రత్యేకతలను ప్రశంసించారు.

ఈ సంవత్సరం (1992) 'సమాలోచనం' లో భాగంగా 5-1-1992 ఆదివారం నాడు శ్రీమతి వై. రెడ్డి శ్యామల వ్రాసిన "హిందీ మాతృభాషగాగల విద్యార్థులకు ద్వితీయ భాషగా తెలుగుబోధన సమస్యల విశ్లేషణ" అనే ఎం.ఫిల్ సిద్ధాంత గ్రంథావిష్కరణోత్సవం జరుపబడింది. ఈనాటి సభకు అధ్యక్షులుగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉన్న ఆచార్య భీమసేన్ నిర్మల్‌గారు ఉండి కార్యక్రమం నిర్వహించారు. తెలుగు విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉన్న ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు ముఖ్య అతిథిగా విచ్చేసి గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ గ్రంథంలోని విశిష్టతల గురించి తెలుగు విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య బి. రామకృష్ణారెడ్డిగారు, హైదరాబాదు విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ పి. రామనరసింహంగారు చక్కగా వివరించారు. రచయిత్రి వై. రెడ్డి శ్యామల తన గ్రంథాన్ని తన తల్లిదండ్రులైన శ్రీమతి వై. రాజేశ్వరి, ఆచార్య వై. వెంకటరమణరావుగారలకు అంకితమిచ్చారు.

2-2-92 ఆదివారం నాడు యువభారతి ఉపాధ్యక్షులైన డా. తిరుమల శ్రీనివాసాచార్యగారు వ్రాసిన లలిత గీతికా సంపుటి "గంగాతరంగాలు" కావ్యావిష్కరణోత్సవం, సమర్పణోత్సం జరిగింది. ఈనాటి సభకు అధ్యక్షులుగా 'సహజకవి' శ్రీ ఎం. ఎస్. రెడ్డి (మల్లెమాల) గారు ఉండి కార్యక్రమాన్ని నిర్వహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన జ్ఞానపీఠ్ పురస్కారగ్రహీత, పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ సభను డాక్టర్ జె. బాపురెడ్డి IAS గారు ప్రారంభించారు. డాక్టర్

తిరుమల శ్రీనివాసాచార్య తమ గ్రంథాన్ని కళాతపస్వి, పద్మశ్రీ డాక్టర్ కె. విశ్వనాథ్‌గారికి అంకితమిచ్చి సన్మానించారు. కావ్యకర్తను వాస్తుశిల్పి శ్రీ బి. యన్. రెడ్డిగారు సన్మానించారు. కళాప్రపూర్ణ, పద్మశ్రీ డాక్టర్ బోయి భీమన్న, ఉందేల మాలకొండారెడ్డి, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, శ్రీ కె.వి. రాఘవాచార్య గారలు కావ్యకర్తను ఆశీర్వదించగా, శ్రీ కె.వి. రమణ, డాక్టర్ కె.బి. గోపాలం గారలు శుభాకాంక్షలందజేశారు. శ్రీ ఎస్. బసలింగప్ప గారు వేదికపైనున్నవారికి జ్ఞాపికలను బహూకరించారు. గంగాతరంగాలు కావ్యాన్ని డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు పరిచయం చేస్తూ "ఈ గ్రంథంలో రస భావం చాలా ఉన్నా సమయాభావం వల్ల ఎక్కువగా చెప్పలేకపోతున్నా"నని రెండు మూడు మాటల్లో కావ్య విశిష్టతను తెల్పి ముగించారు. ఈ కార్యక్రమం రవీంద్రభారతిలో కన్నుల పండువుగా జరిగింది.

1.3.92 నాడు "వివిధరంగాలలో స్త్రీ" అనే అంశంపై మహిళలచే నిర్వహింపబడ్డ సమాలోచన కార్యక్రమం రంజకంగా సాగింది. హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో కార్యక్రమప్రయోక్త అయిన శ్రీమతి తురగా జానకిరాణి గారు సభకు అధ్యక్షత వహించి, వివిధ రంగాల్లో స్త్రీలయొక్క స్థితిగతులను వివరించారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ప్రభుత్వ చీఫ్ విప్ శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారు నేడు స్త్రీలు అన్ని రంగాల్లోనూ ముందంజ వేస్తున్నారని, పై స్థానాలకు చేరుకుంటున్నారనీ, చొరవతో ఇంకా ముందు కెళ్ళాల్సిన అవసరం ఉందని వివరించారు. ఈ కార్యక్రమంలో ప్రసంగించిన శ్రీమతి అరుణా వ్యాస్‌గారు 'కుటుంబానికి స్త్రీ మూలాధారమని, స్త్రీ వల్లనే కుటుంబ సంస్కృతి, జాతి సంస్కృతి పరిరక్షింపబడుతుం'దని వివరించారు. డాక్టర్ బి. సరోజనిగారు ప్రసంగిస్తూ, పాఠ్యపుస్తకాల్లో స్త్రీకి సరియైన స్థానం లభించడంలేదని, కొన్నిచోట్ల ఆమె భోగవస్తువుగా చిత్రించబడిందని సోపపత్తికంగా వివరించారు. శ్రీమతి నాగపద్మిని గారు మాట్లాడుతూ కథానికల్లో స్త్రీ పాత్ర చిత్రణ మనోహరంగా ఉంటుందని, అయితే, అనేక కథల్లో స్త్రీ బానిస భావాలు గలదిగా చిత్రింపబడుతూందనీ, ఈ పద్ధతి మారాలని సూచించారు.

'అంగీరస' ఉగాదికి ఆహ్వానం పలుకుతూ 5.4.1992 ఆదివారం నాడు కవి సమ్మేళనం ఏర్పాటు చేయబడింది. ఈ కవి సమ్మేళన కార్యక్రమానికి

యువభారతి ఉపాధ్యక్షులు. హైదరాబాద్ విశ్వవిద్యాలయం రీడర్, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య గారు అధ్యక్షత వహించారు. పలువురు కవులు ఈ కార్యక్రమంలో పాల్గొని, తమ మనోజ్ఞమైన కవితలను వినిపించి, శ్రోతలను మంత్రముగ్ధులను చేశారు. ఉగాది మీదనే గాక వివిధ సామాజిక సమస్యలపై తమ కవితలను యువకవులు వినిపించారు.

ఈ సంవత్సరం రమ్యంగా సాగిన కార్యక్రమాల్లో "యువసాహితీగోష్ఠి" ఒకటి. 3-5-29 ఆదివారంనాడు యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన ఈ కార్యక్రమం నిర్వహించబడింది. ఈ గోష్ఠిలో అనేకమంది యువకులు కవితలను, కథలను, సమీక్షలను వినిపించారు. వాటిమీద మళ్ళీ కొందరు యువకులు సమీక్ష జరిపారు. మధ్య మధ్య అధ్యక్షుల వారి విశ్లేషణతో, ఛణకులతో ఈ కార్యక్రమం అతిరమ్యంగా సాగింది. రచనలు, వాటిపై విమర్శలు వెంట వెంట సాగడం వల్ల ఒక కొత్త సాహిత్య లోకంలో విహరించినట్లై శ్రోతలంతా తమ మెప్పుకోలును, ఆనందాన్ని వ్యక్తపరచారు.

ఈ సంవత్సరం యువభారతి చరిత్రలో మరపురాని ఘట్టం రజతోత్సవాలను నిర్వహించుకోవడం. 31.5 1992, 1-6-92, మరియు 2-6-92 తేదీలలో యువభారతి ఘనంగా తన రజతోత్సవాలను జరుపుకొంది. ఈ ఉత్సవాలలో భాగంగా సదస్సులు, ఉపన్యాసాలు. కవిసమ్మేళనం, మహాసభ జరిగాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులోను, వెనుకనున్న ఖాళీ స్థలంలోను ఈ కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి.

ప్రాచీన, ఆధునిక సాహిత్యాలను గురించి సమాజంలో సదవగాహనను పెంపొందించడంలోను, ఉత్తమ సాహిత్య విలువలను ఉపన్యాస కార్యక్రమాల ద్వారా, సరళ ప్రచురణల ద్వారా సామాన్య ప్రజానీకానికి అందించడలోనూ యువభారతి ఒక గుర్తింపు సంపాదించుకొని, అందరి ఆదరాభిమానాలను చూరగొంటూంది. తెలుగు భాషా సాహిత్య వికాసానికి నిర్మాణాత్మకంగా, శాంతియుతంగా మానవ విలువలతో కూడుకొన్న సేవాభావంతో సాత్త్విక సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్న యువభారతి రజతోత్సవాలను జరుపుకోవడం సకల ఆంధ్రావళికి సంతోషకరమైన విషయం. ఇది ఆంధ్ర భాషా సాహిత్యాలకే పండుగ.

ఈ రజతోత్సవాలలో మొదటిరోజు 31-5-1992 ఆదివారంనాడు "కొత్త గొంతుకలు - సరికొత్త విలువలు" అనే అంశంపై సాహిత్య సదస్సు జరిగింది. ఉదయం 10-30 గంటలకు ప్రారంభమైన ఈ సదస్సుకు హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయం ఆచార్యులు ఆచార్య రవ్వా శ్రీహరిగారు అధ్యక్ష్యం వహించారు ముఖ్య అతిథిగా విచ్చేసిన డాక్టర్ వి. వి. కృష్ణశాస్త్రిగారు సదస్సును ప్రారంభించారు. ఈ సదస్సులో నలుగురు సుప్రసిద్ధ కవి పండిత విమర్శకులు ప్రసంగించారు. 'సమకాలీన సాహిత్యంలో భారతీయత' అనే అంశం గురించి ఆచార్య కె. సుప్రసన్నాచార్యులుగారు, 'సమకాలీన కవిత్వం - కొత్తగొంతుకలు' అనే అంశంపై ముదిగొండ వీరభద్రయ్యగారు, 'పుంజుకుంటున్న పద్య కవిత్వం'పై డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు, 'తెలుగు సాహిత్య విమర్శ - కొత్త ధోరణులు' అనే అంశంపై డాక్టర్ కె. సంపత్కుమారాచార్యులుగారు సాధికారంగా ప్రసంగించారు.

మధ్యాహ్నం భోజనానంతరం 2-30 గంటలకు రెండవ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యులు ఆచార్య ఎన్. గోపీగారు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ కార్యక్రమానికి శ్రీ యం. ఆర్. సుబ్రహ్మణ్యం గారు ముఖ్య అతిథిగా వచ్చి ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో 'తెలుగు నవల - ఇంకా మిగుల్చుకొన్న విలువలు' అనే అంశంపై ఆచార్య నాయని కృష్ణకుమారిగారు, 'రూపపరిణామం - కథాశిల్పం' అనే అంశంపై డాక్టర్ ముక్తేవి భారతిగారు, 'ప్రచారసాధనాలు-మారుతున్న విలువలు అనే అంశంపై ఆచార్య పేర్వారం జగన్నాథంగారు, 'ఆధునిక వీధి నాటకం - క్రొత్త ప్రయోగాలు' అనే అంశంపై శ్రీ డి. ఎస్. దీక్షిత్ గారు, 'మారుతున్న గ్రామీణ సమాజం - జానపద కళారూపాలు' అనే అంశంపై డాక్టర్ పి. సుబ్బాచారి గారు, నేటి సాహిత్య సంస్థలు - తీరుతెన్నులు' అనే అంశంపై డాక్టర్ మసన చెన్నప్ప గారు ప్రసగించారు.

మొదటి సమావేశానికి డాక్టర్ మసన చెన్నప్ప, శ్రీ ఎమ్. అనంతాచార్యులు గారలు సమావేశకర్తలుగా వ్యవహరించగా, రెండవ సమావేశానికి శ్రీ రెడ్డి రాఘవయ్య, శ్రీ ఎస్. పాండురంగారెడ్డి గారలు సమావేశ కర్తలుగా వ్యవహరించారు.

రజతోత్సవ సభ సాయంకాలం 6 గంటలకు జరిగింది. 'తెలుగువారి సాంస్కృతిక వికాసం' అనే అంశంపై జరిగిన ఈ సభకు డాక్టర్ ఉందేల మాల కొండారెడ్డి గారు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా శ్రీ కె. వి. రమణ IAS గారు విచ్చేశారు. ఈ కార్యక్రమంలో 'తెలుగువారు - నాటకరంగం' అనే అంశం గురించి పద్మభూషణ్ శ్రీ ఎ.ఆర్. కృష్ణగారు, 'తెలుగువారు - నాట్య రంగం' అనే అంశం గురించి పద్మశ్రీ శ్రీ నటరాజ రామకృష్ణగారు, 'తెలుగు వారు - సంగీతరంగం' అనే అంశం గురించి పద్మశ్రీ శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నంగారు, 'తెలుగువారు - సినిమారంగం' అనే అంశం గురించి శ్రీ గుడిపూడి శ్రీహరిగారు సరసంగా ప్రసంగించారు.

ఈ కార్యక్రమానికి సమావేశ కర్తలుగా డాక్టర్ తిరుమల శ్రీనివాసా చార్యగారు, శ్రీ పి. శ్రీనివాస్‌గారు వ్యవహరించారు.

1992 జూన్ 1వ తేది సోమవారంనాడు ''విద్యా వైద్యశాస్త్ర కళా రంగాలు - మానవతా విలువలు'' అన్న అంశంపై మొదటి సమావేశం ఉదయం 10-30 గంటలకు జరిగింది. ఈ సమావేశానికి డాక్టర్ వెలిచాల కొండలరావు గారు అధ్యక్షత వహించారు. శ్రీ జె. రాంబాబు IAS గారు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ఈ సమావేశంలో ''ఆధునిక జీవితం - మానవతా విలువలు'' అనే అంశంపై శ్రీ వాకాటి పాండురంగారావుగారు, "కళారంగం - మానవతా విలువలు" అనే అంశంపై శ్రీమతి జమునా రమణారావుగారు, ''వైద్య సేవ - మానవతా విలువలు'' అనే అంశంపై కుమారి డాక్టర్ కమలాజయరావుగారు, "శాస్త్రవిజ్ఞానం - మానవతా విలువలు" అన్న అంశంపై డాక్టర్ కె.బి. గోపాలం గారు ప్రసంగించారు.

ఈ సమావేశానికి డాక్టర్ సురవరం పుష్పలతగారు, శ్రీ వి. జనార్దన రావుగారు సమావేశ కర్తలుగా వ్యవహరించారు.

రెండవ సమావేశం మధ్యాహ్నం 2-30 గంటలకు జరిగింది. ఈ కార్య క్రమానికి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు అధ్యక్షత వహించగా, శ్రీ జి. రామదాస్‌గారు ముఖ్య అతిథిగా వచ్చారు. ఈ సమావేశంలో డాక్టర్ సురవరం పుష్పలతగారు "పాఠశాల - ఉపాధ్యాయులు - విద్యార్థులు - మానవతా

విలువలు" అన్న అంశంపై, శ్రీ పి. నాగరాజుగారు "కొత్త అధ్యయన రంగాలు - యువత - మానవతా విలువలు" అన్న అంశంపై, డాక్టర్ కె.వి. కృష్ణకుమారిగారు ''తల్లిదండ్రులు - పిల్లల పెంపకం - మానవతా విలువలు" అన్న అంశంపై, శ్రీ తేన్నేటి పూర్ణచంద్రరావుగారు ''ఆధ్యాత్మికత-మానవతా విలువలు'' అన్న అంశంపై ప్రసంగించారు.

ఈ కార్యక్రమానికి శ్రీ అమాతి రవీంద్ర, శ్రీ యస్. నారాయణరెడ్డి గారలు సమావేశకర్తలు.

రజతోత్సవసభ సాయంకాలం 6 గంటలకు జరిగింది. ఈ కార్యక్రమంలో "కవిసమ్మేళనం" నిర్వహించబడింది. ఈ కార్యక్రమానికి సహజకవి 'మల్లెమాల' (శ్రీ ఎం. ఎస్. రెడ్డి)గారు అధ్యక్షత వహించారు. యువభారతి రజతోత్సవ ప్రచురణ అయిన "అమృతరాజీవం" కవితా సంకలనాన్ని ఆవిష్కరించి, ప్రసంగించినవారు ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా వచ్చిన శ్రీ టి. ఎస్. రావు, IPS గారు. ఈ కవిసమ్మేళనంలో సుప్రసిద్ధులైన కవులు, కవయిత్రులనేకులు పాల్గొన్నారు. తమ కవితలను వినిపించిన వారిలో డాక్టర్ బోయి భీమన్న, డాక్టర్ జె. బాపురెడ్డి, వాస్తు శిల్పి శ్రీ బి. ఎన్. రెడ్డి, డాక్టర్ ఉందేల మాలకొండారెడ్డి, డాక్టర్ వెలిచాల కొండలరావు, డాక్టర్ నాయని కృష్టకుమారి, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు, శ్రీ కె. వెంకట శివయ్య, శ్రీ ఊట్ల కొండయ్య, డాక్టర్ వి.వి.యల్. నరసింహారావు, డాక్టర్ ముకురాల రామారెడ్డి, డాక్టర్ ఎన్. గోపి, డాక్టర్ ఆచార్య తిరుమల, డాక్టర్ సుమన్‌శ్రీ, శ్రీ దేవరాజు మహారాజు, డాక్టర్ అంతటి నరసింహం, శ్రీదేవిప్రియ, శ్రీ సి. వి. కృష్ణారావు, శ్రీ యాకూబ్, శ్రీ ఎండ్లూరి సుధాకర్, డాక్టర్ నాళేశ్వరం శంకరం, శ్రీ కె. రాంమోహనశర్మ, శ్రీ సిద్ధార్థ, శ్రీ హరి చంద్రశేఖర్, శ్రీ మందడి కృష్ణారెడ్డి, డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య, డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి, శ్రీ జి. కుమార స్వామినాయుడు, శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడ్ ప్రభృతులు పాల్గొన్నారు.

ఈ కార్యక్రమానికి సమావేశకర్తలు డాక్టర్ బి. జయరాములు, శ్రీ కె. వి. కామేశ్వరరావు, శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారలు.

ఇక మూడవరోజు, చివరిరోజు అయిన 2-6-1992 మంగళవారంనాడు "స్త్రీవాద ధోరణులు-సమకాలీన సాహిత్యం" అనే అంశంపై సాహితీ సదస్సు నిర్వహింపబడింది. మొదటి సదస్సు ఉదయం 10. 30 గంటలకు డాక్టర్ రావి భారతిగారి అధ్యక్షతన జరిగింది. శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, IAS గారు ముఖ్య అతిథిగావిచ్చేసి, సదస్సును ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో "పెళ్ళి-కుటుంబ జీవితం" గురించి శ్రీమతి అరుణావ్యాస్‌గారు, 'ఉద్యోగినుల సమస్యలు' గురించి శ్రీమతి తురగా జానకీరాణిగారు, "స్త్రీవాదం-సాహిత్య విమర్శ" గురించి శ్రీమతి ఓల్గాగారు ప్రసంగించారు.

ఈ సమావేశానికి శ్రీమతి కె బి. లక్ష్మిగారు, శ్రీ టి. మురళీధరగౌడ్ గారు సమావేశకర్తలుగా ఉన్నారు.

రెండవ సమావేశం డాక్టర్ ఎన్. నిర్మలాదేవి గారి అధ్యక్షతన మధ్యాహ్నం 2-30 గంటలకు జరిగింది. శ్రీమతి శారదా అశోకవర్ధన్ గారు ముఖ్య అతిథిగా వచ్చారు. దీనిలో డాక్టర్ ఎం. లావణ్య సరస్వతి గారు "భావ కవితాయుగ సాహిత్యం - స్త్రీ" అనే అంశంపై, డాక్టర్ వై. కామేశ్వరి గారు "అభ్యుదయ కవిత్వంలో స్త్రీ" అనే అంశంపై, శ్రీ భుజంగరెడ్డిగారు "ఇటీవలి కవిత్వంలో స్త్రీవాద ధోరణులు" అనే అంశంపై, డాక్టర్ కాత్యాయని విద్మహే గారు "ఇటీవలి తెలుగు నవలలు- స్త్రీవాద ధోరణులు" అనే అంశంపై, శ్రీమతి కె. బి. లక్ష్మిగారు "తెలుగు కథ - స్త్రీ వాద ధోరణులు" అనే అంశంపై ప్రసంగించారు.

ఈ సమావేశానికి కుమారి జి. గీతావాణి, డాక్టర్ డి. కె. శ్రీనివాసాచార్యులుగారలు సమావేశకర్తలుగా వ్యవహరించారు.

యువభారతి రజతోత్సవ మహాసభ సాయంకాలం 6 గంటలకు జరిగింది. ఈ సభా ప్రారంభకులు మాన్యశ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డిగారు (అప్పటి భారత ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి) కొన్ని అనివార్య కారణాల వల్ల సభకు రాలేకపోయారు. ముఖ్య అతిథిగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, యువభారతి రజతోత్సవ సంఘ ప్రధాన పోషకులు అయిన మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డిగారు విచ్చేసి, ఆచార్య సి. నారాయణరెడ్డిగారి "తెలుగు కవిత: లయాత్మకత"

అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. ప్రత్యేక ఆహ్వానితులుగా వచ్చిన పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారు యువభారతి రజతోత్సవ సంచిక "వెండి వెలుగులు"ను ఆవిష్కరించారు. డాక్టర్ దేవులపల్లి రామానుజరావు గారు రజతోత్సవ శుభాశీస్సుల నందించారు. ఈ సభకు వాస్తుశిల్పి శ్రీ బి. ఎన్. రెడ్డిగారు అధ్యక్షత వహించగా, సహజకవి, మల్లెమాల శ్రీ ఎం.ఎస్. రెడ్డిగారు స్వాగతం పలికారు. డాక్టర్ జె. బాపురెడ్డి, IAS గారు, శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, IAS గారు తమ శుభాకాంక్షలు తెలిపారు.

ముచ్చటగా మూడు రోజులు జరిగిన యువభారతి రజతోత్సవ సభలు అందరినీ ఆకట్టుకొన్నాయి. యువభారతి సాహిత్యోద్యమానికి మళ్ళీ కొత్త ఊపు వచ్చింది. రజతోత్సవాలలో నిర్వహించిన సదస్సులలో వక్తలు వివిధ అంశాలపై మాట్లాడిన ప్రసంగాలను గాలికి పోకుండా పుస్తక రూపంలో తీసికొని వచ్చి, 6-3-1994 న జరిగే వివేకానంద లహరి' వార్షికోత్సవ సభలో 'వివేకానంద లహరి'తోబాటు ఆవిష్కరింపజేయడం బహుధా ప్రశంసనీయం.

5-7-1992 ఆదివారం నాడు సమాలోచనం కార్యక్రమంలో యువభారతీయుల కవితా సంకలనం "అనుభూతి" రజతోత్సవ ప్రచురణ ఆవిష్కరణోత్సవం జరిగింది. ఈ సభకు డాక్టర్ ఆచార్య తిరుమలగారు అధ్యక్షత వహించారు. డాక్టర్ రావూరి భరద్వాజగారు ముఖ్య అతిథిగా విచ్చేసి, కావ్యాన్ని ఆవిష్కరించారు. శ్రీ పి. నాగారాజుగారు 'అనుభూతి' కవితా సంపుటిని సమీక్షించారు. డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు 'సాహిత్యం - అనుభూతి' అనే విషయంపై చక్కని ప్రసంగం చేశారు.

2-8-1992 ఆదివారం నాడు "నాకు నచ్చిన లేదా నేను మెచ్చిన కవిత" అనే అంశంపై చక్కని గోష్ఠి కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి యువభారతి ఆధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు. ఈ సభకు వచ్చిన అనేకమంది ఈ కార్యక్రమంలో పాల్గొని తమ ప్రతిభా పాటవాలను ప్రదర్శించారు.

6-9-1992 ఆదివారంనాడు మహాకవి గురజాడ వ్రాసిన 'కన్యాశుల్కం' మొదటిసారి ప్రదర్శించి శతాబ్ది పూర్తి అయిన సందర్భంగా యువభారతి తన

'సమాలోచనం'ను కన్యాశుల్కం ప్రదర్శన నూరేళ్ళ పండుగకు సాహిత్య స్పందనగా సమర్పించింది. ఈ కార్యక్రమంలో "గురజాడ కన్యాశుల్కం నాటకంలో నాకు నచ్చిన అంశం - లేదా - నాకు నచ్చని అంశం" అనే చర్చనీయాంశానిచ్చి ప్రసంగించమన్నారు. ఔత్సాహికులైన యువతీ యువకు లనేకులు కన్యాశుల్కంలోని ఏదో ఒక అంశాన్ని గ్రహించి, అనుకూలంగానో ప్రతికూలంగానో మాట్లాడి సభాసదులను రంజింపజేశారు. ఈ సభకు యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించగా, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు వేదికపై ఆసీనులై ప్రసంగాలను మనోహరంగా విశ్లేషించి, వాటిలోని గుణాలను ఉటంకించారు. ఈ సదస్సు ప్రేక్షకులను మిక్కిలి ఆకట్టుకుంది.

అక్టోబర్ నెల సమాలోచనం సమావేశం 4-10-1992 ఆదివారంనాడు జరిగింది. ఈ కార్యక్రమంలో ''కరుణశ్రీ కవితాకళ'' అనే అంశంపై ప్రసంగించవలసినదిగా శ్రోతలను ఆహ్వానించారు. యువభారతి నిర్వహించే కార్యక్రమాలలో ప్రేక్షకులకు అధిక ప్రాధాన్యం ఇవ్వడం అనేకసార్లు కనిపిస్తుంది. ఇలాంటి కార్యక్రమాలకు మంచి స్పందన లభించడం, అవి బాగా విజయవంతం కావడం విశేషం. ఈనాటి కార్యక్రమానికి యువభారతి అధ్యక్షులైన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారే అధ్యక్షత వహించారు. చాలామంది వక్తలు కరుణశ్రీ కవితాకళ గురించి మనోజ్ఞంగా ప్రసంగించారు.

సమకాలీన సామాజిక సమస్యలకు యువభారతి వెంటనే స్పందిస్తుంది. ఈ సద్యస్స్పందన ఫలితంగానే 1-11-1992 ఆదివారంనాడు ''సారాకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న నారి'' అనే అంశంపై కవి సమ్మేళనం నిర్వహించింది. ఈ కవిసమ్మేళనానికి కూడా యువ కవులనుండి మంచి స్పందన లభించింది. ఈనాటి కార్యక్రమానికి కూడా యువభారతి అధ్యక్షులే అధ్యక్షత వహించారు.

ఈ సంవత్సరంలో చివరి 'సమాలోచనం' సమావేశం 6-12-1992 ఆదివారంనాడు జరిగింది. ఈ కార్యక్రమంలో ''మహాకవి మధునాపంతులవారి సాహిత్య సమాలోచనం'' ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కార్యక్రమానికి ప్రముఖ సంస్కృతపండితులు ఆచార్య రవ్వా శ్రీహరిగారు అధ్యక్షత వహించారు.

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు మధునాపంతులవారి జీవితం- సాహితీ వ్యక్తిత్వం గురించి కూలంకషంగా, అనర్గళంగా ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో ప్రసంగించాల్సిన ఆచార్య వి. సీతాకల్యాణిగారు, ఆచార్య ఎస్.వి. రామారావుగారు కొన్ని అనివార్య కారణాలవల్ల సదస్సుకు రాలేకపోయారు. మొత్తంమీద కార్యక్రమం చక్కగా జరిగింది.

ఈ సంవత్సరం యువభారతి నిర్వహించిన కార్యక్రమాలలో రజతోత్సవ విశేష కార్యక్రమాలు గాకుండా, మూడు గ్రంథావిష్కరణోత్సవ సభలు, స్త్రీలకు సంబంధించిన ఒక కార్యక్రమం, రెండు కవిసమ్మేళనాలు, నాలుగు సాహిత్యగోష్ఠులు వైవిధ్యాన్ని చాటుతూ సాహిత్య, సామాజిక, సాంస్కృతిక వికాసానికి యువభారతి చేస్తున్న సేవలను వ్యక్తీకరిస్తున్నాయి. కార్యక్రమ రూపకల్పనలోను, నిర్వహణలోను యువభారతికి యువభారతే సాటి అనడంలో అతిశయోక్తిలేదు.

# 1992 లో సాహితీ ప్రపంచం

—డా॥ ద్వా. నా. శాస్త్రి

తారీఖులు చరిత్ర కాకపోవచ్చు కాని, చరిత్రలో తారీఖులు తప్పవు. సాహిత్య చరిత్రలో కొన్ని సంవత్సరాలు, నెలలు, రోజులు ప్రాముఖ్యాన్ని కలిగి వుంటాయి. గతానుశీలనకి - వర్తమాన పరిశీలనకి తారీఖులు కొండ గుర్తులు. 1992 సాహిత్య చరిత్రలో ప్రాధాన్యంగల సంవత్సరం.

## శతజయంతులు :

సాహిత్య గతిని మార్చిన సాహితీవేత్తలకి 1992 శతజయంతి సంవత్సరం. అవధాన విద్యకి ప్రచారం కలిగించి, ఓబయ్య డిప్రెషన్ చెంబువంటి కథలు రాసి కథానికాసాహిత్యానికి పుష్టి కలిగించిన పద్య కవీంద్రులు వేలూరి శివరామశాస్త్రి గార్కి, ఆధునిక యుగకర్త అనదగిన ఆచార్య రాయప్రోలు గార్కి, ఆధునిక సాహిత్యానికి కొండంత అండగా నిలిచిన 'సాహితీ సమితి' సభాపతి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి గార్కి 1992 శతజయంతి సంవత్సరం. ఇంకా 'ఆంధ్రా వర్డ్స్‌వర్త్' కవికొండల వెంకటరావు, హాస్యరస ఘనాపాఠి మొక్కపాటి నరసింహశాస్త్రి, 'సాహిత్యరత్నాకర' పూతలపట్టు శ్రీరాములురెడ్డి, కథకునిగా, కవిగా ఆ తరంలో ప్రసిద్ధి కెక్కిన పూడిపెద్ది వెంకటరమణయ్య, ఉమర్‌ఖయ్యామ్, పంచవటి, బృందావనము, శబరివంటి మృదు మధుర కావ్యాలు రాసిన మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి ... వీరందరికీ 1992 శతజయంతి సంవత్సరమే. తెలుగులో గొప్ప సాంఘిక నాటకమైన గురజాడ వారి "కన్యాశుల్కం" కూడా నూరేళ్ళ పండగ చేసుకుంది. విజయనగరంలో ఈ పండగ వైభవంగా జరిగింది.

## పురస్కారాలు :

ప్రతి సంవత్సరం కవులకీ, రచయితలకీ పురస్కారాలు లభిస్తూంటాయి. కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు విశ్వవిద్యాలయాలే కాక వివిధ రాష్ట్ర,

ప్రాంతీయ సాహిత్య సంస్థలు కూడా బహుమతులు అందజేసి "మంచి రచన"కి గుర్తింపు కలగజేస్తున్నాయి. ప్రభుత్వం ప్రజాకవి కాళోజీని 1992 లో 'పద్మభూషణ్'తో సత్కరించింది. ఆచార్య సి. నారాయణరెడ్డి, జగ్గయ్య గార్లకు పద్మశ్రీ లభించింది కేంద్ర సాహిత్య అకాడమీ సహజ కథకుడు బరాగో రాసిన "ఇట్లు, మీ విధేయుడు" అనే కథా సంపుటికి బహుమతి ప్రకటించింది. కలకత్తాలో భారతీయ భాషా పరిషత్ సంస్థ 'సురేఖా అవార్డు'ను "హృదయ నేత్రి" నవల రాసినందుకు మాలతీచందూర్ గార్కి బహూకరించింది. రాజాలక్ష్మి ఫౌండేషన్ వారి సాహిత్య పురస్కారం ఈ సంవత్సరం పండితులు, మహా వ్యక్తి అయిన శ్రీ భాష్యం అప్పలాచార్యగారికి లభించింది. కుందుర్తి స్థాపించిన ఫ్రీవర్స్ ఫ్రంట్ ఇచ్చే ఉత్తమ వచన కవితా సంపుటి పురస్కారం అఫ్సర్ రాసిన "ఇవాళ" కి లభించింది. సుశీలా నారాయణరెడ్డి అవార్డు ప్రముఖ రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి అందుకున్నారు. నూతలపాటి గంగాధరం సాహితీ సత్కారం కె.ఎన్.వై. పతంజలి రాసిన "సర్దార్ అప్పన్న" రాజకీయ్య వ్యంగ్య నవలకి లభించింది.

'రంజని - కుందుర్తి' ఉత్తమ కవులుగా 'జలస్పృహ' కవిత రాసిన మద్దూరి నాగేష్, 'దీపంపురుగు' రాసిన సయ్యద్ జబీర్ బాషాలు ఎన్నికయ్యారు. కొప్పర్తి రచించిన "పిట్టపాడే పాటకోసం" అనే వచన కవితా సంపుటికి ఆంధ్ర మహిళాసభ వారి దేవులపల్లి అవార్డు లభించింది. ఆచార్య బేతవోలు రామబ్రహ్మం రచించిన "క్రొత్త గోదావరి" పద్యకవితా సంపుటి గరికిపాటి సాహిత్య పురస్కారం అందుకుంది. ఎండ్లూరి సుధాకర్ "వర్తమానం" సమతా రచయితల సంఘం బహుమతి పొందింది. 'ఎక్సురే' నిర్వహించిన రాష్ట్రస్థాయి కవితల పోటీలో ఎమ్.ఎస్. సూర్యనారాయణ కవితకి ప్రథమ బహుమతి లభించింది. ప్రభుత్వం కొత్తగా సృష్టించిన "భాషా సాంస్కృతిక సలహాదారులు" పదవి నారాయణరెడ్డి గార్కి లభించింది. ఆచార్య పేర్వారం జగన్నాథంగారు తెలుగు విశ్వవిద్యాలయం 'కులపతి' గా పదోన్నతి పొందారు. ముళ్ళపూడి వెంకటరమణ, బుజ్జాయిలు బాల సాహిత్యానికి చేసిన సేవలకి "బాలబంధు" బిరుదులు పొందారు. తిరుమల రామచంద్రగార్కి పలుపుల వెంకటశివయ్య స్మారక బహుమతి, సోమసుందర్‌గార్కి తెలుగు విశ్వవిద్యాలయ సత్కారం లభించాయి.

## సంతాపదినాలు :

1992 'కాలధర్మం' అనుసరించి కొందరు రచయితల్నీ, కవుల్నీ తనతో పాటు తీసుకుపోయింది. ఆంధ్రప్రభ మాజీ సంపాదకులు, పండితులు నీలంరాజు వెంకట శేషయ్యగారు, ప్రసిద్ధకవి, విమర్శకులు వావిలాల సోమయాజులుగారు, ప్రసిద్ధ పండితులు బృందావనం రంగాచార్యులుగారు, ప్రసిద్ధ సాహితీవేత్త ఆచంట జానకిరామ్‌గారు (24-2-92) ఈ సంవత్సరంలో కీర్తిశేషులయ్యారు. ఈ శతాబ్దంలో పద్యకవిత్వంలో విప్లవం సృష్టించిన మధురకవి - 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు 22-6-92న స్వర్గస్థులయ్యారు. 7-11-92న పద్యకవితా సంప్రదాయానికి వారసుడిగా నిలిచిన అభినవ నన్నయ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు పరమపదించారు. నాటక రంగానికి ఎనలేని సేవచేసిన ఎ. ఆర్. కృష్ణగారు, యక్షగాన వాఙ్మయాన్ని వెలుగులోకి తెచ్చిన సరసకవి ఆచార్య యస్వీ జోగారావుగారు 1992లో మరణించారు.

## పద్యకవితారంగం :

'పద్యకవిత్వానికి కాలం చెల్లింది' అని కొందరు ఎంతగా బుకాయిస్తున్నా అది నిజం కాదని 1992 మరోసారి నిరూపించింది. వచన కవిత్వం అరవై ఏళ్ళ పండుగ చేసుకున్న తర్వాత పద్యకవిత్వం మళ్ళీ వాప్తిలోకి వచ్చింది. అష్టావధానాలు, శతావధానాలు ప్రజల్ని బాగా ఆకట్టుకున్నాయి. మేడసాని మోహన్, మాడుగుల నాగఫణిశర్మ, కడిమిళ్ళ వరప్రసాద్ ప్రభృతులు అవధానాల ద్వారా పద్యకవిత్వానికి మరింత ప్రాచుర్యాన్ని కలిగించారు. అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు ఏర్పాటు చేసిన (19-1-92) జువ్వాడి గౌతమరావు గారి పద్య పఠనం, విశాఖలో రావిశాస్త్రి ప్రభృతుల సమక్షంలో ఆయనే నిర్వహించిన పద్య పఠనం పద్యకవితా రహస్యాలను, వైశిష్ట్యాన్ని చాటి చెప్పిందని అత్యాధునికులే ప్రశంసించారు. ఆంధ్రప్రభ వారపత్రికవారు వచన కవితలతోపాటు పద్యకవితలకి కూడా పోటీ నిర్వహించారు. పద్యకవితల పోటీకి 300 ఎంట్రీలకిపైగా వచ్చాయి. ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, జోస్యము విద్యాసాగర్, ఎల్.ఎన్. మల్లీశ్వరి, రసరాజు ప్రభృతులు బహుమతులు పొందారు. ఈ పద్యకవితకి న్యాయనిర్ణేతగా వ్యవహరించిన ఆచార్య సంపత్కుమారగారి ఈ మాటలు పరిశీలించాలి - "ఈ పద్యకవితల పోటీకి దేశం నలుమూలల నుంచి పద్యకవితలు వచ్చినాయి. ఒక చిత్ర

మేమిటంటే - వచన పద్య కవులుగా నిలదొక్కుకున్న కవులు కూడా తమ పద్య రచనలు ఈ పోటీకి పంపటం." (ఆంధ్రప్రభ వారపత్రిక : ఏప్రిల్ 1-7-1992)

1992లో దాదాపు ఇరవై పద్యకవితా సంపుటులు (కావ్యాలు, శతకాలు మొదలైనవి) వెలువడినట్లు తెలుస్తోంది. రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో చాలా మంది పద్యకవులున్నారు. "ఆంధ్ర పద్యకవితా సదస్సు" స్థాపించబడింది. 9-2-92న రాజమండ్రిలో పద్యకవితా సదస్సు వైభవంగా నిర్వహించబడింది. బాలగంగాధర తిలక్ పద్యకవితలు పుస్తక రూపంగా వెలువడ్డాయి. ఆయాచితం నటేశ్వరశర్మ సామాజిక చిత్రీకరణతో "ఋతుగీత" ప్రచురించారు. "ఎయ్యది దేశకావ్యమున నెయ్యపు టంగిరసము భారతీ" అంటూ దేశభక్తిని ప్రేరేపిస్తూ కసిరెడ్డి వెంకటరెడ్డి "చైతన్యశ్రీ" అనే పద్యకవితా సంహిత రచించారు. అయోధ్య సమస్యపై కసిరెడ్డి అభిప్రాయాలతో ఏకీభవించనివారైనా పద్యకవితా శక్తిని మెచ్చుకుంటారు. కడిమిళ్ళ వరప్రసాద శతావధాని రచించిన "మధు జీవనము" విశిష్ట కావ్యం. సమకాలంలో ఉన్న మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి జీవిత సాహిత్య చరిత్ర ఇతివృత్తంగా రాయబడిన పద్యకావ్యం ఇది. ఇటువంటి తరహాకావ్యాలో ఇదే మొదటిదని కొందరి అభిప్రాయం. శుకవాణీ చతుర్ముఖుల సంభాషణగా, ఆంధ్ర పురాణాన్ని కవులు సమీక్షిస్తున్నట్టుగా రచించడం మరొక విశేషం. ఆంధ్రజ్యోతి వారపత్రిక నిర్వహించిన సమస్యా పూరణలలో చాలా మంది పాల్గొని సామాజిక స్పృహతో పద్యాలు రచించారు. ఆరుద్ర ఆంధ్రప్రభలో కేరాలక్ష్మి మకుటంతో రాసిన పద్యాలు సంచలనం కలిగించాయి.

## వచనకవితారంగం :

వచన కవిత్వం 1990 నుంచి కొత్త తొడుగులతో వ్యాపిస్తోంది. అభివ్యక్తి లోను, శిల్పంలోను వినూత్నత్వం కనబడుతుంది. అదే ధోరణి 1992లోనూ కనిపిస్తుంది. ఈ సంవత్సరంలో నా దృష్టికి వచ్చినంతవరకు ఒక ఇరవై వచన కవితా సంపుటాలు వెలువడ్డాయి. ఇవికాక వచన కవితలు గల పత్రికలు వెలువడ్డాయి. సంతకాలు, మంజీర వంటివి. జయప్రభ, మందరపు హైమవతి, కె. గీత మొదలైన కవయిత్రులు స్త్రీవాద ధోరణితో కవితలు రచించారు. 1992 లో స్త్రీవాద కవిత్వంపై వాదోపవాదాలు వాడిగా వేడిగా జరిగాయి. 1953 లో రాయబడి

1955 లో తొలి ముద్రణ పొందిన కుందుర్తి ప్రసిద్ధ కావ్యం "తెలంగాణ" విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారివల్ల పునర్ముద్రణకి నోచుకుంది.

"కవిత్వం ఒక మెస్మరిజం
కవి కన్ను ఒక ప్రిజం
నేను సృష్టించిన అలంకారం
నీ అంధకారానికి దీపం"

అన్న శేషేంద్ర తన పూర్వ కావ్యాలన్నిటినీ గుదిగుచ్చి "ఆధునిక మహా భారతము"గా ప్రచురించారు. ఇదొక ఇతిహాసంగా ఆయన పేర్కొన్నారు. శేషేంద్ర అభిప్రాయాలతో ఏకీభవించినా ఏకీభవించకపోయినా వచన కవితా వికాసంలో ఆయన పాత్రను కాదనలేరు. శేషేంద్ర వచన కవిత్వమంతా ఒక సంపుటిగా వెలువడటం సంతోషించదగినదే.

"అభ్యుదయ కవిత్వంలో నయాగరా కవుల ప్రభావం ఎంతటిదో వచన కవిత్వంలో "చేతనావర్తం" సృజించిన కవుల ప్రభావం అంత గాఢమైనది. 'చేతనావర్తం' వచన కవితాయుగంలో కొత్త శకాన్ని సృష్టించిందనటం అతిశయోక్తి కాదు" అని రామమోహన్‌రాయ్, తదితర విమర్శకులు వ్యాఖ్యానించారు. 1967 లో ప్రథమ ముద్రణ పొందిన 'చేతనావర్తం' వచన కవితా సంకలనం మళ్ళీ (ద్వితీయ సంపుటితో కలిపి) రజతోత్సవ ముద్రణగా 1992 లో వెలువడింది. సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, సంపత్కుమార, వే. నరసింహారెడ్డి. వీరిని చేతనావర్త కవులుగా అంచనా వెయ్యడానికి ఈ కవితా సంపుటి ఉపకరిస్తుంది. 'రంగాజమ్మ' కావ్యకర్తగా, 'కవనవిజయం' సృష్టికర్తగా, "వెలుతురు స్నానం" కవిగా పేరొందిన నాగభైరవ కోటేశ్వరరావు తన బొమ్మ ప్రతి పేజీలో ఉండేలా ప్రచురించిన వచన కవితా సంపుటి "పతాకశీర్షిక."

"నీ మురళీరవం వికృతస్వరమై
నిన్నే బధిరుణ్ణి చేస్తోంది
చెర్నాకోల నీ వీపునే బాదుతుంది.
నీవు సంధించిన అస్త్రం
రివర్స్‌గేర్‌లో నీకే ఎసరుపెడుతోంది.
సముద్రం పంపిన అలలు
చెలియలికట్టను చెరిపేస్తున్నాయి"

అని ఉపాధ్యాయుడిపై నాగభైరవ మంచి కవిత రచించారు. ఇందులో ఉన్న ఇరవై ఆరు కవితల్లో అయిదారు తప్ప అన్నీ హృదయాన్ని స్పృశించేవే.

అద్దేపల్లి రామమోహనరావు "గోదావరి నా ప్రతిబింబం" అనే మంచి కవితా సంపుటి వెలువరించారు.

"కవిత రాసిన క్షణాలు మాత్రమే నీవి!
నీ అక్షరాల పక్షులు పత్రికల గూళ్ళలో కెగిరిపోయి
కీర్తి గుడ్లు పెట్టి
ప్రజల మనస్సులో పొదుగుతున్నప్పుడు
ఆ క్షణాలింకా నీవి కావు"

అంటూ అద్దేపల్లి తమ అభ్యుదయ భావాల్ని అనుభూతి కవితతో మేళవించి ఈ కవితా సంపుటి రచించారు. నాగభైరవ, అద్దేపల్లి వెనకటి తరంలో లబ్ధ ప్రతిష్ఠులైన కవులు. వీళ్ళిద్దరూ ఈ తరం కవులతో పోటీగా వచన కవితా సంపుటాలు వెలువరించడం గమనించదగింది.

1992లో ఈ తరం కవులు వెలువరించిన వచన కవితా సంపుటాలలో నా పరిధికి లోబడి తొమ్మిదింటిని ప్రస్తావించదలచుకొన్నాను. ఈ తొమ్మిది ఉత్తమ కవితా సంపుటాలు అనడంలో సందేహం అక్కర్లేదు. ఈ తొమ్మిది లోనూ ఎండ్లూరి సుధాకర్ రచించిన "వర్తమానం" సంపుటికి నేను ప్రథమ స్థానం ఇస్తాను. సామాజిక పరిశీలన, అనుభూతి, శిల్పం, సారళ్యం, స్పష్టత లక్షణాలు ''వర్తమానం"కి ఆ స్థానాన్ని కల్పిస్తాయి. ఆచార్య గోపీ అన్న "నీది అప్లైడ్ కవిత్వంగా సంభావిస్తున్నాను. నీ జీవితంలో లేనిది ఏదీ నీ కవిత్వంలో లేదు'' మాటలు నిజాలు.

"అర్ధరాత్రి భార్యాబిడ్డల్ని విడిచి
ప్రతిరాత్రీ గౌతమ బుద్ధుడవుతాడు.
మనకు జీతం వచ్చిన రోజునుంచీ
అతడు తన జీవితం తాడు వేసుకుంటూ పోతాడు''

అని గూర్ఖామీదా రాసిన కవితగానీ,

"నాన్న కొట్టినప్పుడు
ఒక మూల ముడుచుకొని పడుకున్న అమ్మలా వుంటుంది"

అని గ్రీష్మ గోదావరిని వర్ణించినపుడుగానీ-

"ఈ నగరం తనని తాను కోల్పోయింది
మతం సూదుల్తో తన ఒంటినే కుట్టేసుకుంది"

అని రక్త నగరాన్ని, మన హృదయానికి కట్టేసినప్పుడు గానీ సుధాకర్ 'వర్తమానకవి' అనీ, నిసలైన కవి అనీ అప్రయత్నంగానే అంగీకరిస్తాం.

కొత్త వస్తువును ఎన్నుకోవటంలోనూ, పాతవస్తువును కొత్తగా చిత్రీకరించడంలోనూ తనదైన శైలీ విన్యాసాన్ని జోడించటంలోనూ ప్రతిభ కనబరచిన కొత్తకవి ''భగ్వాన్." ఈ మాటలు సత్య సన్నిహితాలని అతని మొదటి కవితా సంపుటి "శబ్దాల్ని ప్రేమిస్తూ" మనకి సాక్ష్యం చెప్తుంది.

"మనకతని పేరు తెలీదు ఊరు తెలీదు
అయినా తన కళ్ళను
మన ఇళ్ళచుట్టూ సెర్చిలైట్లను చేస్తాడు
తన చూపుల బలగాలను
మనదారులపై కవాతు చేయిస్తాడు
మన వెన్నెముకను నిమిరే గొంతు అది"

అంటూ "అపరిచితుడు" కవితలో గూర్ఖాను కొత్తగా దర్శిస్తాడు. ఎవ్వరూ రాయని (రాయలేని విధంగా) "పనిమనిషి"పై ప్రతివారు చదవలసిన కవిత రాశాడు. ఈ సంపుటిలో ఒకనాడు ప్రాచుర్యం పొందిన "మినీకవితలు" కూడా చోటు చేసుకున్నాయి.

"మనం ఇప్పుడు సంక్షోభ రేఖల మీద పయనిస్తున్నాం
స్వయంప్రకాశం లేని చంద్రులు
సూర్యుడ్ని మరుగున దాస్తున్నారు....''

అంటూ స్పష్టతతో, సంయమనంతో అడిగోపుల వెంకటరత్నం ''యుద్ధమంటే మాకు భయంలేదు'' అనే కావ్యం రచించారు.

దర్భశయనం శ్రీనివాసాచార్య ఈ తరం మంచికవుల్లో ఒకరనటానికి ''ప్రవాహం'' వచన కవితా సంపుటి నిదర్శనం. ఇందులో ప్రిజమ్ లాంటి జీవితాన్ని వ్యాఖ్యానించిన తీరు ప్రశంసనీయం. జీవితం పట్ల జీవిత సౌందర్యంపట్ల ప్రగాఢ ప్రేమ గల శ్రీనివాసాచార్య శైలికి ఒక ఉదాహరణ-

"అసహనం సైతం అవసరమే
అసహనంలోనే కాలం చెల్లిన సూత్రాలు
సరికొత్తగా పునర్నిర్వచింపబడతాయి
అసహనంలోనే కుళ్ళిపోతున్న సంబంధాలు
తీవ్రంగా శాశనమవుతాయి.''

"మౌలికంగా సత్యవతీదేవి కవిత్వం కాల్పనిక భావవాదానికి చెందింది. తోటలో ఎగిరే వన్నె వన్నెల సీతాకోక చిలుకలు ఆమె కవితలు" అని పాపినేని శివశంకర్ అంచనా వెయ్యడంలో కొంత సత్యం వుంది. ఎక్కువగా అనుభూతి కవిత్వం ''రెక్కముడవని రాగం'' అనే సంపుటిలో కనిపిస్తుంది.

''అల్లరల్లరిగా అలా పిల్లలు బళ్ళోకెడుతూంటే
అల్లి బిల్లి పదాలొచ్చి ఆలోచనల్లో దూరినట్లుంటుంది
అంతలోనే ఒద్దికగా ఒక పద్ధతిలో నిలబడి ప్రార్థన చేస్తుంటే
అరే - ఇంత అలతి పదాలలో అంత మంచి కవితా అని
గుండె కేరింతలాడుతుంది."

చేరా చెప్పినట్టు ఆదూరి సత్యవతీదేవి 'సొంతపదాల' కోసం ప్రయత్నం చేస్తున్నట్టు గమనిస్తాం. అయితే అనుభూతితోపాటు సామాజిక తపన కూడా ఆమె నుంచి కోరటంలో తప్పులేదుకదా!

నలుగురు రాసిన ముందు మాటలతో సమాజంలోని అన్యాయాలను, కుహనా రాజకీయాలను చీల్చి చెండాడే తీవ్ర అభ్యుదయ కవితా సంపుటి "అగ్నిశ్వాస"ను పి.సి. రాములు అందించారు. తొలి కవితాసంపుటి కాబట్టి ఆవేశం ఎక్కువగా కనిపిస్తుంది. అలాగని కవిత్వం పలచగా ఉండనే ఉండదు. కవిత్వంలేని ఖండికలు చాలా తక్కువ. చమత్కారత్వం కూడా లేక పోలేదు. రాములు కవిత్వం ఇలా ఉంటుంది—

"వాడు కుర్చీలో కూర్చొనేంతవరకే
నీ చెవిలో జోరీగై వల్లించే వాగ్దానాలకు ముగ్ధుడవవుతావు
స్వర్గం
నీ యింటి తలుపు తట్టిందని రంగుల కలల్లో విహరిస్తావు
వాడువేసిన నోట్లో గాలానికి
తగుల్కొన్న చేప ఓటువవుతావు
వాడు విసిరిన మాయమాటల వలలో చిక్కిన
సగటు కపోతానివవుతావు
వాడు హృదయంలేని కొయ్యగుర్రమవుతాడు."

'వర్తమాన పల్లె జీవనచిత్రణ'ను తనదైన అభివ్యక్తితో నిసర్గంగా అస్పష్టత లేకుండా వచన కవిత్వం రాయగల ఏలేశ్వర నాగభూషణాచార్య మంజీరా రచయితల సంఘంద్వారా ప్రచురించిన కవితాసంపుటి - "నేల తడవని వాన."

''కనపడని కత్తులమీద
కుత్తుకల్ని ఆరేసుకుంటున్నాం''

''పాతరాతియుగం మనిషి ఆకుల్ని ధరించినట్టు
రూపాయల రేకుల్ని ధరించాలని
పాకుడుబండపైకి మొసలి పాకుతున్నట్టు పాకుతున్నాము'' అనే పంక్తులు సినారెగారి ప్రశంసలు పొందాయి. ఈ కవిలో కవితాశక్తి ఉన్నమాట నిజమే.

''మనిషే మనిషికి చిరునామా
మనిషిని మనిషి వెదుక్కోవడం ఇక్కడ ఆనవాయితీ''

''ఎవరు పూరిస్తారు ఈ ఖాళీని
అరచేతుల గీతలమధ్య జీవితం ఇమిడిపోయింతర్వాత''

''ఈ నిద్ర నాకు శాపం
ఊహలకుంచెలో ఊయల నిలవడంలేదు''

— ఈ విధంగా కొత్తగా చెప్పే ప్రతిభ ఉన్న యాకూబ్ ''ప్రవహించే జ్ఞాపకం'' అనే కవితా సంపుటి ప్రచురించాడు. ప్రతీకలు, భావచిత్రణలు ఎక్కువ. వైయక్తికమైన విషయాలకి స్పందించి రాయటమూ కనబడుతుంది. 'సంక్లిష్టత' వైపు పయనించకుండా ఉంటే మంచిది.

'గుండెకింద తడి' కవితా సంపుటిద్వారా బహుమతులు పొందిన కోట్ల వెంకటేశ్వరరెడ్డి 1992 లో "రహస్యాలు లేనివాళ్ళు" అనే చిన్న కవితా సంపుటి (27 కవితలు) ప్రచురించాడు. "రాయవలసిన పద్యమొకటి రాయనప్పుడు...." అనే కవిత కవి పడే తపనని చక్కగా వ్యక్తం చేస్తుంది. శేషేంద్రని ఉద్దేశించి రాసిన కవితలో వైయక్తికమైన విద్వేషం కనబడుతుంది.

"కత్తుల కుర్చీమీద కూర్చోవడం
నాకేమీ కొత్తకాదు
కానీ కూర్చునప్పుడల్లావేసే
ఆ బాధ మాత్రం కొత్తదే!" (కత్తుల కుర్చీ)

అనే కవిత గొప్ప స్త్రీవాద కవిత. స్త్రీవాద కవిత్వం పురుషులు కూడా బాగా రాయగలరనటానికి ఇది మంచి ఉదాహరణ.

విడిగా వివిధ పత్రికలలో లబ్ధ ప్రతిష్ఠులు, యువకులు ఎన్నో వచన కవితలు రచించారు ప్రతి వారపత్రికలోను, దినపత్రికల (ఈనాడు తప్ప)లోను కవితలకి ప్రాధాన్యం ఇవ్వబడింది. ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచికలో కవితలకి ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఆంధ్రజ్యోతి వారపత్రిక ప్రచురించే "ఈ వారం కవిత"లో రెండు మూడు తప్ప మంచి కవితలే చోటు చేసుకుంటున్నాయి. అయితే విడిగా పత్రికలలో అస్పష్ట, సంక్లిష్ట కవితలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ముదిగొండ వీరభద్రయ్య, చేరా, సుమనశ్రీ, శివారెడ్డి వంటి వాళ్ళకి తప్ప ఇతరులకి అర్థంకాని కవితల సంఖ్య తక్కువేమీ కాదు. అజంతా, ఆరుద్ర, నారాయణరెడ్డి, శ్రీకాంతశర్మ, శివారెడ్డి వంటివారు కవిత్వం రాస్తూనే వున్నారు, ఇస్మాయిల్ 'హైకూలు' రచించారు. సినారె ఈతరం కవితో సమానంగా రాయాలనే ప్రయత్నంలో చాలామటుకు సఫలీకృతులయ్యారు. అయోధ్యలో బాబ్రీమసీదు సంఘటనపై కొందరు స్పందించారు. చేనేత కార్మికులపై కూడా మంచి కవితలు వెలువడ్డాయి.

## కవిత్వ పత్రికలు :

తెలుగులో ప్రత్యేకంగా కవిత్వానికి పత్రికలు 1991 నుంచి ఎక్కువయ్యాయి. రాజమండ్రి నుంచి కొందరు యువకవులు 'కంజిర' అనే పొయెట్రీ బులెటిన్ వెలువరిస్తున్నారు. తెనాలి నుంచి పొయెట్రీ ఫోరమ్ వారు "సంతకాలు" తీసుకొస్తున్నారు. నల్గొండ జిల్లా అరసం యూనిట్ "గ్రీష్మం" ప్రచురించింది. సుమనశ్రీ సంపాదకత్వంలో హైదరాబాదు నుంచి "అభిజ్ఞ" అనే మూడు కవితా బులెటిన్‌లు 1992 లో వెలువడ్డాయి. ఈ బులెటిన్‌లు అయిదు రూపాయలకి, మూడు రూపాయలకి దొరకటం విశేషం. తంగిరాల సుబ్బారావు, ఆర్వీయస్ సుందరం సంపాదకులుగా వెలువడుతున్న "చైతన్యకవిత" పత్రిక కొన్ని కారణాలవల్ల సక్రమంగా వెలువడలేదు. 1991 సంవత్సరానికి ఒక్క పత్రికను 1992 జూన్‌లో ప్రచురించారు. వేగుంట మోహనప్రసాద్ ముఖచిత్రంతో వెలువడిన ఈ "చైతన్యకవిత"లో మంచి కవితలున్నాయి. ఉత్పల సత్యనారాయణాచార్య చిత్రం పత్రిక వెనుకవైపు వేశారు. ప్రతి సంచికలోను కనిపించే అనువాద కవితలు ఈ సంచికలో చోటు చేసుకోలేదు.

## విమర్శ - పరిశోధన :

దినపత్రికలు సాహిత్యానికి ప్రత్యేకంగా పేజీలు కేటాయించడం వల్ల విమర్శలు ఎక్కువగానే వెలువడ్డాయి. కొన్ని పత్రికలు వివాదాస్పద విషయాలకే ప్రాధాన్యం ఇచ్చాయి. స్త్రీవాదంపై చాలా పత్రికల్లో వాదోపవాదాలు చెలరేగాయి. జ్వాలాముఖి స్త్రీవాదకవితల్ని "నీలికవితలు" అనడంతో విమర్శలు వాడిగా వేడిగా జరిగాయి. కె. ఎస్వీ, చేరా, చందు సుబ్బారావు, ద్వానా శాస్త్రి, ఓల్గా, కాత్యాయనీవిద్మహే, అద్దేపల్లి రామమోహనరావు ప్రభృతులు ఈ స్త్రీవాద వాదంలో పాల్గొన్నారు.

"రచయితల గురించిన అంచనాలో చారిత్రక పరిమితులతోపాటు సాంస్కృతిక పరిమితులను కూడా పరిగణనలోకి తీసుకోవలసిన బాధ్యత ఇప్పుడు ఏర్పడింది. రచయిత ఏ ప్రాంతం నుంచి, ఏ తరగతి నుంచి. ఏ ఆర్థికస్థితి నుంచి వచ్చారనే అంశాల్ని కూడా ప్రమాణంగా గ్రహించాలి" అంటూ శేషం లక్ష్మీపతిరావు ఆంధ్రజ్యోతి (మే, 18, 1992) లో "కొత్త

ప్రశ్నలకు కొత్త జవాబులు వెదకండి" అనే వ్యాసం రాశారు. అందులో "సాహిత్య చరిత్ర రచనలో, కీర్తిప్రపంచకాలలో అణగారినవారికి రిజర్వేషన్లు కల్పించాలి. ప్రత్యేక బోనస్ మార్కులు ఇవ్వాలి" అంటూ వెలిబుచ్చిన అభిప్రాయాలు చర్చకి దారితీసాయి.

దీనికి త్రిపురనేని మధుసూదనరావు సుదీర్ఘమైన సమాధానం ఇచ్చారు. ఆర్ద్ర ఆంధ్రప్రభ వారపత్రికలో చలసాని ప్రసాద్ అభిప్రాయాలన్నీ పచ్చి అబద్ధాలంటూ వారం వారం "అవీ-ఇవీ" శీర్షికలో ఖండిస్తూ విమర్శించారు. ఆంధ్రభూమి దినపత్రికలో "సాహితీ గవాక్షం"లో ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సంచలనం కలిగించే విధంగా విమర్శ వ్యాసాలు వ్రాశారు. వాటిలో కొన్నిటిపై చర్చలు కూడా జరిగాయి. శివారెడ్డి కేంద్ర సాహిత్య అకాడమీ ఎవార్డును, కాళీపట్నం రామారావు 'యజ్ఞం' సినిమాకి నంది అవార్డును పుచ్చుకోవడంపై విమర్శలు వెలువడ్డాయి. కల్లూరి ప్రభ దినపత్రికలో "సమాంతరమ్" శీర్షికలో కొన్ని కొత్త ఆలోచనలను తెలిపాడు.

1992 లో ఆంధ్రప్రభ సాహితీగవాక్షం ద్వారా ఒక కొత్త విమర్శకుడు వెలుగులోకి వచ్చాడు. అతని పేరు వల్లభాచార్య. నిర్భయంగా తన అభిప్రాయాలను వ్యక్తీకరించటం, వ్యక్తీకరించిన వాటికి ఆధారాలు చూపడం, వినూత్నంగా ఆలోచించటం వల్లభాచార్య విమర్శలో కనిపిస్తాయి. "పద్యం పాటగా లయలొలికినవేళ", "నన్నయ'వార్త' పత్రిక వార్త ఒక్కటేనా?" "మాగదుడు మళ్ళీ పుట్టాడు", "అకవితా, నీకు జోహార్" వంటి వల్లభాచార్య వ్యాసాలు తెలుగువారికి కొత్త. రాజమండ్రి నుంచి వెలువడే "సమాలోచన" పత్రికలో సంప్రదాయ సాహిత్యంతోపాటు ఆధునిక సాహిత్యంపై కూడా విమర్శ వ్యాసాలు చోటు చేసుకోవడం గమనించవలసిన అంశం. దక్షిణభారత హిందీ ప్రచారసభవారి "స్రవంతి" అన్నితరాల వారికి ప్రతినిధిగా ఉంటుంది. అభ్యుదయ, ప్రజాసాహితి, అరుణతార పత్రికలలో విమర్శ వ్యాసాలు ఆయా ప్రచురణ సంస్థల దృక్పథాలకి అనుగుణంగా ఉంటాయి.

ఆలపాటి రవీంద్రనాథ్ సంపాదకత్వంలో అందంగా వెలువడే 'మిసిమి' పత్రికలో కూడా ఉత్తమమైనవిమర్శ వ్యాసాలున్నాయి. పురాణం సుబ్రహ్మణ్య

శర్మగారు వివిధ రచయితలతో మధురవాణి సంభాషణను కొత్త పద్ధతిలో విమర్శా పూర్వకంగా సమర్థవంతంగా నిర్వహించారు. ఈ మిసిమి పత్రికలో రసం, కావ్యానందం, షెల్లీ మొదలైన అంశాల మీద కూడా విమర్శ వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. తెలుగు అకాడమీ వారు ప్రచురిస్తున్న "తెలుగు" వైజ్ఞానిక మాసపత్రిక (సక్రమంగా వెలువడక పోయినా) భాషా సాహిత్య విభాగంలో పామాణికమైన, విలువైన వ్యాసాల్ని ప్రచురిస్తోంది.

1992 లో వెలువడిన 'తెలుగు' వ్యాసాలలో "వసుచరిత్రలో మోడల్ సింబాలిజాలు", "శ్రీశ్రీ ప్రతీకతా శిల్పం", "వచన కవిత్వం - వ్యూహం, నిర్వచనం", "ప్రాకృత ప్రకృతి", ''భావకవిత్వంలో కృష్ణతత్త్వం", "ఆధునిక తెలుగు నాటకం - పరిణామ వికాసం," "సాహిత్యంలో వ్యవసాయ జీవనం - ఒక పరిశీలన" మొదలైనవి పేర్కొనదగినవి. కన్యాశుల్కం శత జయంతి సందర్భంగా వెలువడిన ప్రత్యేక సంచికలో విలువైన, ఆలోచనాత్మకమైన వ్యాసాలున్నాయి. 'యువభారతి' సంస్థ రజతోత్సవం సందర్భంగా వెలువరించిన "వెండివెలుగులు" ఒక ఉత్తమ సాహిత్య సంచిక అనవచ్చు. ఇందులో కీర్తిశేషుల అపూర్వ రచనలు కూడా చోటుచేసుకోవటం విశేషం. "ఆధునిక కవిత - కవయిత్రులు", "విశ్వనాథ మధ్యాక్కరలు - వస్తు పరామర్శ", "తెలుగు ఋతువులు - విశ్వనాథ, శేషేంద్ర", "తెలుగు సాహిత్య విమర్శలో దేశీయతాన్వేషణ", ఆధునిక తెలుగు కవిత్వం - అభావ పద్యధోరణి," "నామిని రచనలు - ఒక వివేచన" వంటి విమర్శ వ్యాసాలు కొత్త వెలుగుల్ని ప్రసరింపజేస్తాయి. ఈ విధంగా మరికొన్ని ప్రత్యేక సంచికలలో సాహిత్య వ్యాసాలు చోటు చేసుకున్నాయి.

1992 లో కూడా ఎప్పటిలాగే "చేరాతలు" నలుగురి నోళ్ళలో చర్చనీయాంశం అయింది. 'సాహిత్య కాలమ్' ద్వారా అంతో ఇంతో సంచలనం లేదా కోపం కలిగిస్తున్న 'చేరా' ఇంతకాలం క్రమం తప్పకుండా రాయటం సామాన్యమైన విషయం కాదు. ఆధునిక వచన కవిత్వాన్ని విశ్లేషించటం ద్వారా, మంచి కవుల్ని వెలుగులోకి తీసుకురావటం ద్వారా, నాటకీయమైన శైలి ద్వారా చేరాతలు ఆసక్తిని కలిగిస్తున్నాయనటంలో సందేహం లేదు. అయితే తానొక పైఅంతస్తులో ఉన్నట్టు భావించటం, తన కిష్టమైన కవిని ఆకాశానికి ఎత్తెయ్యడం, మంచి కవుల్ని పట్టించుకోకపోవడం వంటి లోపాలు లేకపోలేదు. అయితే అది

సాహిత్య చరిత్ర కాదు కాబట్టి ఆ మాత్రం లోటుపాటులు తప్పవు. 1992 లో చేరాతల వల్ల చేరాకి స్వస్థానాభిమానం, భావకవితా ప్రియత్వం, ఇగోలు అంట కట్టబడ్డాయి. వెల్చేరు నారాయణరావుతో పేచీపడ్డారు. పద్య పఠనాన్ని ప్రశం సించారు. చేరాతలవల్ల 'చేరా' ఏ జెండాలేని విమర్శకుడిగా నిలబడ్డారని చెప్పటం సముచితం.

ఇక విమర్శ గ్రంథాలు 1992 లో పదిహేను పైగా వెలువడ్డాయని తెలుస్తోంది. "తెలుగు పత్రికల సాహిత్య సేవ" అనే గ్రంథాన్ని తిరుమల రామ చంద్రగారు రచించారు. తెలుగు పత్రికల ఆవిర్భావం నుంచి ఆధునికయుగం వరకు పత్రికల సేవని, పరిణామక్రమాన్ని చక్కగా వివరించారు. అయితే ఆనందవాణి, నవత, ఢంకా, జ్వాల, సాధన, నందిని, సృజన, స్పందనవాణి వంటి పత్రికలను కూడా చేర్చి ఉండవలసింది. మార్క్సిస్టు సాహిత్య విమర్శలో జరిగిన, జరుగుతూన్న తప్పిదాలను రాల్ఫ్‌ఫాక్స్ తెలియజేశాడు. అతని గ్రంథాన్ని వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారు "నవల - ప్రజలు"గా అనువదిం చారు. ఇందులో ఆలోచించవలసిన, తర్కించవలసిన విషయాలు చాలా ఉన్నాయి. విమర్శకులకి, నవలా రచయితలకి ఇది పాఠ్య గ్రంథం అనవచ్చు. పింగళి వేంకట కృష్ణారావుగారు రచించిన "కాటూరి వారి సాహితీ సమాలోచ నము" డాక్టరేట్ డిగ్రీ పొందవలసిన పరిశోధనా గ్రంథం. కాటూరి వేంకటేశ్వర రావుగారి పద్య కావ్యాలను, రూపకాలను, వ్యాసాలను, అనువాద రచనలు సమ గ్రంగా విమర్శించి రచించిన మంచి పుస్తకం ఇది.

ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మగారు ప్రతి సంవత్సరం ఏదో ఒక పుస్తకం వెలువరిస్తూంటారు. 1992 లో ఈయన "రామాయణ వ్యాసాలు" ప్రచురించారు. భారత దేశంలోనూ, విదేశాలలోను ప్రచారంలో ఉన్న రామాయణ విశేషాల్ని, వివిధ భాషలలో గల రామకథా సాహిత్యాన్ని శర్మగారు 22 వ్యాసా లలో సమీక్షించిన తీరు ప్రశంసార్హం. సామెతల స్వరూప స్వభావాల గురించి, సామెతలలో ప్రతిబింబించే సాంఘిక జీవితం గురించి, సాహిత్యంలో సామెతల ప్రస్తావన గురించి విలువైన సమాచారంతో - కొంత విమర్శలో అక్కిరాజు రమాపతిరావుగారు "తెలుగు సామెతలు - సాంఘిక జీవితం" అనే గ్రంథం రచిం చారు. 1940 - 1990 మధ్య గల తెలుగు నాటకరంగంపై ఎంతో శ్రమపడి,

విశ్లేషించి జయప్రభ "నాలుగో గోడ" గ్రంథాన్ని రచించారు. జయప్రభగారి అభిప్రాయాల్లో, వ్యాఖ్యానాల్లో, తారీకుల్లో కొన్ని లోపాలు కనిపిస్తాయి. అయితే తెలుగు నాటి నాటక ప్రదర్శనల గురించి, సంస్థల గురించి, నాటకాల గురించి, ప్రయోక్తల గురించిన సమాచారం గ్రంథస్థం కాలేదు. "నాలుగో గోడ" పుస్తకం కొంతవరకు ఆ లోటును భర్తీ చేస్తుంది. కవిత - లయాత్మకత, పద్య కవిత - లయాత్మకత, గేయ కవిత - లయాత్మకత, వచన కవిత - లయాత్మకత అనే నాలుగు సుదీర్ఘ వ్యాసాలతో యువభారతి వారు ఆచార్య సి. నారాయణ రెడ్డిగారి "తెలుగు కవిత - లయాత్మకత" అనే గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో కొన్ని అంశాలు విమర్శకులకి నచ్చకపోయినా ఒక కొత్త కోణంలో ఆలోచింపజేసే వ్యాసాలున్నాయి. డాక్టర్ చలసాని సుబ్బారావుగారు కొత్త ఆలోచనలతో, మరో కోణం నుంచి పరిశీలించి "మహర్షి వేదవ్యాసుడు" అనే గ్రంథం రచించారు. ఎవ్వరూ చెప్పని విషయాలను ఇందు స్పృశించారు.

కాకతీయుల భాషా సాహిత్య సేవ, బద్దిరాజు సోదరుల సాహిత్య సేవ, గొంధశే వీథి భాగోతాలు, ఆరె జానపద గాథలు మొదలైన నూతన అంశాలను పరిశీలించి ఆచార్య పేర్వారం జగన్నాథంగారు "సాహితీ వసంతం" అనే వ్యాస సంపుటి ప్రచురించారు. యువభారతి రజతోత్సవం సందర్భంగా (1965-90)- "పాఠికేళ్ళ పత్రికారచన" అనే గొప్ప వ్యాస సంపుటి వెలువడింది. పత్రికా రంగంలో అపారమైన అనుభవంగల పెద్దలచే, జర్నలిస్టులచే వ్రాయించిన 21 వ్యాసాల సంపుటి ఇది. ఇటువంటి గ్రంథం తెలుగులో రావడం ఇదే మొదలని చెప్పవచ్చు.

వివిధ విశ్వవిద్యాలయాలలో పిహెచ్.డి. పొందిన సిద్ధాంత గ్రంథాలలో కొన్ని 1992 లో ప్రచురింపబడ్డాయి. ప్రస్తుతం నాకు అయిదు సిద్ధాంత గ్రంథాలను గురించి మాత్రమే ప్రస్తావించే వీలు ఏర్పడింది. "సినిమాపాటల్లో సాహిత్యమా? సినిమాపాటలమీద రీసెర్చా?" అని పెదవి విరిచేవాళ్ళకి సమాధానం పైడిపాల రచించిన "తెలుగు సినిమాపాట." తెలుగు సినిమాపాట పుట్టుపూర్వోత్తరాల గురించి, క్రమపరిణామ వికాసాలు గురించి, సినిమాపాటలపై గల ప్రభావాలు గురించి, సినిమాపాటల్లో గల లోపాలుగురించి సప్రమాణంగా పరిశోధించబడిన ఈ గ్రంథానికి మద్రాసు విశ్వవిద్యాలయం 'డాక్టరేట్' బహుక

రించింది. నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించబడిన "అభ్యుదయకవిత్వంలో ఆరుద్రత" అనే సిద్ధాంత గ్రంథంకూడా 1992 లోనే వెలువడింది. ఆర్. నరసింహారావుగారు ఆరుద్ర కవితా ప్రపంచాన్ని నిర్మొహమాటంగా విశ్లేషించారు. ఆరుద్రని అర్థం చేసుకోవడానికిది ఎంతగానో ఉపకరిస్తుంది. డాక్టర్ వొలుకుల శివశంకరరావు "నాగభైరవ కథాకావ్యాలు" అనే సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టే బృహత్ సిద్ధాంతవ్యాసం మచ్చ హరిదాసు రచించిన "తెలుగులో యాత్రాచరిత్రలు." నారాయణరెడ్డిగారు అన్నట్టు "హరిదాసుకు సమాచారాన్ని వింగడించి చూపే నేర్పుతో బాటు హృదయాన్ని స్పృశించే మృదుల వచన శైలి పట్టుబడింది." తెలుగులో ఇటీవలి కాలంలో ఈ విధంగా మౌలికమైన పరిశోధనాగ్రంథం వెలువడలేదేమో అనిపిస్తుంది. గౌతమీకోకిల వేదుల సత్యనారాయణశాస్త్రి సాహిత్యంపై సమగ్ర పరిశోధన చేసి పంపన సూర్యనారాయణగారు "వేదుల సాహిత్య వసంతం"గా అందించారు. నిజంగా పరిశోధించి, వేదుల పద్య సాహిత్యాన్ని, వేదులవారి కథలను, నవలలను, నాటికాలను, వ్యాసాలను, ఇతర గ్రంథాలను నిష్పక్షపాతంగా విమర్శించారు.

## కథాప్రపంచం :

వారపత్రికలలో, దినపత్రికల ఆదివారం అనుబంధాలలో, మాసపత్రికలలో అనేకమైన కథలు వస్తున్నా మంచికథలు తక్కువగానే వస్తున్నాయి. వ్యాపారధోరణిలో "సెక్స్" కథలు బాగా వెలువడుతున్నాయి. ఆంధ్రజ్యోతిలో "ఈ వారం కథ" శీర్షికలోను, ఆంధ్రప్రభ వారపత్రికలోను, 'రచన' మాసపత్రికలోను, 'స్వాతి' మాసపత్రికలోను, 'విపుల' మాసపత్రికలోను, ఈనాడు ఆదివారం అనుబంధంలోను మంచి కథలు ప్రచురింపబడుతున్నాయి. 'విపుల'ను ఎప్పటిలాగే అనువాద కథలను అందించే విశిష్ట పత్రికగా పేర్కొనాలి. "కథావేదిక"లు ఏర్పడి మంచి కథలు రచించాలనే తాపత్రయం, కథా సాహిత్యానికి, కథా సాహిత్య విమర్శకి ప్రాచుర్యం రావాలనే ఆశ వెల్లడైంది 1992 లోనే. "రచన" అనే రచయితల మాసపత్రికలో "సాహితీవైద్యం" శీర్షిక ద్వారా కథా రచయితలకి శిక్షణ ఇవ్వటం జరుగుతోంది. కొన్ని పత్రికలు పాతకాలపు గొప్ప కథల్ని మళ్ళీ ప్రచురిస్తున్నాయి. కథల పోటీలు, పేజీకథల పోటీలు, హాస్య

కథల పోటీలు నిర్వహింపబడుతున్నాయి. '92 లో వచ్చిన మంచి కథల్ని ఏరి నవీన్, పాపినేని ఒక సంకలనంగా (1993 లో) తీసుకువచ్చారు. ఆంధ్రజ్యోతి వారపత్రిక వర్ధమాన కథారచయితలకి యండమూరి, కాశీపట్నం గార్ల అధ్వర్యంలో కథారచన వర్క్‌షాప్ నిర్వహించింది.

"గతంతో పోలిస్తే వర్తమానంలో కథ విస్తృతి, లోతుకూడా పెరిగాయి. తెలంగాణానుంచి, అంతకన్నా ఎక్కువగా రాయలసీమనుంచి మంచికథలు వస్తున్నాయి." అని కథల మాష్టారు కాళీపట్నం రామారావుగారు ఆంధ్రప్రభ కిచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొన్నారు (నవంబరు 23, 1992). ఇందులో సత్యం ఉంటే ఉండవచ్చేమోగానీ ప్రామాణికమైన ప్రకటన కాదు. అన్ని ప్రాంతాల కథల్ని పరిశీలించి "గ్రేడింగ్" ఇస్తూ పరిశోధించి చెప్పవలసిన విషయాన్ని టూకీగా చెప్పటం సమంజసం కాదు. కాని - రాయలసీమ నుంచి కథలు ఎక్కువగా వస్తున్నాయనవచ్చు. ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురితమైన కథల్లో కొన్ని "కథ" అనే ఆంగ్ల పత్రికలోకి అనువాదమయ్యాయి కూడా.

ఈ తరం కథకుల్లో నిరంతరాయంగా మంచి కథలు రాస్తున్న వారు చాలామంది ఉన్నారు. అల్లం రాజయ్య, స్వామి, రాసాని, సింగమనేని, బమ్మిడి జగదీశ్వరరావు, పతంజలి శాస్త్రి, చంద్రశేఖర ఆజాద్, రఘోత్తమరెడ్డి, రాణి శివశంకర్, యం. యస్. సూర్యనారాయణ, గౌరునాయుడు మొదలైన వారి పేర్లు పేర్కొనవచ్చు. "కథ '92" లో పదకొండు కథలు ప్రచురించారు. సంపాదకులకి ఇష్టమైన కథలుగా వాటిని గ్రహించాలి తప్ప '92 లో వచ్చిన మంచికథలు ఇవే అనటానికి వీలులేదు. ఈ సంకలనంలో చేర్చని వైవిధ్యం గల కథలు ఉన్నాయి. 1992 ఆంధ్రజ్యోతి వారపత్రిక వెలువరించిన దీపావళి ప్రత్యేక సంచికలో గల కథలన్నీ దాదాపుగా మంచికథలే. '90 లో వచ్చిన పదిహేను మంచి కథల్ని నవీన్, పాపినేని సంపాదించి, 1992లో ప్రచురించారు.

రాయలసీమ ప్రజల జీవన సంచలనాల్ని చిత్రించే మంచికథల సంపుటి సింగమనేని నారాయణ సంపాదకత్వంలో "సీమ కథలు" వెలువడింది. తెలుగు కథకి గల విశిష్టత లక్షణాలను మరోసారి నిరూపించే కథా సంపుటి ఇది. పద్దెనిమిది కథల్లో ఎక్కువగా రాయలసీమలో కరువు గురించి వివరించేవే

ఎక్కువ. కాని రచనల్లో ఎంతో వైవిధ్యం కనబడుతుంది. సీనియర్ కథా రచయిత బులుసు-జీ-ప్రకాష్ తాము రచించిన కథల్లోంచి ముప్పయి ఒకటి ఏరి ''తెలుగు పికాసో''గా ప్రచురించారు. వస్తువులోను, శిల్పంలోను ప్రకాష్ గారిదొక ప్రత్యేకమైన బాణి.

ఉప్పల నరసింహం కన్వీనర్‌గా మద్రాసులో ఏర్పడిన కథావేదిక ప్రథమ వార్షిక ప్రత్యేక సంచికను 1992లో ప్రచురించింది. ఇందులో కథకుల వ్యాసాలు, కథావేదిక కార్యక్రమాలతోపాటు, ఎనిమిది మంచి కథలు కూడా చోటు చేసుకున్నాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు మళ్ళీ ముద్రించి మనకి అందించారు. పత్రికలు, విమర్శకులు కవిత్వంపై చూపించిన శ్రద్ధ కథలపై చూపించడంలేదన్న విమర్శ ఉంది. కొత్తగా 1992 లో స్త్రీవాద కథలు, దళితవాద కథలు వెలువడ్డాయి. అయితే అందరి సమష్టి కృషివల్ల మాత్రమే మార్పు సంభవిస్తుంది గానీ విభజనవల్ల, విద్వేషంవల్ల కాదని గుర్తించాలి. "సమాజం సజావుగా ఉంటే ఎటువంటి కథల్ని సమర్పించినా పర్వాలేదు. కాని, మన సమాజం రోగగ్రస్తమైంది. దానికిప్పుడు పథ్యం పెట్టాలి. కొన్నిరకాల కథల్ని అందనివ్వకూడదు. కొన్నింటిని దండిగా పెట్టాలి. లేకపోతే కోలుకోవడం కష్టం'' అన్న బీనాదేవి (కథావేదిక) మాటల్ని రచయితలందరూ మననం చేసుకోవాలి. పేరుపొందిన రచయితలు, పేరు తెచ్చుకుంటున్న రచయితలు, రచయిత్రులు 1992 లో కథాసాహిత్యాన్ని సజావుగానే ఉంచారు. కొందరనుకుంటున్నట్టు తెలుగులో కథాసాహిత్యం వెనకబడిలేదు.

## మరికొన్ని రచనలు :

వివిధ సాహిత్య, సాహిత్యేతర రచనలు వెలువడుతుండటం విశేషం కాదు గానీ పూర్వం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ప్రస్తుత తెలుగు విశ్వవిద్యాలయం ''ఇతరాలు'' అనే విభాగం క్రింద బహుమతులు ప్రకటించడంతో ఇతర ప్రక్రియలలో, ఇతర అంశాలమీద కూడా గ్రంథాలు ప్రకటించబడుతున్నాయి. చలసాని ప్రసాద్ విరసం ప్రచురణలుగా శ్రీశ్రీ సాహిత్య సర్వస్వాన్ని వెలువరించడం భగీరథ ప్రయత్నంగా శ్లాఘించవలసిందే. ఆ కృషిలో భాగంగా చలసాని ప్రసాద్ 1992లో 16వ సంపుటంగా "శ్రీశ్రీ వ్యూలు, రివ్యూలు'' ప్రచురించారు. అరవైరెండు వ్యూలు, ముప్పయి రివ్యూలు, ఆరు నాటకాలు -

అయిదు సినిమాలపై అభిప్రాయాలుగల ఈ పుస్తకం ప్రసాద్ అన్నట్టు "రచయితలని గురించి, రచనలను గురించి శ్రీశ్రీ వెలిబుచ్చిన అభిప్రాయాలకీ, ఇచ్చిన అంచనాలకి అద్దం పడుతుంది.''

''పాఠం ఒప్పచెప్పకపోతే పెళ్ళి చేస్తానని
పంతులు గారన్నప్పుడే భయమేసింది
ఆఫీసులో నా మొగుడున్నాడు
అవసరమొచ్చినా సెలవివ్వడని
అన్నయ్య అన్నప్పుడే అనుమానమేసింది....'' అన్న "బందిపోట్లు" కవిత ద్వారా అందరి ప్రశంసలు పొందిన సావిత్రికి నలభై ఒకటి నిండగానే నూరేళ్ళు నిండినప్పుడు సహృదయులంతా మనస్తాపం చెందారు. అయితే అరణ్య కృష్ణ మిత్రుల సహకారంతో సావిత్రి కవితల్ని, ఒక కథ, ఒక గల్పిక, సమీక్షల్ని, వ్యాసాల్ని సేకరించి సావిత్రి గురించిన స్మృతి రచనలతో 1992 లో "సావిత్రి" పుస్తకం వెలువరించారు. ఈ ప్రయత్నాన్ని సాహితీ ప్రియులంతా హర్షించారు. ఈ పుస్తకం అట్టవెనకాల శాంతకుమారిగారు సావిత్రిపై రాసిన 'ఎలిజీ' తెలుగులో గొప్ప ఎలిజీ అనక తప్పదు.

కథకుడిగా పేరు పొందుతున్న డాక్టర్ వి. రాసాని "జానపద గేయాలలో పురాణాలు" అనే పుస్తకం రచించారు. రాయలసీమలోని రామాయణ భారత భాగవతాది పురాణాలకు సంబంధించిన గేయాలను సేకరించి, ఆ గేయాలను మినీ వ్యాఖ్యానంతో ఈ పుస్తకంలో అందించారు. వచనకవితావ్యాప్తికి కుందుర్తి "ఫ్రీవర్స్ ఫ్రంట్" ద్వారా చేసిన కృషి అందరికీ తెలిసిందే. 1967 నుంచి ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతులు పొందిన వచన కవితా సంపుటాల వివరాలను తెల్పుతూ 1992లో ఒక పరిచయ గ్రంథం వెలువడింది. 1992 జూన్ 21 న కన్నుమూసిన కరుణశ్రీ గార్కి "హృదయ పుష్పాంజలి" గా వివిధ రచయితల, కవుల హృదయ స్పందనలు, వ్యాసాలు, కవితలుగల "విశ్వకరుణ" ప్రచురింపబడింది ప్రసిద్ధ పండితులు దిగుమర్తి సీతారామస్వామి గారి కవితా సూక్తులు 360 వరకు సేకరించిన ఆచార్య తంగిరాల సుబ్బారావు "హిమాని" గా ప్రచురించారు. ఆలోచనాత్మకమైన సూక్తులు గల ఈ గ్రంథం విలక్షణమైనది.

తెలుగులో అధిక్షేప రచనలు తక్కువగానే వెలువడుతూంటాయి 1992లో ఈ కోవకి చెందిన మంచి పుస్తకం "చల్నేదో బాల్‌కిషన్" రచించిన తెలిదేవర భానుమూర్తి అభినందనీయుడు. తెలంగాణా మాండలికంలో రచించినా ప్రతి రచనలోను ఒక చరుపు, ఒక విరువు, మరొక మెరుపు కనిపిస్తుంది. సమాజంపై ఝళిపించిన చర్నాకోలు ఇది. పిల్లల పెంపకాన్ని ఒక సామాజిక బాధ్యతగా గుర్తించి, పిల్లల మనస్తత్వాన్ని విశ్లేషించి తల్లిదండ్రుల ప్రాథమిక బాధ్యతను గుర్తు చేసే విధంగా అట్లూరి వెంకటేశ్వరరావుగారు "పిల్లల పెంపకంలో మెళకువలు" అనే గ్రంథం రచించారు.

## మరికొన్ని సంగతులూ - సందర్భాలూ :

* ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి "క్రొత్త గోదావరి", రసరాజుగారి "రసభారతి" పద్యకవితా సంపుటాలకి పురస్కారాలు లభించాయి. అభ్యుదయ విమర్శకులు కూడా "క్రొత్త గోదావరి" ని ప్రశంసించారు.
* దేవిప్రియ "గరీబు గీతాలు" సమీక్షిస్తూ ఆంధ్రభూమిలో సంపత్‌కుమార్ ఇలా అన్నారు - "ఈ పుస్తకానికి గిన్నిస్ బుక్‌లో ఎక్కవలసిన చేరా పీఠిక వుంది."
* 26-1-92 న రాజమండ్రిలో వాగర్థ సమాఖ్య ఆధ్వర్యంలో రికార్డు స్థాయిలో శతాధిక కవిసమ్మేళనం జరిగింది.
* ఆంధ్ర సారస్వత పరిషత్ స్వర్ణోత్సవం, యువభారతి రజతోత్సవం జరుపుకొన్నాయి.
* కృష్ణాజిల్లా రచయితల సంఘం విజయవాడలో ''నవల - నాడు, నేడు, రేపు'' అనే అంశంపై రెండురోజులు సభలు నిర్వహించింది.
* గుంటూరులో జరిగిన అరసం మహాసభల్లో చాసోగారిని మళ్ళీ అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు.
* పన్నెండు సంవత్సరాల తర్వాత యండమూరి సంచలన నవల "తులసీదళం'' మళ్ళీ ధారావాహికంగా ప్రచురింపబడింది (ఆంధ్రభూమి వారపత్రికలో).

* 1972 లో ''కుట్ర'' కథ రాసి - ఇరవై సంవత్సరాలు విరామం ఇచ్చి 1992 లో ''సంకల్పం'' అనే కథ రాశారు కాళీపట్నం రామారావుగారు!
* 1992 లో రాష్ట్రంలో వివిధ పరిషత్తులు నిర్వహించిన నాటక, నాటికల పోటీలలో 'మార్గశీర్ష' (డాక్టర్ బి.వి. రమణమూర్తి) రచించిన "అమృత వర్షిణి,'' ''సిందూరం,'' ''కవచం'' లకి అనేకచోట్ల ప్రథమ బహుమతి లభించింది.
* ఆచార్య ఆత్రేయ జ్ఞాపకార్థం మనస్విని పబ్లిక్ చారిటబుల్ ట్రస్ట్, మద్రాసు ఏటా ఇచ్చే ఉత్తమ నాటక రచన బహుమతి 1992 లో వక్కలంక సూర్యనారాయణ రచించిన "న్యాయదుందుభి"కి లభించింది.
* "తెలుగుదేశంలోని సాహిత్య బహుమతుల నిర్ణయాలలో పొరపాటున కూడా జరగకూడని ఒక సంఘటన ఉన్నది అది శేషేంద్రగారికి ఏ సాహిత్య పురస్కారమూ ఏ దశాబ్దంలోనూ రాకపోవటం."

—ముదిగొండ వీరభద్రయ్య (5-1-92 ఆంధ్రప్రభ),

* పుస్తక సమీక్షలకి ప్రాధాన్యం తగ్గింది.
* విజయవాడలో ఎక్సురే సాహిత్య పత్రిక దశమ వార్షిక సభలు జరిగాయి.
* విశాఖపట్నం నుంచి మసూనాగారి సంపాదకత్వంలో ''తూర్పుసీమ'' సాహిత్య మాసపత్రిక వెలువడింది.

[ఈ వ్యాసం సమగ్రం అనే ధైర్యం నాకు లేదు. ముఖ్యంగా నవలా సాహిత్యం, నాటక సాహిత్యంపై నా దగ్గర సమాచారం లేదు. నా దృష్టికి రాని, గుర్తుకురాని రచనలు, సంఘటనలు చాలా వుంటాయి. ఇదొక ప్రయత్నంగా మాత్రమే భావించాలని మనవి చేసుకుంటున్నాను.

—ద్వానాశాస్త్రి.]

# కవిత '92 – వస్తువైవిధ్యం

— ఆచార్య ఎన్. గోపి

ఒక సంవత్సరంలో వచ్చిన కవిత్వాన్ని విశ్లేషించడం కష్టమని మనకందరికీ తెలిసిందే. ఎందుకంటే, ఒక సంసత్సరంలో ఆ ఒక సంవత్సరమే ఉండదు. గత దశాబ్దమంతా వుంటుంది. 1992 అనేది ఒక హద్దు మాత్రమే. ఈ హద్దులో స్థూలంగా, సూత్రప్రాయంగా, విహంగ వీక్షణంలా సమీక్షించడం మాత్రమే సాధ్యం.

ఇక 1992 లో వచ్చిన కవిత్వమంతా నేను చూశానా? చాలా వరకు చూశాననే చెప్పాలి. పద్య కవిత్వం ఎక్కువగా చూడలేదు. ఆ లోపం మీకు తెలుస్తూనే వుంటుంది. ఈ సంవత్సరంలో వచ్చిన కవితా సంపుటులు, ఆంధ్ర జ్యోతి వీక్లీ, ఆదివారం, సోమవారం సంచికలు, ఆంధ్రప్రభ ఆదివారం సోమ వారం సంచికలు - ఇంకా ఇతరత్రా పత్రికల్లో వచ్చిన కవితలు చూశాను. ఈ చూడటం కూడా నా దృష్టిలో చూడటమే. నా దృష్టి అంటే ఏకాంత గోపురం లోని స్వీయ మానసిక దృష్టి అని కాదు. ఎన్ని రకాల వస్తువులతో ఈనాడు కవిత్వం వెలువడుతున్నదో, అట్లా వెలువడటానికి హేతువులు, ప్రేరణల గురించి ఆలోచించవలసివుంది. వందకుపైగా కవులున్నారు ఈనాడు. వీరి కవితల్లో చాలా గట్టి కవితలు అనుకున్న వాటితోనే ఈనాటి ధోరణుల్ని పసికట్టడం జరుగుతుంది. ఈ వ్యాసకర్తకు నచ్చని కవితలు ఉన్నాయే కాని నచ్చని వ్యక్తులు లేరు. కాబట్టి చాలా మంది కవుల పేర్లను ఇక్కడ ఉదాహరించకపోతే వారిని చదవనట్టు కాదు, పట్టించుకోనట్టూ కాదు. 1992 లో వెలువడి, వ్యాసకర్త దృష్టికి వచ్చిన కవితా సంపుటులు, సంకలనాలు ఇవి. వేగుంట మోహనప్రసాద్ రహస్తంత్రి, ఎండ్లూరి సుధాకర్ వర్తమానం, ఆదిగోపుల వెంకట రత్నం యుద్ధమంటే మాకు భయం లేదు, దర్భశయనం శ్రీనివాసాచార్య ప్రవాహం,

యాకూబ్ ప్రవహించే జ్ఞాపకం, ఏలేశ్వరం నాగభూషణాచార్య నేల తడవని వాన, మోతుకూరి అశోక్ కుమార్ సంతకం, జి. రామశేషయ్య అక్షర పతాక, తిరుమల శ్రీనివాసాచార్య గంగాతరంగాలు, వంశీకృష్ణ యాత్ర, కె. శివకుమార్ శబ్దపంజరం, బూదాటి వేంకటేశ్వర్లు మువ్వల సవ్వడి, నారాయణస్వామి కల్లోల కలలమేఘం, నాగభైరవ కోటేశ్వరరావు పతాక శీర్షిక, పి. సి. రాములు అగ్ని శ్వాస, వాసా ప్రభావతి వెలుగువచ్చేవేళ, ఎల్. వి. సుధీర్ కుమార్ అక్షరో దయం, గోపాల చక్రవర్తి కవితలు (కొత్తవి, పాతవి,) పెన్నా శివరామకృష్ణ రహస్య ద్వారం (హైకూలు), గోదావరిశర్మ అంతర్వాహిని, యువభారతి వారి అమృత రాజీవం, అనుభూతి; రంజని వారి ముప్పై కవితలు, జి. శ్రీశైలం సఖ్యతా కిరణాలు, గౌరీశంకర్ ఎలియాస్, చెరుకు సుధాకర్ దృశ్య కావ్యం, చేతనావర్తం రజతోత్సవ ప్రచురణ, రవూఫ్ కనురెప్పలు కిటికీల మధ్య, అద్దేపల్లి రామమోహనరావు గోదావరి నా ప్రతిబింబం, సామ్రితి, ఇంద్రగంటి జానకి బాల మనశ్శల్యాలు మొదలైనవి.

వీటన్నింటిలో నేను గుర్తించిన కొన్ని ధోరణులను ముందుగా బేరీజు వేస్తాను.

1. విప్లవకవిత్వం. (విరసంలోని వారు, బయటివారు.)
2. స్త్రీ వాదం.
3. సామాజిక వేదన.
4. పరాయీకరణ. (ఒంటరితనం, మృత్యుకాంక్ష, మృత్యుభయం, బతుకుపై నిరసన, బాల్యస్మరణ, గతస్మరణ, అమ్మ, నగరజీవన వైముఖ్యం, వ్యాపార సంస్కృతి మొ॥ వి)
5. ప్రముఖ సంఘటనల ప్రతిస్పందన.
6. సీనియర్ కవుల నిరంతరయాత్ర.
7. లిట్టుకవిత్వం.
8. పద్యకవిత్వం.

## 1. విప్లవకవిత్వం :

'70ల్లో లాగా విప్లవ కవిత్వం ఈనాడు ఒక ప్రధానమైన ధోరణిగా లేదు. విప్లవకవుల్లో రెండు రకాలవారు కనిపిస్తున్నారు. 1. విరసం అనే సంస్థకు నిబద్ధులు. 2 విరసం బయట ఉండి విప్లవచైతన్యంతో రాసే కవులు. విరసంలో సీనియర్స్ సరే. ఇప్పుడు రాస్తున్నవారిలో సౌదా, నారాయణస్వామి, విమల, సముద్రుడు మొదలైన పేర్లు గట్టిగా వినిపిస్తున్నాయి. తెలంగాణా జిల్లాల్లోని పోరాటం గురించి వీరు ఎక్కువగా రాస్తున్నారు. ఎన్‌కౌంటర్‌లో నిహతులైన వీరుల గురించీ, పోలీసు దౌర్జన్యాలు మొదలైనవాటిగురించీ వీరు రాస్తున్నారు.

ఎన్‌కౌంటర్‌ను గురించి రాస్తూ నారాయణస్వామి-

"ఇక్కడ ఒక మనిషి
సహజంగా చనిపోగలడనే నమ్మకం సడలిపోయినవాళ్ళం
ఇక్కడి కవులు
సహజంగా చనిపోతారనే నమ్మకం ఏమాత్రం లేనివాళ్ళం
కవులు మృత్యువును ద్వేషించినపుడు
జీవితాన్ని పోరాటంలో పదునెక్కించినపుడు
సహజ మరణాన్ని వరిస్తారనే ఆశ లేశమాత్రమైనా లేనివాళ్ళం
ఇది అసహజ మరణాల వ్యవస్థ." (మృత్యువును ద్వేషిద్దాం)

ఇటీవల పోలీసు నిర్బంధాల తర్వాత పల్లెల్లో నెలకొన్న భయానక అభద్రతా వాతావరణాన్ని, సామాన్య జనుల మానసిక స్థితిని వర్ణిస్తూ రెండు కవితా సంపుటులు వచ్చాయి. అవి - ఏలేశ్వరం నాగభూషణాచార్య 'నేలతడవని వాన', మోతుకూరి అశోక్‌కుమార్ 'సంతకం.'

"కనపడని కత్తులమీద
కుత్తుకల్ని ఆరేసుకుంటున్నాం'

అంటాడు నాగభూషణాచార్య. అలాగే-

'పొద్దుగూకకముందే ఊరంతా చిన్నబోతోంది
నిశ్శబ్దంగా ఇళ్ళు.... బళ్ళు.... గుళ్ళు
వినమ్రంగా నిలబడి చూస్తున్నాయి." (ఊరు సిన్నబోతే)

సిధారెడ్డి, నాగభూషణాచార్య, అశోక్‌కుమార్ కవిత్వాల్లో నేటి పల్లెల పరిస్థితిని ప్రత్యక్షంగా చూసిన అనుభవం కనిపిస్తుంది. అట్లాగే పట్నవాసుల నుద్దేశిస్తూ - మీకిక్కడి పరిస్థితులు తెలియవు అనే నిరసన గొంతూ వినిపిస్తుంది. తెలంగాణా ప్రత్యేక సాంస్కృతిక పరిస్థితులను గుర్తించని విమర్శకులపైన ఆరోపణలు కూడా ధ్వనిస్తాయి. అవును. ఇవన్నీ కవితల రూపంలోనే.

అయితే ఈ సందర్భంగా విరసం, విరసం బయటి కవులు అనే విభజన సరైనదేనా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఆ తేడాని ఎట్లా గుర్తుపట్టగలం? ఇది వరకు ఓ విమర్శకుడన్నాడు - కవుల పేర్లు చెప్పకుండా అభ్యుదయ, విప్లవ కవిత్వాలు ఒకచోట పెట్టుకొని చదివితే భేదం చెప్పడం కష్టమని. స్థూలంగా ఇది వాస్తవంగా తోచినా కాస్త నిదానంగా పరిశీలిస్తే తేడా తెలుస్తుంది. విప్లవం అనే మాట లేకున్నా ఆ కవితలో గాఢంగా నెలకొన్న మూడ్‌వల్ల దాన్ని పట్టుకోవచ్చు. విరసం, విరసం బయటి కవుల్లో కూడా సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ తేడా బయటపడుతుంది. విరసం బయటి కవులు తమ వస్తువరణ స్వేచ్ఛను కాపాడుకున్నారు. విప్లవ వస్తువులతో పాటు ఇతరేతర ప్రగతిశీల భావాలపట్ల కూడా మొనాటనీ పైకి కనిపించేదే గాని జాగ్రత్తగా చూస్తే వైవిధ్యం కనిపిస్తుంది అని వారంటున్నారు. ఇది మరింత పరిశీలనవల్ల తేలవలసిన విషయం.

విప్లవ కవిత్వంలో పోరాటమే కాని జీవిత చిత్రణ జరగలేదనే ఓ విమర్శ ఉంది. ఆ కొరతను సిధారెడ్డి 'పుట్టి తెగినవాళ్ళు' అన్న కవితలో నిరుపేద చేనేతకారుల బతుకుల్ని వర్ణిస్తూ—

"నేతగాడు ఆత్మహత్య చేసుకుంటున్నాడు
ఏవీ కొత్తగాదు
హత్యలూ ఆత్మహత్యలూ
ధర్మచక్రం తిప్పేవాడికి అన్నీ మామూలే
పుట్టి తెగిపోయింది
వురితాడు ఎదురుచూస్తున్నది.
విరిగిన మొగ్గం పట్టుకొని వీధిని పడటమే మిగిలింది."

(ఆంధ్రజ్యోతి, 17-2-92)

అలాగే పత్తిరైతుల దుస్థితిని వర్ణిస్తూ నాశేశ్వరం శంకరం ఓ చక్కటి కవితను రాశాడు.

"మన దేశంలోని ప్రతి ఊరూ ఓ పత్తిచేనే!
ప్రతి గుడిసే ఓ పత్తి మొగ్గే!"

"ప్రాణాపాయస్థితిలో ఉన్న పత్తిమొగ్గల కోసమే ఈ సమావేశం
బతుకంతా ధారపోసే దూదిపేలమీద
పాషాణవిషం దట్టించే పత్తిపురుగుల దాడి ఆగేట్లులేదు"

సౌదా 'వాక్రిల్-2' (ఆం.జ్యో. 20-7-92) అనే కవితలో పోరాటం మధ్య జారిపోయే యోధులను గురించి వ్రాస్తూ—

"మన భయాలూ
దాపరికాలూ
అన్నీ వొక్క మరణంతో అర్థం లేనివై పోతాయి
యే సెంటిమెంటూ లేని స్వచ్ఛమైన మరణం గురించి
మాట్లాడిన మిత్రులందరూ
పరీక్షా సమయంలో తల్లిదండ్రులను అనుకరిస్తూ తిరిగిపోతారు
తన పూర్వీకులలోకి తాను యిమిడిపోయే వొక బాక్టీరియాలాగా
నిజానికి మనుషుల పిరికితనం వొక రాజకీయ అభిప్రాయం."
(ఆం.జ్యో. 20-7-92)

నిత్యం సిటీ లైఫ్‌ను ఆవిష్కరించే అలిశెట్టి ప్రభాకర్ 'విప్లవ సౌందర్యం' అనే కవితలో

"తిరుగుబాటు సత్యం
చాటకుండా ఉండకు
విప్లవ సౌందర్యం
ఆవిష్కరించకుండా వెళ్ళకు." (ఆం.జ్యో. 19-1-92)

## 2. స్త్రీ వాదం :

స్త్రీ వాద కవిత్వం రాశి పరంగా గత సంవత్సరమే ఎక్కువగా వచ్చింది. ఈ సంవత్సరం బాగా చర్చలు జరిగాయి. ఈ చర్చలు అప్పుడప్పుడు తిట్టు కవిత్వస్థాయిదాకా వెళ్ళాయి. స్త్రీలు మాత్రమే తమ అనుభవంతో చెప్పగల గటం అంటే ఏమిటో ఈసారి బాగా అర్థమైంది. అయితే స్త్రీపట్ల వివక్ష అనేది ఆర్థికపరంగా, (అంటే చాకిరీ వగయిరాలు) సంప్రదాయ పరంగా, లైంగిక పరంగా ఉన్నప్పుడు కేవలం లైంగికపరమైన అంశాలకే తమ కవితల్లో ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. పై మూడు అంశాల మధ్యగల ఆంతరిక సంబం ధాల (Implications) అవగాహనతో రాస్తే ఇంకా బలమైన కవితలు వచ్చే అవకాశం వుంది.

'92 సంవత్సరంలో కొండేపూడి నిర్మల 'చైనీస్ టార్చర్' అనే మంచి కవిత రాశారు. ఇండియా టుడే లో రూబెన్ బెనర్జీ వ్యాసం చదివి ఈ కవిత రాశారు కవయిత్రి. దీనిలో ఆర్టిస్టుల కోసం న్యూడ్ మోడలింగ్ ఇచ్చేవాళ్ళను గురించి స్త్రీ దృష్టితో హృదయవిదారకంగా వర్ణించారు.

"గంటల తరబడి నిలబడి కూలబడి వొంగబడి
కావలసిన ఆకృతికోసం
ఆర్టుక్లాసు అట్టహాసాలమధ్య
వొణికించిన చలినిమించి
దిగజారిన చెమటనుమించి
కంటున్న కలనీ, కట్టుకున్న బట్టనీ విడిచిపెట్టిన
దుర్భరస్పృహనుమించి
కాన్వాసుకి క్యూ కట్టిన నగ్నదేహాల రద్దీ వాళ్ళను
భయపెడుతుంది!!

* * *

అవసరానికి ఆత్మహననానికి మధ్య జరిగే నలిబలికి."

(ఆం.జ్యో. 26-4-'92)

అలాగే 'కవితాభారతి' అనే కవయిత్రి 'అజమాయిషీ' అనే కవితలో ఆడపిల్లల పెంపకంపట్ల జరిగే వివక్షను వర్ణించారు.

"అయిదేళ్ళనాడు
ఆడపిల్లా అన్నయ్యకు ఎదురు చెప్పొద్దంది అవ్వ
పదకొండేళ్ళనుండీ పధ్నాలుగోవీడు దాటేదాకా
స్కూలుకు వెళ్ళివచ్చేటప్పుడు
రెండుపూటలా
ఈ పిల్ల ఎప్పుడు పెద్దమనిషవుతుందా?''

అని—

"వెయ్యి తొంభై రోజులు
రెండు వేలా నూటా తొంభైసార్లు
వీధుల్లోని అమ్మలక్కల వికార వెటకార గుసగుసల మోత
నా మెదడులో కంటకాలు గుచ్చింది.'' (ఆం.జ్యో.వీ. 27-3-'92)

ఈ సంవత్సరం 'శిలాలోలిత' అనే కవయిత్రి 'పరాయి ముఖం' అనే మంచి స్త్రీవాద కవిత రాశారు.

"అవయవాల పోగు మాత్రమే దేహమైతే
ఈ మనసెక్కడుందో అన్వేషించాలి
ఒకే ఒక్కసారి చూసి తడుముకోవాలి.

* * *

ఈ జీవితం అమ్మ నాన్నలిచ్చిన ప్రామిసరీ నోటు
ఎట్టకేలకు వేలం పాటలో శరీరాన్ని కొనుక్కుంటారెవరో?
చుట్టూ ఆడతనాల బంధాలు పరుచుకుంటాయి ఇనుప చువ్వల్లా"
(కంజిర 5, మార్చి '92)

శిలాలోలిత కవిత్వంలో స్త్రీ వేదన సామాజిక స్పృహను కలిగివుంటుంది. అంతేకాక, ఈమె మట్టికథ, మనసలికిడి, రాలీరాలని పువ్వులాంటి మంచి కవితలు రాశారు. ఈమె విమర్శకుల అటెన్షన్‌ను నోచుకున్నట్టు లేదు.

తెలుగు కవిత్వంలో ప్రేమ కవిత్వం రాదేమిటి? దేశంలో ప్రేమ ఇంకిపోయిందా అని దిగులుపడుతున్న వారిలో నేనొకణ్ణి. '92 సంవత్సరంలో జయప్రభ, మహెజబీన్ రాసిన ప్రేమగీతాలు కొన్ని దృష్టికి వచ్చాయి. స్త్రీ దృష్టితో రాసిన ప్రేమకవితలుగా వీటిని గుర్తించవచ్చు.

జయప్రభ "నేనంతా తెలిసికూడా....!" (ఆం.జ్యో.వీ. 5-6-'92) అనే కవితలో—

"ప్రేమతో నీ ప్రతి అక్షరమూ
పూచిన పువ్వులా వుండే
తమకంగా నా వంటినిండా
రాసి పోసు కుందా మనుకుంటానని
జలక మాడు కుందా మనుకుంటానని
శయ్య పరుచుకుందా మనుకుంటానని
సేద తీర్చుకుందా మనుకుంటానని
నేనంతా తెలిసికూడా నీకు తెలీదూ?"

అంటూ తనను మరింత అర్థం చేసుకోవాలనే తపనను వెల్లడిస్తారు.

మహెజబీన్ 'ఆకురాలే కాలం' అనే కవితలో-

"అతనెప్పుడూ అంతే
ఒంటరిగా రమ్మంటే వసంతాన్ని వెంటతెస్తాడు"

అని మొదలుపెట్టి-

"అతనిప్పుడు లేదు
ఈ మధ్య అర్ధాంతరంగా వచ్చిన
ఆకురాలేకాలానికి ఎక్కడ రాలిపడ్డాడో?"

అంటూ అతని రాక జ్ఞాపకాల సొబగుల్ని వర్ణిస్తారు.

ఇంకా విమల రాసిన 'సూర్యస్వప్నం' అనే కవిత మంచి కవిత. విమల స్త్రీవాదాన్ని మార్క్సిస్టు దృక్పథంతో దర్శిస్తారు. అలాగే కె. గీత 'నేను ఋతువునైనప్పుడు" అనే కవిత పేర్కొనదగింది.

స్త్రీలు రాసిన కవితలన్నీ స్త్రీవాద కవితలు కావు. శివలెంక రాజేశ్వరీ దేవి, ఆదూరి సత్యవతీదేవి రాసినవి స్త్రీవాద కవితలు కావు.

స్త్రీ దృష్టితో వేశ్యల దుస్థితిని వర్ణించే కవితలు కూడా కనిపిస్తాయి. స్త్రీ వాద కవితలు స్త్రీలే రాయాలని లేదు. పురుషులు కూడా స్త్రీ దృష్టితో రాసిన కవితలు కనిపిస్తాయి. వేశ్యలను గురించి ఎండ్లూరి సుధాకర్ 'ఏకాకి ఋతువు,' యాకుబ్ 'చీకటి పక్షి' అనే కవితలు విలక్షణమైన వస్తుప్రకాశంతో వున్నాయి.

## 3. సామాజిక వేదన :

సమాజంలో తమకుండే స్థానాన్నిబట్టి, అస్తిత్వాన్నిబట్టి పడే వేదనని సామాజిక వేదన అంటున్నారు. ఇవి రాజకీయ కవితలు. స్వీయానుభూతి కవితల కంటె కొంత భిన్నంగా వుంటాయి. దళిత వేదనను ధ్వనించే కవిత లను కూడా ఈ కోవలోకి చేర్చవచ్చు. ఎండ్లూరి సుధాకర్ రోడ్లూడ్చే బల్దియా మైసమ్మ గురించి 'మైసమ్మ మరణం' అంటూ గొప్ప కవిత రాశాడు.

"చిన్నప్పుడు ఆమె చీపురుకట్టంతైనా లేని నేను
మా మైసమ్మని ఎన్నటికీ మరువలేను
మైసమ్మా! మైసమ్మా!!
నీకూ నాకూ ఏ బంధం లేకున్నా
కొంత నా చెత్తనూ ఎత్తిపోసిన నీలో
అమ్మను చూస్తున్నా మైసమ్మా!''

అట్లాగే రిజర్వేషన్లకు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనల గురించి "శంబూకుని ఊరేగింపు" అంటూ నారాయణస్వామి ఓ పెద్ద కవిత రాశాడు.

''మీ పాయిఖానాల్లో పూలతోటలు పూసిన మా శ్రమ మీకు అవహేళన
శ్రమ మీకు నటన శ్రమ మా జీవితం
శ్రమ మీకు ఆట శ్రమ మా పోరాటం
మీ గొంగళిపురుగు రూపాలకు అందచందాలిచ్చింది మేమే
ఈ తోట మా హక్కు.."

అట్లాగే సమాజంలో తమకుండే స్థానానికి సంబంధించిన పెనుగులాటతో కూడిన వేదనను పలికించిన కవులు కొందరు కనిపిస్తున్నారు. వారిలో చెరుకు సుధాకర్, కె. సంజీవి, సతీశ్‌చందర్, ఎస్వీ మొదలైనవారున్నారు.

'92 లో వెలువడిన వర్తమానం కవితా సంపుటిలో గోదావరినదిమీద ఐదు గొప్ప కవితలు రాశాడు ఎండ్లూరి సుధాకర్. ఆధునిక కవుల్లో గోదావరిని ఇంత విలక్షణంగా దర్శించినవారు అరుదు. అతడు వర్ణిస్తున్న గోదావరి మనకు ఇంతకుముందు పరిచయమైంది కాదు. గోదావరి భూస్వాములది కాదు - భూమి పుత్రులది అంటాడు. ఒక నదిని ఎన్ని మూడ్స్‌లో దర్శించవచ్చునో చెప్ప

టానికి ఈ కవితలు తార్కాణంగా ఉన్నాయి. 'గ్రీష్మ గోదావరి' అనే కవితలో సుధాకర్-

''నాన్న కొట్టినప్పుడు
ఒక మూల ముడుచుకొని పడుకున్న అమ్మలా వుంటుంది.
ఎండాకాలపు గోదావరి
నీటి కొవ్వు కరిగిపోతూ
పలచబడుతున్న జలచర్మంతో
ఎనీమియా పేషెంటులా
ఎంతో జాలి గొలుపుతుంది.
వానాకాలంలో రౌడీరాణిలా నఖరాలు చేసి
ఇప్పుడు అతివినయంతో తలొంచుకొనిపోతుంది.
గ్రీష్మగోదావరి పాలిపోయిన దిగులుకళ్ళతో
నీటిమంచంమీద నిస్త్రాణంగా పడి ఉంది''

* * *

జీవితం రుతువులుగా మారిపోయినవాళ్ళకి
కాలంతో కాపురం చెయ్యకతప్పదు.
ఏసీ గదులూ, ఏ సౌకర్యాలు లేనివాళ్ళకి
గోదావరి పెంపుడుతల్లై
ప్రేమగా సేద దీరుస్తుంది.

## 4. పరాయీకరణ :

పరాయీకరణ, ఎలియనేషన్ అనే మాటలు ఈ మధ్య బాగా వినపడు తున్నాయి. మనిషి తనకు తానే పరాయివాడై పోవటం, తాను సృష్టించిన వస్తు జాలమే తన అనుభవంలోకి రాకపోవడం, ఒకరకమైన ఏకాకితనం ఇవన్నీ పరాయీకరణ. ఈనాటి కవిత్వంలో కనిపిస్తున్న ఒంటరితనం, మృత్యుభయం, మృత్యుకాంక్ష, బతుకుపై నిరసన, బాల్యస్మరణ, గతస్మరణ, నగర జీవన వైముఖ్యం వగయిరాలు ఇవన్నీ పరాయీకరణ ఫలితాలు. వ్యాపార సంస్కృతి నుండి పుట్టిన మానసిక స్థితి.

పైన చెప్పిన అంశాలన్నీ ఏదో ఒక కవిలో ప్రత్యేకంగా ఉండవు. ప్రతి కవిలో ఏదో ఒకమేరకు పరాయీకరణ జీర వినిపిస్తుంది. మృత్యువే గమ్యం అనుకోవడం, జీవితాన్ని వికృతంగా దర్శించటం మొదలైనవి ఈ పద్ధతికి చెందిన కవుల్లో కనిపిస్తాయి. ఈ కోవకు చెందిన కవులు మదుసేవనాన్ని కవిత్వంలోకి తీసుకొచ్చి గ్లామరైజ్ చేస్తారు. తాగుబోతు వ్యక్తావ్యక్తాలాపనే లోతైన కవిత్వ మని బుకాయిస్తారు. కవిత్వం అందరికి అర్థమయ్యే ద్రవ్యం కాదని వీరి నమ్మకం. తను **Ivory tower** లో కూచోని, 'ఉచ్చ' లాంటి జుగుప్సాత్మక పదాలూ, కామైకపరమైన లైంగిక ప్రతీకలు వాడుతూ జీవితం వికార పార్శ్వాన్ని మాత్రమే దర్శిస్తుంటారు. ఆధునిక కవిత్వానికి అస్పష్టత అనే అపవాదు ఇట్లాంటి కవిత్వం వల్లే వచ్చింది. గత సంవత్సరం ఇట్లాంటి కవిత్వం చాలా వచ్చింది. '92లో కొంత తగ్గింది.

ఒంటరితనం అనేది కేవలం మనసులో పుట్టేదికాదు. బయటి పరిస్థితులు కూడా దానికి దోహదం చేస్తాయి. మనుష్యులందరూ భౌతికంగా సన్నిహితంగానే ఉన్నా వారిమధ్య ఒక అఖాతం ఏర్పడుతుంది. 'సంభాషణ ముగిసాక' అన్న కవితలో అఫ్సర్—

"మీరంతా
నిజంగానే మీరంతా
ఈ పచ్చని ఆకాశంకింద ఎగిరిన తెల్లపావురాలే
సముద్రంవాడిలోంచి తడిరెక్కలు టపటపలాడించిన నురుగుపక్షులే
గోడల్ని చీల్చి
కనుగోళాల మీద భూగోళాన్ని నిలిపిన మీరే
ఈ క్షణం దాటాక
నానుంచి సప్త సముద్రాల దూరంలో ఉంటారు."

(ఆం. జ్యో. వీ. 19-1-'92).

జీవితంలోని అన్ని విలువలూ ధనమూల్యాలముందు వెల వెల బోతున్నాయి. వ్యాపారసంస్కృతి మానవసంబంధాలకు గండికొడుతున్నది. మనిషిలోని పరాయీకరణకు ధనస్వామ్యం ప్రధానకారణమౌతున్నది. దేశపతి శ్రీనివాస్ "రూపాయి పారుతున్న దేహం" అన్న కవితలో-

"గుండెకు ఛిద్రం చేసి
రూపాయినెవరు అమర్చారు?
సిరలలో, ధమనుల్లో పేరుకుంటున్న రూపాయిరక్తం
కాలాన్ని తెగనమ్ముకుంటూ
రూపాయికి ఉపగ్రహమయింది జీవితం,
ఊడిగం చేసే బానిసయింది.

....................

రూపాయి స్పర్శలేని ఒక్క నిమిషం కోసం తపిస్తున్నా.,

....................

రోడ్డుపై అందరూ ఆటోలై బస్సులై రిక్షాలై
అందరి హృదయాలు చేసే దబ్బుశబ్దమొక్కటే రొదచేస్తుంది.

....................

రూపాయల్ని కాల్చి టీకాదాడట ఒకాయన
అదే మంటల్లో అదే మంటలో
ఈ రూపాయిదేహాన్ని తగలేస్తాను." (ఆంధ్రప్రభ. 16-2-'92).

లైంగిక ధోరణులన్నా నే - ఆ మార్గంలో శిఖామణి 'దేహి' అన్న కవిత రాశాడు. దీనిలో ప్రేమకీ కామానికి మధ్య భేదం లేదు. చూడండి-

"ప్రేమ నిషిద్ధఫలంకాదు
దాన్ని తినొద్దంటున్న సైతాన్ ఎవడో చెప్పు
ఎంతటి ఆత్మకైనా దేహం ఆధారమైనట్టు
ప్రేమను శరీరాలతో కొలుచుకోకతప్పదు
ప్రేమ కామరూపిణి"

....................

ఇంతకీ దేహదీపాన్ని వెలిగించుకున్నావా లేదా
లేకుంటే చీకటిగదిలో
తడుములాటతప్పదు." (ఆం. జ్యో. 27-9-'92).

'92 లో రెండు బలమైన కవితా సంపుటాలు వెలువడ్డాయి. అవి ఎండ్లూరి సుధాకర్ వర్తమానం, యాకూబ్ ప్రవహించే జ్ఞాపకం. వీటిలో నాస్టాల్జియా, దళితవేదన మొదలైనవి బాగా ప్రతిఫలించాయి. ఈ సంవత్సరంలో అమ్మ గురించి రాసిన నాలుగైదు కవితలు నా దృష్టికి వచ్చాయి. అసలు అమ్మ గురించి గత దశాబ్దం (Eightees) లో వచ్చినన్ని కవితలు ఎప్పుడూ రాలేదను కుంటాను. కొండేపూడి నిర్మల 'అక్వేరియం' (ఆం. జ్యో. 28-2-'92), రామానాయుడు 'జననీ జన్మభూమిశ్చ' (ఆం. జ్యో. 17-4-'92), నామాడి శ్రీధర్ 'తల్లి' (ఆం.జ్యో. 2-10-'92). '92 లోని 'మంచి అమ్మ' కవితలు. యాకూబ్ అమ్మను గురించి అద్భుతమైన కవిత రాశాడు. ఉదహరించకుండా ఉండటం కష్టం.

"అందరి అమ్మల్లాగే మా అమ్మకూడా
నన్ను కన్నది పురిటి నొప్పులు పడుతూ-
కాకపోతే
నా కుడిచేతిమీద ముద్దుపెట్టుకొని
లాలనగా నిమిరిందేమో
బహుశా, అందుకనే ఈ కవిత్వం.
పల్లేరుకాయలమీంచి జొన్న కొర్రులమీంచి
నడిచి నడిచి మోపులు మోసి నన్ను పెంచింది.
కాబట్టే, ఈ అక్షరాలకు ఇంత కన్నీటి తడి.
మా అమ్మతో నా పేగుబంధాన్ని
కొడవల్లిక్కితో బరబరా కోశారప్పుడు -
అందుకే ఈ అక్షరాలకు ఇంత గరుకు.
గొడ్లు మేపుతూ బుజ్జావు తప్పించుకున్నప్పుడు
ఎనకాల ఉరికి మర్లేసేది ధైర్యంగా
అందుకేనేమో
ఈ అక్షరాల్ని మర్లేస్తూ నేను." (ప్రవహించే జ్ఞాపకం.)

యాకూబ్ కవిత్వంలో rural, urban conflict వల్ల ఏర్పడే వైరుధ్యం, alianation కనిపిస్తాయి. అట్లాగే ఎండ్లూరి సుధాకర్ 'చెరువులేని వూరు' అని తన ఊరి బాల్యపు జ్ఞాపకాలను గురించి చక్కటి కవిత రాశాడు.

## 5. ప్రముఖసంఘటనలకు ప్రతిస్పందనలు :

నిత్య చైతన్యవంతులైన కవులు ఎప్పుడూ తమ కాలాన్ని ప్రతిబింబిస్తారు. గతంలో గల్ఫ్‌యుద్ధం, నల్లజాతి పోరాటం లాంటి అంతర్జాతీయ ఘటనలు, దాదర్ ఎక్స్‌ప్రెస్ సంఘటన, సంగీతాపాటిల్ సజీవ దహనం, పాతబస్తీ అల్లర్లు వంటివి కవులను ఎంతో కదిలించాయి. ఈ సంవత్సరం కూడా అటువంటి సంఘటనలకు ప్రతిస్పందనగా అనేక కవితలు కనిపిస్తాయి. హైద్రాబాద్ నగర కల్లోలాలను గురించి కె. శివకుమార్ ఒక కావ్యమే రాశాడు.

"మూసీ ఎవరి స్మృతి
మురికి ఎవరి స్మృతి
నిన్నటి నిషిద్ధ వీధుల్లో
నడుస్తున్న మూసీ కవితల మూసినతలుపులు తెరుస్తున్నారు."

బాబ్రీమసీదు, రామజన్మభూమి వివాదంపై ఇక్బాల్‌చంద్ 'ఎలిజీ', కె. ఆంజనేయకుమార్ 'కసాయం' పలువురి దృష్టి నాకర్షించాయి. వీళ్ళు కొత్తగా రాస్తున్న యువకులు. ఇప్పుడు నడుస్తున్న సారా ఉద్యమంపై కూడా చాలా కవితలొచ్చాయి. పాపినేని శివశంకర్ మంచి కవిత రాశాడు. ఇట్లా సంఘటనల గురించి రాసిన కవులు చాలామంది ఉన్నారు. వారిలో సినారె, శివారెడ్డి, నిఖిలేశ్వర్, గోపి, ఆశారాజు, కొందరు. ఈ మధ్య చెలరేగిన ఐ.ఎమ్.ఎఫ్. గురించి సతీష్‌చందర్ మంచి కవిత రాశాడు.

"జేబుల్లేని చొక్కాలు ధరించండి
పైసానష్టం లేకుండా పేదహృదయాల్ని కదిలిస్తాం" అని ఐ.ఎమ్.ఎఫ్. రుణాన్ని ఎగతాళి చేస్తారు. స్థలాభావం వల్ల నేనెన్నో కవితల్ని ఇక్కడ కోట్ చెయ్యలేకపోతున్నాను.

## 6. సీనియర్‌కవుల నిరంతరయాత్ర :

ఈనాటి యువకవులే కాకుండా ఈ యేడు ప్రసిద్ధ సీనియర్ కవులు కూడా గణనీయ సంఖ్యలో కవితలు రాశారు. ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, సోమసుందర్, గుంటూరు శేషేంద్రశర్మ, ఇస్మాయిల్, శీలా వీర్రాజు, మాదిరాజు రంగారావు, మోహనప్రసాద్, వరవరరావు, కె. శివారెడ్డి ప్రభృతులు.

నేటి కుహనా రాజకీయవేత్తను శపిస్తూ ఆరుద్రగారు (ఆం. జో. 30-8-'92) ఓ కవిత రాశారు.

"పదవినెత్తురు మరగిన బలవంతుడు
నరశార్దూలం కాదు
ఒకటిన్నర శార్దూలం
వాడి వాడిగోళ్ళకు కూడా నోళ్ళుంటాయి!

* * *

ఓటుల ఈటెలతో
పిడికిళ్ళ కొడవళ్ళతో
వీణ్ణంచేసినా పుణ్యమే!
అలాచేసేవాళ్ళ బ్రతుకులు ధన్యమే!" (ఆం.జో. 30-8-'92)

తీవ్ర అనారోగ్యానికి గురై, చాలాకాలం తర్వాత రాసిన ఆరుద్రగారి పలుకుల్లో వేడి వాడి తగ్గలేదు. అనారోగ్యం రోజుల్లోనే హుషారుగా 'కేరాలక్ష్మి' అనే మకుటంతో కందపద్యాలు రాశారు.

'92లో విస్తృతంగా కవిత్వం రాసినవారు డా॥ సి. నారాయణరెడ్డి. అసలు ఆనాటినుండి ఆపకుండా నిరంతరం రాస్తున్న సీనియర్ కవుల్లో సి.నారె. ప్రథములు. కుర్రాళ్ళతో పోటీపడి రాస్తున్నా నంటారు. ఈ సంవత్సరం ఆయన పదికిపైగా కవితలు రాశారు. వాటిలో ఆయా ప్రముఖ సంఘటనలకు ప్రతిస్పందించినవీ, మానవీయ జీరలతో పలికినవీ కనిపిస్తాయి. 'మాతృక' (ఆం.జో. 10-1-'92) అనే కవితలో—

"శవం చావదు
మట్టియై బతుకుతుంది
మట్టిని కాల్చి పూడ్చిపెడితే మొక్కై పేలుతుంది
మట్టిలో శిరస్నానం చేస్తే
ఓ ఆశయం మనిషిలా నిలబడుతుంది
కడుపులో బొగ్గుపాపల్ని పెంచే మట్టితల్లి
పడుకున్న రైలింజనులా వుంటుంది
మణుల్ని పుక్కిటపెట్టుకున్న ఆ మమతానిధి
మగ్గిన దానిమ్మపండులా వుంటుంది.

మట్టి తలూపితే పైర్లు ప్రవహిస్తాయి
గాలివేళ్ళకు పిల్లబుద్ధులు మొలుస్తాయి'' అంటారు. అలాగే పక్షుల బొమ్మలు (ఆం.జో. 24-7-'92), ఏకాంతమంటే (ఆం.జ్యో. 1.5-'92) అనే కవితలు ఉదాహరించదగినవి. అలాగే 'ద్విపదులు' పేరుతో వందలాది ముక్తకాలు రాశారు. ఇది పరిణతిలోంచి మొలిచి పదునుచేరి వెలువడిన లోకసూక్తులు. అనుభవ నిధులు. మచ్చుకు ఒకటి, రెండు:

''ఎదిగొచ్చిన కవితె చెబుతుందోయ్ ఎంతగ కదిలిందో మనసు
తూర్పు కడుపులో ప్రసవవేదనలు తొలిపొద్దుకుమాత్రం తెలుసూ
ఎదురుదెబ్బ తగిలిందా ఎక్కిన మదమంతా దిగిపోతుంది.
అనుభవమనేది మొదటి గురువురా అది గుణపాఠం చెబుతుంది.
జడమతులల్లిన పథకాలుంటే జాతి ఎలా వికసిస్తుంది?
ఎక్కిందేమో కర్రగుర్రమది యెలా ముందు కదుగేస్తుంది?"
(ఆం. జో. 3.2-'92)

ఇవేకాకుండా సినారె గేయగతుల్లో రన్ ఆన్ వెర్స్ పద్ధతిలో ఎన్నో ప్రయోగాలు చేశారు. తన గురించే ప్రత్యేక వ్యాసం రాయదగినన్ని రచనలు '92 లో చేశారు.

గుంటూరు శేషేంద్ర శర్మగారు ఈ మధ్య తక్కువగా రాస్తున్నారు. కాని రాసిందల్లా శేషేంద్ర ముద్రతో చక్కగా రాస్తున్నారు. "చెరుకు ముక్క" అన్న కవితలో—

"ఉదయాన్నే కిరణాలు పోలీసుల్లా
ఏదో వెదుకుతున్నాయి తీవ్రంగా........
చెట్లలో చెరువుల్లో ఇళ్లలో
తామరపువ్వుల్లో
దూరి దూరి చూస్తున్నాయి దొంగల కోసం!
పాపం వాటికి తెలీదు
రక్తకణాల్లో దాక్కొనున్న దొంగల్ని
రాష్ట్రపతికూడా పట్టుకోలేడు." (ఆంధ్రప్రభ 9.2-'92)

'92 లో ఇస్మాయిల్ చక్కని హైకూలు చాలా రాశారు. సమయానికి దొరకలేదు. మాదిరాజు రంగారావు గారు కూడా చిరకాలంగా అవిశ్రాంతంగా రాస్తున్న కవి.

వరవరరావు "నేను చెప్తూనే వుంటాను" అనే కవిత రాశారు.

"మరేం లేదు
ఏ రాజుకి రాజ్యానికి కాదు
మా ప్రాణానికి మేం కాపరులమని గుర్తించాం
మృత్యువు తథ్యమని తెలిసి ధిక్కారం నేర్చుకున్నాం."
(ఆం. జ్యో. వీ. 21-2-'92)

కె. శివారెడ్డి 'లోలాకులు' అనే కవితలో-

"రెండు పరుపులు కలిపికుట్టిన నావమీద
రెండు శవాలు సముద్రాంతర్భాగానికి ప్రయాణమౌతాయి."

ప్రముఖ కవీ, చిత్రకారులూ, కథకులూ, నవలాకారులూ అయిన శీలా వీర్రాజు '92 లో మూడు మంచి కవితలు రాశారు. వాటిలో "వెంటాడే దృశ్యం'' అనే కవితలోని కొన్ని పంక్తులు చూడండి:

"ఈ హుసేను సాగరం ఇంకా
హత్యాసాగరం కాకముందు
వందలాది అభాగ్యుల ఆత్మహత్యల్తో
వేలాది వినాయకుల జలసమాధుల్తో
ఈ నీరింకా మలినం కాకముందు
పిల్లగాలి తెరలకే అమాయకంగా పరవశించిపోయే
అలలకదలికల్తో
నిర్మలంగా తరంగాల నవ్వుల్ని
ఇంకా చిందడం మానెయ్యనప్పుడు
పగలు మేఘాలు, రాత్రుళ్ళు నక్షత్రాలూ
ఈ నాళాల్లో తమనితాము చూసుకొని

మురిసిపోగలుగుతున్నప్పుడు
ఓ సాయంకాలం ఒంటరి గూడొదలి
ఈ ట్యాంక్‌బండ్‌మీద కలల్ని ఏరుకుంటున్న నాకు
తీగలా కాళ్ళకు తగిలి నీవేసిన
ఆ దృశ్యం నారుపోసలు
మాటిమాటికి తాజాగా తచ్చాడుతూనే వుంటుంది."

(కంజిర - సెప్టెంబర్ '92)

వేగుంట మోహన ప్రసాద్ 1970 నుండి '80 వరకు రాసిన కవితల్తో '92 లో 'రహస్తంత్రి' పేరుతో ఒక పెద్దకవితా సంపుటిని ప్రకటించారు. స్రియలిస్టిక్, అస్తిత్వవాద ధోరణుల్తో రాసే మోహన ప్రసాద్ కవిత్వంలో వచ్చిన పరిణామాన్ని విమర్శకులు బేరీజు వెయ్యవలసి ఉంది.

పరిశోధనతోపాటు కవితావ్యాసంగాన్ని కొనసాగిస్తున్న విదుషీమణి నాయని కృష్ణకుమారిగారు. ఈ సంవత్సరం వారు గణనీయమైన సంఖ్యలోనే కవితలు రాశారు. బాల్యం, గాయపడిన రెక్క, రక్తం, కాకిపిల్ల, సారా ట్రుమీలు వాటిలో కొన్ని. కాకిపిల్ల కవితలో హైదరాబాదు నగరంలో పరిస్థితులు ఎంత ఛండాలంగా ఉన్నా ఈ ఊరు నాకిష్టం అన్న ధోరణిలో రాశారు.

## 7. తిట్టు కవిత్వం :

తెలుగులో తిట్టు కవిత్వం కొత్తేమీ కాదు. విమర్శ, వ్యంగ్య బాణాల దశను దాటినప్పుడు అది తిట్టు కవిత్వమవుతుంది. కవుల మధ్య దృక్పథాల్లో భేదం సహనం కొరవడటం ఇతరేతర కారణాల వల్లనో అప్పుడప్పుడూ వైషమ్యాలు తలెత్తుతుంటాయి. కవులు ప్రధానంగా ఆవేశశీలురు కాబట్టి తొందరగా బావోద్రేకాలకు లోనవుతుంటారు. ఈనాడు కవుల సంఖ్య చాలా పెరిగింది. అట్లాగే ముఠాల సంఖ్య కూడా పెరగటం సహజం. ముఠాలనేది కొంచెం కఠినమైన మాట. వీటిని 'ఇష్టబృందాలు' అనాలని నేనొకచోట అన్నాను. ఈ ఇష్ట బృందాలవల్ల కూడా కవులమధ్య వైమనస్యాలు తలెత్తుతుంటాయి. కవులు కూడా మనుషులే కాబట్టి తమకు తగినంత కీర్తి రాలేదనే భావం, ఫలానా వాళ్ళు తమ కీర్తికి అడ్డొస్తున్నారనే అభిప్రాయం కూడా వారిలో పని చేస్తున్నా

యనుకుంటాను. కవులు సున్నితమనస్కులుకూడా కాబట్టి ఎవరైనా ఒక మాట్టంటే పడరు. ఎన్నో రెట్ల ఆవేశంతో ప్రతిస్పందిస్తారు.

ఈ సంవత్సరం అటువంటి నాలుగయిదు కవితలు నా దృష్టికి వచ్చాయి. ఈ మధ్య ఒక వ్యాసంలో జ్వాలాముఖి స్త్రీవాద కవితల్ని 'నీలికవితలు', 'వార కవితలు' అని నిరసించాడు. దానికి ప్రతిస్పందనగా జయప్రభ "ఇక సోమి దేవమ్మలు" అనే కవితలో 'వాడు', 'వీడు' వంటి అగౌరవ పదజాలాన్ని వాడుతూ జ్వాలాముఖి దిగంబరకవితాజీవితాన్ని విమర్శిస్తూ స్త్రీవాదులందరి తరపున వకాల్తా పుచ్చుకొని-

"ఒసే కవయిత్రీ
రెండు పాత గుడ్డలుంటే పడెయ్యవే
కట్టుకుంటాడు"— అని రాశారు. దానికి ప్రతిస్పందనగా రాజ్‌మోహన్, నాగభైరవ కోటేశ్వరరావులు కొంత సున్నితమైన గొంతుతో కవితలు రాశారు. అయితే జ్వాలాముఖి చాలా కోపంతో జయప్రభకు జవాబుగా 'డాలర్‌ప్రభ' అనే పేరుతో కవిత రాశారు. దీనిలో ఆమె వ్యక్తిగత జీవితంలోకి కూడా చొచ్చుకుపోయినట్లు కనిపిస్తుంది. ఇట్లాంటి సందర్భాల్లో తమాషా చూసేవాళ్ళు, పైకి ఒక పక్షం వహిస్తూ ప్రైవేటుగా ఎంజాయ్ చేసేవాళ్ళు ఉంటారు తప్ప, వీటివల్ల సాహిత్యానికి ఒరిగేదేమీ లేదు.

అట్లాంటిదే సుమనశ్రీ (ఆంధ్రప్రభ 31-5-'92) ఒక కవిత రాశాడు. ఇది 'మో'తో "మద్యం సేవించినప్పటి సంభాషణ గుర్తుకొచ్చి రాసిన కవిత" అని కూడా ఆయనే పేర్కొన్నారు.

"ఆ రెడ్‌నైట్ ప్రేయసి మనిద్దరివేపూ ఎలా చూస్తోందో చూడు ప్రేమగా
ఈ రెడ్‌నైట్ పూర్తిగా దిగిపోకముందే ద్వారకా గోపురం ఎక్కి-
అందరిమీదా దాడి చేయాలని వుంది"—

అంటాడు. సుమనశ్రీ దేన్ని ఉద్దేశిస్తున్నారో ఈ పాటికి అందరికి అర్థమయ్యే వుంటుంది. ఇట్లాంటి వాటిని కవిత్వంగా రాయడం ఎంత అవసరమో వాటిని నేను ఇప్పుడు ఉటంకించడం కూడా అంతే అనవసరం.

అయితే ఇట్లాంటి ప్రతిస్పందన కవితల్లో కూడా అక్కడక్కడా బ్యాలెన్సు తప్పని ఒక కవిత కనిపిస్తుంది, రావిశాస్త్రి ఏదో సందర్భంలో స్త్రీవాదులను గయ్యాళులన్నాడట! దానికి సమాధానంగా ఓల్గా 'అవును-మేం గయ్యాళులమే!' అనే కవిత రాసింది. విషయానికే పరిమితమై ఆవేశంతో రాసిన మంచి కవిత ఇది.

## 8. పద్య కవిత్వం :

పద్య కవిత్వం ఒక దశాబ్దం ముందు వచ్చినంతగా రావటంలేదు. కారణాలు విమర్శకులు చెప్పాలి. వచనకవితల ప్రబల మారుతాల మధ్య నిష్ఠగా అఖండంగా పద్య దీపాలు వెలిగిస్తున్నవారు ఆచార్య తిరుమల. అయితే పద్య రచన మరీ నిరాశావహంగా ఏమీలేదు. ఈ సంవత్సరం నేను విన్నవే నూటికి పైగా పద్యకావ్యాలు వున్నాయి. బహుశా పత్రికల్లో వాటికి వచన కవితలకు లభించినంత ఆదరణ లభించకపోవటంవల్లనో ఏమో నలుగురి దృష్టికి రావటం లేదు. నా దృష్టికి వచ్చినవి కొన్ని: డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి చైతన్యశ్రీ, అయాచితం నటేశ్వరశర్మ భారతీ ప్రశస్తి, రసరాజు రసభారతి, విరించి విరించి శతకం, సంపత్కుమార అంతర్మథనం, బీర్నీడి వారి పద్య కావ్యాలు; '91 లో చేతవోలు రామబ్రహ్మం గారి 'క్రొత్త గోదావరి' కావ్యం పలువురి మన్ననలు పొందింది. '92 లోనే మలిముద్రణకు నోచుకుంది.

డా॥ కసిరెడ్డి చైతన్యశ్రీలో 'శిల్పి' గురించి రాసిన పద్యాలు మనసును పట్టుకుంటాయి. మచ్చుకు ఒక్కటి:

''ఏయే ప్రేమలు ఎక్కడెక్కడివిరా ఈ రాతి సౌధాలతో
ఏయే తీరులదిద్ది తీర్చబడెరా ఎన్నాళ్ళ కష్టాలురా
నీ యీ గుండెలలోన ఎన్ని కవితల్ నిర్నిద్రమై యుండెరా
మా యీ గుండెలు పుల్కరించినవిరా మాయన్న దండాలురా

ఇవే కాకుండా జే.బాపురెడ్డి, ఉండేలు మాలకొండారెడ్డి, ఊట్ల కొండయ్య గార్ల పద్య కావ్యాలు, తిరుమల శ్రీనివాసాచార్య రచించిన గంగతరంగాలు గేయంసపుటిని పరిశీలించవలిసేవుంది.

# 1992 లో నవల–కథ

—డాక్టర్ సి. మృణాళిని

తెలుగు నవలా సాహిత్యంలో పరిమాణం పెరిగినకొద్దీ ప్రమాణాలు పడిపోతున్నాయనడానికి ఈ సంవత్సరం అపవాదమేమీ కాదు. గత దశాబ్దంగా వున్న వ్యాపార ధోరణే ఈ ఏడాది కూడా రాజ్యమేలింది. అయినా ఈ నల్లటి మబ్బులకు వెండి అంచు లేకపోలేదు. అక్కడక్కడా సీరియల్స్ రూపంలో, ఎప్పుడైనా డైరెక్ట్‌నవలారూపంలో కొన్ని చెప్పుకోదగ్గ నవలలు వచ్చాయి. వాటిని రాసే సాహసం చేసినందుకు ఆ రచయితలు, ప్రచురించే సాహసం చేసినందుకు ఆ సంపాదకులు కూడా అభినందనీయులే!

వస్తువు, శిల్పం మాట అటుంచి, సమకాలీన తెలుగు నవలలను ప్రచురణ రీత్యా రెండు రకాలుగా విభజించవచ్చు. 1. సీరియల్ నవలలు 2. డైరెక్టు నవలలు. ధారావాహిక నవలలు తెలుగు సాహిత్యానికి కొత్త కాకపోయినా, వాటి స్వరూపాన్ని రచయితలకు బదులు సంపాదకులు శాసించడమన్నది ఇటీవల వచ్చిన 'విలక్షణ'మైన పరిణామం. నవలలో మిగిలిన విలువల మాటెలా వున్నా 'ఉత్కంఠ'ను పోషించడం రచయిత ప్రధాన బాధ్యత అని సంపాదకులు (అక్కడక్కడా అపవాదులుండవచ్చు) చేస్తున్న తీర్మానాన్ని ఏ రచయితా ఉల్లంఘించలేకపోవడం తెలుగు నవల దురదృష్టం. ఆ 'ఉత్కంఠ' కూడా సెక్స్, క్రైముల వల్లనే సాధ్యమౌతుందని వాళ్ళిద్దరూ (సంపాదకులూ, రచయితలూ) నమ్మి, పాఠకులను ఒప్పిస్తున్నారు. ఆరోగ్యంగా ఉన్నవాడికి రోజూ విస్కీపోసి బలహీనుణ్ణిచేసి, ఇపుడు పాలు తాగమంటే తాగడంలేదని ఫిర్యాదు చేస్తున్నారు సంపాదకులు. అందుకే మరికొంత విస్కీపోస్తే ఇక ఫిర్యాదు చేయాల్సిన అవసరం ఉండదని వాళ్ళు గ్రహించారు. సాహిత్యం ఎప్పుడైతే సరకుగా మారిందో ఇక దానిలో ప్రమాణాలు వెదకాలని ప్రయత్నించడం సాహసమే అవుతుంది. తెలుగు సీరియల్ నవలలు ప్రస్తుతం ఇలాంటి దయనీయమైన స్థితిలోనే ఉన్నాయి.

ఈ నవలల్లో రచయిత ఉద్దేశించిన మలుపులను, ముగింపును పాఠకులు, సంపాదకుల అభిప్రాయాలకు అనుగుణంగా మార్చేసుకున్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అంటే సీరియల్ నవలా రచయితకు స్వేచ్ఛ తక్కువ. వారం వారం పాఠకుల నుంచి వచ్చే ఉత్తరాలపైనా, సంపాదకులతో సమావేశాలపైనా ఆధారపడి నడిచే నవలల్లో సృజనాత్మకత ఎంత వుంటుంది? క్షణక్షణమూ రంగు మార్చుకునే ఆ పాత్రల్లో, సన్నివేశాల్లో సంభావ్యత ఎంత వుంటుంది? అందుకే సీరియల్ నవలల్లో మంచివి రావడమన్నది అరుదు. ఇటువంటి నేపథ్యంలోనూ మంచి నవలలు అందించడానికి ప్రయత్నించిన పత్రిక ఈ ఏడాదిలో 'ఆంధ్ర ప్రభ' వారపత్రిక మొదట నేమో! ఈ పత్రికలో వచ్చిన 'గోపాత్రుడు' (కె.ఎన్.వై. పతంజలి), 'నాలుగుగోడల కవతల' (ఆరె పద్మజా చౌదరి) మంచి నవలలు. 'ఉత్కంఠ' అనే చాపల్యానికి బలికాని వాస్తవ రచనలు.

ఆధునిక స్త్రీ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడానికి పడే ఆరాటం గురించి పద్మజా చౌదరి 'నాలుగు గోడల కవతల' నవలలో సమర్థవంతంగా వ్యాఖ్యానించారు. వస్తువులోనూ, పాత్ర చిత్రణలోనూ, కథా నిర్వహణలోనూ ఎన్నదగినది ఈ నవల.

కె.ఎన్.వై. పతంజలి రాసిన 'గోపాత్రుడు' తెలుగు నవలలో ఇంకా హాస్యం, జీవం చచ్చిపోలేదనడానికి మంచి నిదర్శనం. రావిశాస్త్రి తర్వాత అంత శక్తిమంతంగా ఉత్తరాంధ్ర మాండలికాన్నీ, అధిక్షేప హాస్యాన్ని నవలలో రంగరించగలిగిన రచయిత వీరొకరే. ఈనాటి రాజకీయ వాతావరణాన్ని, కులమత విద్వేషాలలోని అల్పత్వాన్ని,మనిషిని పతనం చేస్తున్న అసహిష్ణుతనూ వ్యంగ్యంగా, అద్భుతంగా చిత్రించిన ఈ నవల 1992 నవలల్లో ఎన్నదగింది. అయితే ఈ నవలలో కాన్వాసు ఇంకా విస్తృతంగా ఉండి, క్షీణిస్తున్న సామాజిక విలువల సమగ్ర చిత్రణ వుండి వుంటే, ఇది ఖచ్చితంగా గొప్ప నవల అయివుండేది.

నమూనా సీరియల్ నవలల గురించి ప్రత్యేకంగా చెప్పవలసిందేమీ లేదు. మనిషిలోని బలహీనతలనే అతని ధీరలక్షణాలుగా చిత్రించే ధోరణి అలాగే కొనసాగుతోంది. బలహీనతలను జయించడం కంటే, వాటికి లొంగిపోవడమే హీరో లక్షణమని ఈ రచయితలు నమ్ముతున్నారు. దాన్ని 'నవరసాత్మక'ంగా చిత్రించి, పాఠకులను ఆకర్షిస్తున్నారు. పగ, ద్వేషం, అసూయ, వాంఛ వంటి బలహీనతలను ధీరోదాత్త నాయకుడి లక్షణాలుగా చూపించి, ఈ బలహీనతలే అతనికి విజయసోపానాలైనట్లు చిత్రించడంలోనే ఆ రచయితల అపరిపక్వత తెలు

స్తుంది. ఇది చాలా ప్రమాదకరమైన రచనాధోరణి. సాహిత్యం మంచి చేయక పోతే మానె, చెడు చేయకుండా వుండే చాలు. ఇప్పుడు వస్తున్న నవలా సాహిత్యం రెండో పనే చేస్తోంది.

సీరియల్ నవలగా వచ్చి 1992 లో పుస్తక రూపం దాల్చిన "త్రేతాగ్ని" (అడివి సూర్యకుమారి) మూస నవలల్లో కొంత ప్రత్యేకత సంతరించుకున్న నవల. కొత్త వస్తువును కొత్త విశ్లేషణతో వ్యాఖ్యానించడానికి ప్రయత్నించిన రచన ఇది. నక్సలైట్ల పునరావాసం నవలా వస్తువు కావడం బహుశా ఇదే తొలిసారి. రచయిత్రిలో నిజాయితీవున్నా ఆదర్శ ప్రియత్వం కూడా వున్నందువల్లనేమో, కొంత అవాస్తవికంగా తోచినా, మంచిని ప్రచారం చెయ్యడానికి ఆమె చేసిన ప్రయత్నం మాత్రం అభినందనీయమే! పాఠకుల ఉత్తరాలు, సంపాదకుల వారి సూచనలకు లొంగిపోయి అసహజమైన ముగింపుకు బలైపోయిన నవలల్లో ఇదికూడా ఒకటి.

యండమూరి వీరేంద్రనాథ్ డైరెక్టు నవల 'అంతర్ముఖం' కూడా ఈ సంవత్సరమే వెలువడింది. మసాలా కావల్సినంత వున్నా, రచయితా ఆలోచనల్లో, జీవనవైఖరిలో, రచనా లక్ష్యంలో పరిపక్వత వచ్చిందనడానికి ఈ నవల మంచి ఉదాహరణ. ఈ నవల అనుకరణే అయినా, అనుకరించడానికి వీరేంద్రనాథ్ మంచి నవలను ఎన్నుకోవడం (ఇదివరకులా కాక) చెప్పుకోదగ్గ విషయం వీరేంద్రనాథ్‌లో ఇది వరకు లేని ఐరనీ ఈ రచనలో కనిపిస్తుంది. రచయితకు, పాఠకుడికిమధ్య దూరాన్ని తగ్గించే ఐరనీని తెలుగులో చాలా కొద్ది మంది రచయితలు మాత్రమే సాధించగలిగారు. ఈ రచన ద్వారా వీరేంద్రనాథ్ అటువంటి రచయితలకు దగ్గర కాగలిగారు.

1992 లో వచ్చిన కథలను సమీక్షించడం అసాధ్యమైన పని. కథల సంఖ్య తక్కిన అన్ని ప్రక్రియల కంటే ఎక్కువగా ఉంటుంది. పైగా, మరీ అసాధారణమైతే తప్ప, కథలు ఎక్కువ కాలం గుర్తుండవు. చదవగానే బాగుందనిపించే కథలు చాలానే వుంటాయి. మరీ మరీ గుర్తు తెచ్చుకునే కథలు ఇటీవలి కాలంలో తక్కువేనని చెప్పవచ్చు. 'రచన', 'స్వాతి' మాసపత్రికల్లో చాలా వరకు మంచి కథలే వస్తున్నాయి. ఇటీవలి కాలంలో కలంపట్టడం మానేసిన మంచి రచయితలు మళ్ళీ 'రచన'లు రాయడం మొదలు పెట్టడం ఆనందించదగ్గ విషయం. 'స్వాతి'లో కొత్త రచయితల మంచి కథలను ప్రోత్సహిస్తున్నారు.

మొత్తం మీద నవలల కంటే, కథల పరిస్థితే మెరుగ్గా వుంది. 'పెద్దలకు మాత్రమే' కథలు 'సరసమైన' కథలు, 'సెంటర్ స్ప్రెడ్ సెన్సేషన్లు' తమ శాయ శక్తులా ప్రయత్నించినా, మంచి కథలు పూర్తిగా మరుగున పడిపోవడం లేదు. అయితే వ్యాపారాత్మకత కథలకు కూడా వ్యాపించింది. ముఖ్యంగా కథలకు వేసే చిత్రాలు వీలైనంత అశ్లీలంగా ఉంటున్నాయి మంచి చిత్రకారులు ఇలాటి బొమ్మలు వేసి తమ ప్రతిభను తామే కించపరుచుకొంటున్నారు. మొత్తం మీద ఈ సంవత్సరం కథల్ని చూస్తే, కథావస్తువుల్లో వైవిధ్యం ఉన్నా, కథానికా శిల్పం మీద శ్రద్ధ లోపించినట్లు తెలుస్తుంది. ఎలాగోలా చెప్పదలచుకున్నది చెప్పేయడ'మన్న ధోరణి తప్ప, చెప్పదలచిన విషయాన్ని ఎంత శక్తివంతంగా, అందంగా చెప్పవచ్చునన్న వివేచన రచయితల్లో చెప్పుకోదగ్గ స్థాయిలో లేదు.

నవలల్లోనూ, కథల్లోనూ భాషాపరంగా చూసినపుడు గత కొన్నేళ్ళుగా ఉన్న ధోరణే సాగుతుంది. తెలుగు కథల్లో ఇంగ్లీషు పదజాలం బియ్యంలో రాళ్ళలా అడ్డుపడుతూనే వుంది. అనువాదం కుదరని 'అఫ్‌కోర్స్' 'నాన్సెన్స్' వంటి కొద్ది పదాలను యథాతథంగా వాడడంలో తప్పులేదు గానీ, 'ఐ డోన్ట్ బిలీవ్‌యూ', 'ఆమె చాలా హిపోక్రటికల్‌గా థింక్ చేస్తోంది' 'అతని సబ్ కాన్షస్‌లో ఆ థాట్ మెదిలింది' ఇత్యాది వాక్యాలను ఏమనాలి? ఎందుకొచ్చిన కృతకత్వం? కొందరు రచయితలు వాక్యాలకు వాక్యాలు ఆంగ్లంలోనే రాస్తారు. అందులో వ్యాకరణంకోసం మాత్రం ఏ థేమ్స్ నదిలోనో వెతుక్కోవాల్సిందే. ఇంగ్లీషు, తెలుగు రెండూ వచ్చినవాళ్ళు రాస్తే అదో రకం కానీ, రెండూ రాని వాళ్ళే ఈ మణిప్రవాళాన్ని పాఠకులపై ప్రయోగించడం గమ్మత్తయిన విషయం.

మొత్తం మీద 1992 లో తెలుగు నవల, కథ కొత్తగా పురోగతి సాధించకపోయినా, ఏ నూతన ధోరణినీ ప్రారంభించ పోయినా, అంతకుముందు కంటె దిగజారిపోనందుకు, మంచి సాహిత్యానికి ఎంతోకొంత స్థానం లభిస్తు న్నందుకు ఆనందించాల్సిందే. వ్యాపార రచయితల్లో 'అంతర్ముఖత్వం' రావడం ఓ విధంగా శుభసూచకం. ముఖ్యంగా రచయిత్రులు నవల్లో కొత్త ధోరణులు తీసుకురావడానికి గట్టి ప్రయత్నం చేయడం ఈ సంవత్సరం సాధించిన విజయం.

# 1992లో (వార, మాస) పత్రికల పాత్ర

—శ్రీమతి అడివి సూర్యకుమారి

జీన్ జిరాడ్యెక్స్ ఒకావిడకి ఉత్తరం రాస్తూ ఇట్లా అంటాడు : ''డియర్ మేడం, మాది పత్రికా వ్యవస్థ. మా శక్తి మీకు తెలుసు. మేము విలువల్ని నిర్ణయిస్తాం. మీ మొత్తం భవిష్యత్తు మాపై ఆధారపడి వుంది'' అంటాడు.

దీన్నిబట్టిచూస్తే - పత్రికారంగం ఎంత శక్తివంతమైనదో, మానవ విలువల్ని నిర్ణయించడంలో ఎంత బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తుందో తెలుస్తోంది.

1992 లో వార, మాస పత్రికలు నిర్వహించిన పాత్రను వివరించటం ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

ఈ (వార, మాస) పత్రికలు తొలుత ఏ ప్రయోజనం కోసం ప్రారంభించబడింది తెలుసుకోవాలంటే కొంత చారిత్రక నేపథ్యం చెప్పుకోవడం అత్యవసరం.

1874 లో వీరేశలింగం పంతులుగారు 'వివేకవర్ధని'తో పత్రికా ప్రపంచానికి కొత్త కిటికీలు తెరిచారు. తెలుగునాట సమాజాన్ని శాసనం చెయ్యడానికి ఆయన సంధించిన బాణం 'వివేకవర్ధని' పత్రిక.

1885లో వచ్చిన 'ఆంధ్ర ప్రకాశిక' వారానికి రెండు సార్లొచ్చే పత్రిక. ఈ పత్రిక ప్రభుత్వ వ్యవహారాలను ధైర్యంగా విమర్శించేది. న్యాయంకోసం, పరిపాలనలో సమభావం కోసం పోరాడింది. ప్రభుత్వ శాఖలలోని అవినీతిని తూర్పార బట్టింది.

1894లో 'శశికళ' అనే వార పత్రికను గట్టుపల్లి శేషాచార్యులుగారు ప్రారంభించారు.

1902 లో 'కృష్ణాపత్రిక' ప్రారంభించబడింది. దీని తొలి సంపాద కులు కొండా వెంకటప్పయ్య పంతులుగారు. వందేమాతరం ఉద్యమ కాలంలో పంతులుగారి వ్యాసాలు ఉత్తేజపూరితాలై, జాతికి చైతన్య స్ఫూర్తిని కల్గించాయి.

1907 నుండి కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వంలో భారతదేశంలోకెల్లా గొప్ప పత్రికగా ప్రఖ్యాతి నొందింది. కృష్ణారావుగారు కలాన్ని కత్తిలా ఝుళిపించి, విదేశీపాలకుల దౌష్ట్యాన్ని, పర్యవసానానికి లెక్క-చెయ్యక ఖండించారు. ఆయన సంపాదకీయాలు ఎంతో ఖ్యాతి నొందినవి.

1908 లో బొంబాయినుండి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'ను ప్రారంభించి, తెలుగు వారపత్రికా రంగాన్ని సుస్థాపితం చేశారు.

ఈ పూర్వ పత్రికలన్నీ కూడా డబ్బుకోసం కాక, ఉన్నతాశయాల సాధనకు వేదికలుగా, ప్రజాహిత వ్యతిరేక శక్తులతో పోరాటానికి సాధనాలుగా, దేశభక్తి, జాతీయోద్యమం, సంఘ సంస్కరణ, మూఢాచార నిర్మూలన, స్త్రీ జనాభ్యుదయం, మద్యపాన నిషేధం, అంటరానితనం నిర్మూలన మొదలైన అంశాలతో - ప్రయోజనం, ఆనందం రెండూ సమ్మిళితంగా ఉండేవి. బహు జన హితం కోసం, జాతివిముక్తి, ఉన్నతి కోసం కృషి సల్పాయి.

అయితే ఈ చారిత్రక నేపథ్యం అంతా ఎందుకు చెబుతున్నానంటే - ఆనాటి సంపాదకులు, యాజమాన్యం, రచయితలు, కవులు గొప్ప ఆదర్శా లతో, రాజకీయ, సాంఘిక, సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని కాంక్షిస్తూ మానవీయ విలువలతో తెలుగు పత్రికారంగానికి గట్టి పునాది వేశారు.

అయితే నాటికీ నేటికీ ఎన్నో మార్పులొచ్చాయి. ఇప్పుడున్న పత్రికల స్వరూపస్వభావాలు, యాంత్రిక సౌకర్యం ఆ నాటి పత్రికలకి లేవు. అయి నప్పటికీ ఆ నాటి పత్రికలకున్న పేరు ప్రతిష్ఠలు ఈ పత్రికలకు లేవు. కారణం- ఈనాటి వార పత్రికలు వ్యాపారపు అంగళ్ళు. ఒక ప్రయోజనం, లక్ష్యంలేని కేవలం జారుడుమెట్లు.

ఈ నాడు ప్రముఖంగా వార పత్రికలుగా చెప్పుకోదగిన స్థాయిలో ఏడెనిమిదిదాకా కన్పిస్తున్నాయి. ఆంధ్రభూమి, స్వాతి, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర ప్రభ మొ॥నవి. వీటిలో కొన్నిటి అమ్మకాలు ఏభై వేల నుంచి లక్ష దాటాయి.

దీన్ని గమనిస్తే - పాఠకుల పఠనాసక్తిని పెంచటం ఎంత సంతోషదాయకమో, అవి వారికి అందిస్తున్న సాహిత్యపు స్థాయి అంత విషాదాన్ని కలిగిస్తోంది. అంటే- వారపత్రికలు స్థూలంగా పాఠకుల సంఖ్య పెంచాయే తప్ప, పాఠకుల అభిరుచి స్థాయిని మాత్రం పెంచలేకపోయాయి.

ఈ రోజుల్లో వార పత్రికలంటే ఏమిటి? ఐదారు సీరియల్స్, ఒకటో రెండో కథలు, తప్పనిసరిగా ఒక శృంగార కథ, ప్రతి పేజీలో కొంత మేర స్త్రీని కించపరిచే కార్టూన్లు (కొన్ని పత్రికలలోనే), శీర్షికలు, ప్రశ్నలు జవాబులు బహుమతులు మొదలగునవి. ఇదీ వార పత్రిక స్వరూపం.

ఇక్కడ నేను రెండు ప్రశ్నలు వేసుకున్నాను.

ఒకటి-92 లో వారపత్రికల్లో ఎటువంటి రచన లొచ్చాయి? సీరియల్స్ మొదలగునవి.

రెండు - కవరు పేజీనుండి చివరి పేజీదాకా పత్రికల్లో ఏమున్నది?

ఈనాడు పత్రికల్ని గమనిస్తే మూడు విషయాలు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి.

మొదటిది - సెక్స్, క్రైం, జుగుప్స, బీభత్సం మొదలైనవి ప్రధానాంశాలుగా వచ్చే సీరియల్ నవలలు.

రెండవది - సమకాలీన సమస్యలకి ప్రతిస్పందన.

మూడవది - మానవీయసంబంధాలు.

స్వతంత్రం వచ్చాక దేశంలో మంచితనం కొంచమైతే - అవినీతి, లంచ గొండితనం, స్వార్థం, దోపిడీ ఎక్కువయ్యాయి. ఇవి అన్ని రంగాలతోపాటు పత్రికారంగాన్ని కూడా వదల్లేదు. ఫలితంగా మంచి - చెడు ఇందులోనూ చోటు చేసుకున్నాయి.

ముందుగా మంచిరచనల గురించి చెప్పుకుందాం. ఇది చెప్పేముందు 'నవల' గురించి రెండు మాటలు చెబుతాను.

నవలకి ఈనాడున్నంత ఆదరణ, పలుకుబడి మరి ఏ ఇతర సాహిత్య ప్రక్రియకూ లేదు. దైనందిన జీవితంలో మనిషి ఎదుర్కొంటున్న అనేకానేక

సంఘటనలు నవలకు ఇతివృత్తాలు కావటంతో ఈ సాహిత్య ప్రక్రియను ప్రపంచ ప్రఖ్యాతి నొందిన మహా రచయిత లందరూ చేపట్టి, ఉత్తమమైన నవలలెన్నో రచించి, దీనికో ప్రత్యేక స్థానాన్ని కల్పించారు.

ఇతివృత్తాన్ని బట్టి వారపత్రికల్లో వచ్చిన నవలల్ని 5 విధాలుగా విభజించవచ్చు.

1. పౌరాణిక నవలలు, 2. చారిత్రాత్మక నవలలు, 5. అపరాధ పరిశోధక నవలలు, 4. రాజకీయ నవలలు, 5. సాంఘిక నవలలు.

ఈ 92 లో వచ్చిన ఒక పౌరాణిక సీరియల్ నవల పేరు 'రాజమాత,' రచయిత శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య. మహాభారతంలోని 'కుంతి'ని ప్రధాన పాత్రగా చేసుకొని, ఆమె చుట్టూ భారతవీరుల కథను నవలా మూసలో పోసి చెప్పారు రచయిత. నవలకు ప్రధాన లక్షణమైన 'చదివించే గుణాన్ని' ఈ రచయిత బాగా ఉపయోగించుకున్నారు. భారతంలోని అనేకానేక ఉపాఖ్యానాలను కూడా సులభశైలిలో ప్రధాన కథ దెబ్బతినకుండా, పాత్రల మనోభావాల్ని విశ్లేషణాత్మకంగా వివరించారు. ఈ నవల ఘటనా ప్రధానంగానూ, కౌతూహల ప్రధానంగానూ, ఇతిహాస ప్రధానంగానూ సాగింది. పురాణ సంబంధమైన విషయాన్ని వస్తువుగా తీసుకున్నా, దాని పౌరాణికత పోకుండా నిలుపుతూ, నేటి సమాజానికి ఆ పాత్రల ఔన్నత్యాన్ని, అవసరాన్ని వివరించి నిరూపించారు రచయిత.

చారిత్రాత్మక నవల - శ్రావణి - రచయిత శ్రీ ముదిగొండ శివప్రసాద్. ఏదైనా దేశచరిత్రనిగాని, లేదా ఆనాటి ఒకానొక ప్రముఖ సంఘటనను కానీ, చరిత్రలోని ప్రముఖ వ్యక్తిని గాని, వీరోచిత కృత్యాల్ని సాహస కార్యాల్ని చేసినవారి జీవితంలో తెరమరుగునపడ్డ విశేషాలనాధారంగా చారిత్రక నవలలు రాస్తారు. ఈ పంథాలో శ్రీ శివప్రసాద్‌గారు శ్రావణి నవల రాశారు. ఈ నవల జాతీయ భావాల్ని, దేశభక్తిని పాఠకుల్లో పెంపొందింప చేసే విధంగా సాగుతుంది. సహజంగా నీరసంగాను, అస్తవ్యస్తంగాను ఉన్న చారిత్ర గ్రంథాల్లో సరైన సత్యమైన విషయాన్ని మనం గ్రహించడం కష్టం. మనకు చారిత్రక సత్యాలతో కూడిన గ్రంథాలు అతి తక్కువ. ఈ నేపథ్యంలో చరిత్రకు కొంత

కల్పన జోడించటం తప్పనిసరి. పాఠకుల్లో ఉత్సుకత, చదివించగలగడం కూడా అవసరమే. రోగిచేత చేదు మాత్ర మింగించటం కష్టం. ఆ మాత్రకి షుగర్ కోటింగిచ్చి అందిస్తే సులభంగా మింగుతాడు. అలాగే దేశభక్తి, ధర్మం లాంటి అంశాలను, చరిత్రతో జోడించి చెప్పి పాఠకుడికి విసుగు కలిగించకుండా, రచయిత పరిశోధనాంశాన్ని తీసుకున్నారు. ఇందులో పోగొట్టుకున్న నీలమణి శ్రావణికై పులోమావి పరిశోధన సాగించి, ఎట్టకేలకు సాధిస్తాడు. శాతవాహనుల కాలం నాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక స్థితిగతుల్ని, గాథా సప్తశతిలోని కొన్ని గాథల్ని ఆధారంగా తీసుకొని రచయిత చక్కని సులభ శైలిలో పాఠకుల నాకట్టుకొని చదివించే విధంగా రచించారు.

ఒక సోషియో పొలిటికల్ సీరియల్ నవల ఆంధ్రభూమిలో వచ్చింది పేరు 'త్రేతాగ్ని'. సామాజిక వ్యవస్థలో మార్పును, ఆ మార్పు కొరకై జరుగుతున్న సంఘర్షణను చిత్రిస్తున్నవానిని, ఒక విధంగా వర్తమానకాలపు రాజకీయ, సామాజిక సంఘర్షణను చిత్రిస్తున్న నవలలను రాజకీయ నవలలుగా చెప్పుకోవచ్చు. దీనినే నేను సామాజిక రాజకీయ నవల అన్నాను.

టెర్రరిజానికి స్వస్తి చెప్పి, హింసని విడనాడి, చట్టపరిధిలో సమస్యల్ని పరిష్కరించుకోవాలనుకునే యువతరం దృక్పథానికి, సమకాలీన సమస్యలకి అద్దంపట్టే నవల త్రేతాగ్ని. రచయిత్రి అడివి సూర్యకుమారి.

మానవ సంబంధాలలోని ఔన్నత్యాన్ని దాటే మరో మంచి నవల, రావులపాటి సీతారాంరావుగారి "హృదయవేదం." త్యాగం కేవలం ఒక సాధనంగా మాత్రమే పరిపూర్ణం కారాదని, ప్రత్యేకించి సాధ్యరూపంలో కూడా సునిశ్చితం, అంకితం కావాలని ప్రతిపాదించారు. ఈమేరకు నాయిక శ్వేత పాత్రను చక్కగా చిత్రించారు.

మరికొన్ని సాంఘిక నవలల్ని కూడా తెలియచేస్తాను.

1. గ్రామీణ రాజకీయాలకు అద్దంపట్టిన 'గోపాత్రుడు.'
2. స్వతంత్రం రాకముందు విశాఖ జిల్లాలోని బెస్తవారి జీవిత చిత్రణతోసాగే "బతుకురతం" నవల.

3. భూస్వాములు గ్రామీణ స్త్రీలపై చేసే అత్యాచారాలు, దానికి వ్యతిరేకంగా స్త్రీలెలా పోరాటం సాగించారు అనే ఇతివృత్తంతోసాగే ''బతకమ్మ మునిగింది.''
4. ఒక పల్లెలో మంచినీటికి సంబంధించిన సమస్యతోసాగే ''మంచినీళ్ళబావి."

ఇలా ఈ 92 లో వచ్చిన సీరియల్ నవలల్లో రచయితలు (రచయిత్రులు) మంచి వస్తు వైవిధ్యాన్ని చూపించారు. శైలిలో సరళత, చదివించే గుణం బాగా పెరిగిందని చెప్పొచ్చు.

అయితే వీటితోపాటు సభ్యసమాజం సిగ్గుతో తలవంచుకునే అనేక అసభ్య రచనలు చోటు చేసుకున్నాయి. దీనికి కారణాలేమిటంటే-

1. తను వ్రాసే ప్రతి వాక్యానికి ఓ ప్రయోజనం ఉండాలని, రచయిగా త తనకో గురుతరమైన బాధ్యత ఉందని రచయితలు గుర్తించటంలేదు.

2. కొద్దికాలమే అయినాసరే సెన్సేషనల్‌గా పాఠకుల దృష్టిలో వెలిగిపోదామనే కోరిక హెచ్చుగా కన్పిస్తోంది.

3. కొందరు రచయితలు ఆర్థికంగా బాగుపడ్తున్న రచయితలుగా స్థిర పట్టంవలన మిగతావారిలో కూడా సినిమాని దృష్టిలో పెట్టుకొని నవల వ్రాయాలనే వ్యాపారదృష్టి అధికమై, బాధ్యతలపట్ల, విలువలపట్ల నిర్లక్ష్యం పెరిగింది. తత్ఫలితంగా పత్రికలలో నానారకమైన చెత్త సాహిత్యం చోటుచేసుకొంది, ఇందువలన నష్టం ఒక్క పాఠకులకే కాదు - మంచి సాహిత్యాని క్కూడా.

ఇంతేకాదు, ముందుతరాలు ఈనాటి సమాజాన్ని గురించి చాలా నీచంగా ఊహించుకొనే అవకాశం అశ్లీల రచన చేసే రచయితలు కలిగిస్తున్నారు.

ఒకనాటి రచనల్లో నాటి సమాజం, ప్రజలు, వారి కష్టసుఖాలు, ఉద్యమాలు, వాటిని నడిపే నాయకుల ధీరోదాత్తగుణాలు - చదువుతూంటే రాసిన రచయితపై, రచనపై, ఆ కాలంనాటి ప్రజలపై ఎంతో గౌరవం, పూజ్య భావం కల్గుతాయి.

ఈనాటి ఈ రకమైన సాహిత్యాన్ని ముందు తరాలవారు చూసి ఏమనుకుంటారు? ఇంత నీచంగా, అల్పంగా ఆనాడు జనబాహుళ్యం ఉందా? నైతిక విలువలు, మానవత్వం ఇంత లుప్తమైనాయా?! అని అనుకోక మానరు. ఇటువంటి

అశ్లీల సాహిత్యం సృజించి సాహిత్యాన్నే కాదు - ఒక తరం ప్రజల్నే అసహ్యించు కునే స్థితికి రచయితలు తీసుకొస్తున్నారన్నది వారు గ్రహించటంలేదు. జుగుప్సా కరమైన రచనకి ఒక్క ఉదాహరణ ఇస్తాను:

"అతను ఫ్రిజ్ తలుపు తెరిచాడు. గుండె కనిపించింది. అతనికి నోరూ రింది. కిచెన్ రూంలోకి తీసికెళ్ళి దాన్ని ఫ్రై చెయ్యసాగాడు. అంతలో...." సస్పెన్స్. వచ్చేవారం చూడండి.

ఏ ప్రయోజనం ఉందీ వాక్యాల్లో??

ఇక రెండవ విషయాని కొస్తాను.

కవర్ పేజీనుండి, చివరి పేజీదాకా సీరియల్స్‌గాక వారపత్రికల్లో ఉన్న వేమిటి?

1) శృంగార కథలు 2) ప్రశ్నలు - జవాబులు 3) వ్యాసాలు 4) శీర్షి కలు - బహుమతులు 5) సెక్స్ విజ్ఞానం 6) హాస్యం.

కవర్ పేజీతో మొదలుపెడతాను. పత్రిక చేతపుచ్చుకోవడానికి సిగ్గుపడే స్థాయిలో వారపత్రికల ముఖచిత్రాలు దర్శనమిస్తున్నాయి. సినీతారల అర్ధనగ్న చిత్రాల వల్లనే తమ సర్క్యులేషన్ పెరుగుతోందని కొందరు సంపాదకుల ఉవాచ. ఇతర రాష్ట్రాలలో సినిమా పత్రికలకు తప్ప మరి దేనికీ సినీతారల బొమ్మలు వెయ్యరు. ఈ దుర్దశ కేవలం మన తెలుగు వార పత్రికలకే!

(1) శృంగార కథలు లేక సెంటర్ సెన్సేషన్ లేక సరసమైన కథ - అన్న పేర్లతో ప్రతి వారపత్రికలో ఈ తరహా అశ్లీలమైన కథ ఒకటుండా ల్సిందే. అయితే మిగతా కథలు కూడా వచ్చిపోయి అదే ధోరణిలో ఉండటం చేత మంచికథకోసం వారపత్రికల్లో వెదుక్కోవడం కష్టమైంది.

(2) శీర్షికలు-బహుమతులు :- సర్క్యులేషన్ పెంచుకోవడం కోసం వారపత్రికల వికారపు చేష్టలు అన్నీ ఇన్నీ కావు. పాఠకుల మానసిక దౌర్బ ల్యాన్ని, అజ్ఞానాన్ని, ఉద్రేకాల్ని రెచ్చగొట్టే శీర్షికలు పత్రికల స్థాయిని ఇతోధి కంగా దిగజార్చాయి. కొన్ని ఉదాహరణలు :

(1) "మీ అబ్బాయి ఎదిరింటమ్మాయితో లేచిపోతే మీరేం చేస్తారు? మంచి జవాబుకో బహుమతి. ఊహించండి. సస్పెన్స్."

ఇటువంటి శీర్షికలు ఆరోగ్యకరమైనవేనా?

(2) "మీరెద్దైనా ఊరు వెడితే అక్కడ సరదాగా మీకు కంపెనీ ఇవ్వ డానికో వ్యక్తి."

పత్రికలు, సంపాదకులు ఉన్నది పరాయి వూళ్ళలో కంపెనీ యిచ్చే వాళ్ళని వెదికిపెట్టడానికేనా?

3) "మీకు నచ్చిన హీరోతో ఓ రోజు గడపండి. ఈ క్రింది కూపను కరెక్టుగా పూర్తిచేసినవారికే అవకాశం."

ఇటువంటి శీర్షికలు 'యువత' మానసిక స్థితిపై ఎటువంటి ప్రభావాన్ని చూపిస్తాయనేది ఒక్క క్షణమైన ఆలోచించారా? సదరు సంపాదకులా పత్రికను తమ ఇంటికి తీసికెళ్ళగలరా!

3) సెక్స్ విజ్ఞానం :- సెక్స్ విజ్ఞానం పేరుతో జవాబులిచ్చే డాక్టర్లు ఎంత అశ్లీలతని, అసభ్యతని పోగుచేస్తున్నారో!

4) ప్రశ్నలు - జవాబులు:- పత్రికల్లో పాఠకుల పార్టిసిపేషన్ ఒక ముఖ్యమైన విషయమే. ఆరోగ్యకరమైన వాదోపవాదాలకి పాఠకుల ప్రవేశం అవసరమే కాని, ఈనాడది వికృతంగా మారిపోయింది. రచయితలతో ముఖాముఖీలు మరీ దారుణం. ఓ వారపత్రికలో పాఠకుడడిగిన ప్రశ్న ఇలావుంది: ''మీ సీరియల్ చదివి నాకు తెలిసిన ఓ అమ్మాయి వ్యభిచారం తప్పుకాదని ఆ పని చేసింది. మీ సమాధానం?''

దీనిని బట్టిచూస్తే తమ రచనలు ఎంత ప్రమాదకారులుగా ఉన్నాయో రచయితలు గుర్తించడం మంచిది. పాఠకుల బలహీనతల్ని రెచ్చగొట్టి సొమ్ము చేసుకొనే ఇలాంటి రచయితల్ని, పత్రికాధిపతుల్ని క్రిమినల్స్‌గా పరిగణించాలి.

సమాజంలో ఏ నైతిక బాధ్యతను స్వీకరించకుండా, యథేచ్ఛగా, జుగుప్సాకరమైన శృంగారాన్ని గుప్పిస్తూ, తమ రచనలతో స్త్రీ పట్ల, సమాజం పట్ల ఎంత బాధ్యతారహితంగా రచయితలు ప్రవర్తిస్తున్నారో కొన్ని పత్రికలు తెరిచిచూస్తే తెలుస్తుంది.

కథలకి, సీరియల్ నవలలకి వేసే బొమ్మల్లో స్త్రీ నెంత అసభ్యంగా చూపుతున్నారో!

6. హాస్యం :- సంస్కారవంతం, సభ్యతాయుతం, మనస్సు కాహ్లాదం కలిగించే హాస్యం కరువైంది. స్త్రీని, సంస్కృతిని కించపరిచే హాస్య నవలలు, కార్టూన్లు వచ్చాయి.

వ్యాపారంకోసం, ధనార్జనకోసం స్త్రీని ఇంత అసభ్యంగా, అశ్లీలంగా చిత్రిస్తూ రాస్తున్న రచయితల్ని, ప్రచురించే పత్రికల్ని ఆపకపోతే మానవజాతి భవిష్యత్తుకు వెలుగూ, వికాసం ఉండవు.

ఇకపోతే మాసపత్రికలు—

సర్క్యులేషన్ తక్కువైనా, వారపత్రికల మీద ఇవి చాలా మెరుగు.

విపుల, చతుర, వనిత, వనితాజ్యోతి, రచన, స్వాతి, ఆంధ్రభూమి - మాసపత్రికల్లో ముఖ్యమైనవి.

వీటిల్లో సాహితీ విలువలున్న పత్రికలు రచన, స్వాతి, వనిత, వనితా జ్యోతి - స్త్రీల మాసపత్రికలు. స్త్రీ స్వేచ్ఛ ఆచారాలపై తిరుగుబాటు ధోరణిలో కథలు, నవలలు వచ్చాయి.

యువతరం రచయితలను ప్రోత్సహించే దిశలో ఆంధ్రభూమి ముంద డుగు వేసింది.

'రచన'లో, 'స్వాతి'లో - ఆనాటి రచయితల కథలు మళ్ళీ వచ్చాయి. అవి అన్నీ ఆణిముత్యాలే కాని,ఈతరం పాఠకులకి అవి ఎంతవరకూ అర్థమౌతా యన్నది సందేహమే.

ఈ విధంగా 92 లో వార - మాసపత్రికలు రచనల విషయంలో ఒక నిర్దిష్ట దృక్పథం అంటూ ఏమీలేక, కేవలం పాఠకుల నాకర్షించుకొని, అమ్మకాలు పెంచుకోవడమే లక్ష్యంగా పనిచేశాయి. అక్కడక్కడ ఒకటీ అరా మంచి రచనలు పత్రికల్లో కన్పించినా- సమాజానికి కీడు కల్గించే రచనలే ఎక్కువగా వచ్చాయి. సాహితీ విలువలు, పాఠకుల శ్రేయస్సుదృష్ట్యా చూస్తే సాధించింది ఏమీ లేనట్లే. ఇదివరలో ఉన్న నిజాయితీ, బాధ్యతల్ని విస్మరించిన పత్రికలే ఎక్కువ.

# 1993 సమాలోచనం - సమీక్ష

— డా॥ బి. జయరాములు

ప్రతి సంవత్సరం లాగే 1993లో కూడా "సమాలోచనం' కార్యక్రమాలను పన్నెండింటిని నిర్వహించింది. ఈ కార్యక్రమాలకు సమాజం నుండి మంచి స్పందన లభించింది. ప్రముఖులంతా యువ భారతి ప్రత్యేకతలను ప్రశంసించారు. ఈ సంవత్సరం 'సమాలోచనం'లో భాగంగా 3.1.1993 ఆదివారంనాడు 1992 వ సంవత్సరంలో వచ్చిన సాహిత్యంపై సమీక్షా కార్యక్రమం జరిగింది. ఆనాటి కార్యక్రమానికి ''1992 సాహిత్య సమీక్ష'' అనే శీర్షిక నిర్ణయించబడింది.

1992 లో వెలువడిన తెలుగు సాహిత్యం మీద సమీక్ష చేసుకొని కడచిన ఏడాదిలో జరిగిన అభ్యుదయాన్ని అంచనా వేసుకోవడానికి ఏర్పాటైన ఈ కార్యక్రమానికి మా యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారే అధ్యక్షత వహించారు. వారు మొదట వివిధ ప్రక్రియలను స్థూలంగా సమీక్షించి 1992లో వచ్చిన మార్పులు అభ్యుదయకరంగా ఉన్నాయంటూ కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఈ కార్యక్రమానికి ఉస్మానియా విశ్వ విద్యాలయం రిటైర్డు ప్రొఫెసర్ ఆచార్య నాయని కృష్ణకుమారిగారు ముఖ్యఅతిథిగా విచ్చేసినారు. వారు 1992లో వచ్చిన కవిత, నవల, కథానిక, విమర్శ అనే ప్రక్రియలను స్థూలంగా సమీక్షిస్తూ ఆయా ప్రక్రియలలో ఇంకా కృషి జరగాల్సి ఉందని సుదీర్ఘమైన విశ్లేషణాత్మకమైన ఉపన్యాసం చేశారు.

ఆనాటి కార్యక్రమంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యులు ఆచార్య ఎన్. గోపిగారు 1992లో వచ్చిన కవితల గురించి సమీక్షించారు. కొన్ని మధురమైన కవితలను ఉదాహరిస్తూ వాటిని వస్తుపరంగా ఎన్నివిధాలుగా విశ్లే

షించడానికి వీలుందో వివరించారు. అన్ని దిన, వార, పక్ష, మాస పత్రికలో వచ్చిన కవితలు,పుస్తక రూపంలో వచ్చిన ప్రధాన కవితా సంకలనాలను కూడా ఉదాహరిస్తూ, కవిత చక్కని అభ్యుదయ పథంలో నడుస్తుందని వివరించారు. ఆచార్యగోపిగారు స్వయంగా కవిగావడం వారి సమీక్షకు మరింత వన్నె తెచ్చింది.

1992లో వచ్చిన నవలల గురించి, కథానికల గురించి తెలుగు విశ్వ విద్యాలయంలో అధ్యాపకులుగా ఉన్నా డా. సి. మృణాళిని గారు వివేచనాత్మకంగా వివరించారు. నవలలను వ్యాపారాత్మకమైనవి, కళాత్మకమైనవి అని రెండు విభాగాలుచేసి, కళాత్మకమైన నవలల్లో ఉన్న విలువల గురించి వివరించారు. స్వయంగా నవలలు, కథలు వ్రాసే డా॥ మృణాళినిగారు 1992 లో వచ్చిన కథల గురించి కూడా సునిశితంగా విమర్శించారు.

ఆంధ్రప్రభలో పనిచేసే శ్రీ కల్లూరి భాస్కర్ గారు 1992 లో వచ్చిన సాహిత్య విమర్శ గురించి చాలా లోతుగా సమీక్షించారు. వివిధ ప్రక్రియల మీద పత్రికల్లో వెలువడే వ్యాసాలు, సాహిత్యాంశాలపై జరిగే వాదోపవాదాలు-వాటిలో విలువైన అంశాలు ఏవో, కానివి ఏవో సోదాహరణంగా వివరించారు. వారు స్వయంగా పత్రికా రంగంలో ఉన్నవారు కాబట్టి వృత్తినిబట్టి అనేక విమర్శలను చూడాల్సొస్తుంది కాబట్టి, వారి ప్రవృత్తి గూడా దాని కనుగుణంగానే ఉంది కాబట్టి వారి విమర్శ చక్కగా గంగాఝరిలా సాగింది.

ఈ కార్యక్రమానికి చివర అధ్యక్షులవారు ముగింపులుకులు పలుకుతూ వక్తలందరినీ ప్రశంసించారు. శ్రోతలు ఈ కార్యక్రమంచే మిక్కిలి ప్రభావితులయ్యారు.

రెండవ సమాలోచన కార్యక్రమం 7.2.1993 ఆదివారంనాడు జరిగింది. ఈ కార్యక్రమంలో కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షులుగా పని చేస్తున్న ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య గారి వ్యాస సంపుటి 'భావుకసీమ' ఆవిష్కరణోత్సవం జరిగింది. ఈ గ్రంథాన్ని యువభారతి ప్రచురించింది. ఈ కార్యక్రమానికి కూడా మా యువభారతి అధ్యక్షులైన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారే అధ్యక్ష్యం వహించారు. వారు ఆచార్య సుప్రసన్నాచార్య గారి విశిష్టమైన

వ్యక్తిగత జీవితం, సాహిత్య జీవితం గురించి ఆప్యాయంగా వివరించి కార్యక్రమం ప్రారంభించారు.

ఈ ఆవిష్కరణసభకు జ్ఞానపీఠికాధిష్ఠితులు, పద్మభూషణ భూషితులు, సుమధురవక్త, మహాకవి,ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారులైన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేసి 'భావుక సీమ' గ్రంథాన్ని ఆవిష్కరించి ప్రసంగించారు. సుప్రసన్న గారి భావుకత గురించి, వారి గ్రంథాన్ని గురించి చక్కని ప్రసంగం చేశారు.

ఈ గ్రంథాన్ని గురించి మూడు విశ్వవిద్యాలయాల నుండి విచ్చేసిన ముగ్గురు దిగ్దంతులైన పండితులు ప్రసంగించారు. వారిలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యులు ఆచార్య ఎన్. వి. రామారావుగారు, కాకతీయ విశ్వవిద్యాలయం ఆచార్యులు కోవెల సంపత్కుమారాచార్య గారు, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం రీడర్ డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు గ్రంథాన్ని గురించి కూలంకషంగా సమీక్షించారు.

మూడవ సమాలోచన సమావేశం **7.3.1993** ఆదివారంనాడు జరిగింది. వచ్చిన ప్రేక్షకులలలో నుండే కవులు వేదికపైకి వచ్చి తమ కవితలను వినిపించడం ఈనాటి కార్యక్రమంలోని విశేషం. ఔత్సాహికులైన యువకులకు ఇది సదవకాశం. ఈ కార్యక్రమంలో సుమారు ఇరవై ఐదు మంది యువ కవులు తమ మనోహరమైన మధురమైన కవితలను వినిపించారు. ఈ కార్యక్రమానికి మధురకవి, మహాకవి, మా యువభారతి ఉపాధ్యక్షులు డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు అధ్యక్ష్యత వహించి, ముందు కవిత్వం గురించి చక్కని చిక్కని ప్రసంగం చేసి, ప్రతికవీ తన కవిత చదివిన తర్వాత మనోజ్ఞమైన వ్యాఖ్యానం చేస్తూ, వారు చదివిన వాటిలోని సొబగులను, లొసగులను ఎత్తి చూపుతూ యువకవులను బాగా ప్రోత్సహించారు. ఈ కార్యక్రమంలో కవిత వినిపించిన ప్రతి కవికి యువభారతి ప్రచురణ అయిన 'చిలకమర్తి కవితా వైభవం' బహూకరించడం విశేషం.

సమాలోచనం నాలుగవ కార్యక్రమం **4.4.1993** ఆదివారం జరిగింది. ఈ సభకు తెలుగు విశ్వవిద్యాలయం జర్నలిజం శాఖాధిపతి శ్రీ జి.

యస్. వరదాచారిగారు అధ్యక్షత వహించారు. 1992 వ సంవత్సరంలో వచ్చిన వివిధ దిన, వార, పక్షపత్రికల గురించి వివరించి, అవి నిర్వహించిన పాత్ర గురించి స్థూలంగా వివరించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న వక్తలు ప్రముఖ పత్రికా రచయిత శ్రీ గుడిపూడి శ్రీహరిగారు, ప్రముఖ న్యాయవాది శ్రీ ఎం. శ్రీధర్‌గారు, ప్రముఖ నవలా రచయిత్రి శ్రీమతి ఆదివి సూర్యకుమారిగారు వివిధ పత్రికలలోని అంశాలను సోదాహరణంగా వివరిస్తూ,అవి ఆ సంవత్సరంలో నిర్వహించిన పాత్రను క్షుణ్ణంగా వివరించారు. ఈనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా రావలసిన శ్రీ సి. కనకాంబర రాజుగారు ('ఆంధ్రభూమి'-దిన, సచిత్ర వారపత్రికల సంపాదకులు) కొన్ని అనివార్య కారణాల వల్ల సభకు రాలేక పోయారు. మొత్తం మీద "1992 లో పత్రికలు నిర్వహించిన పాత్ర" అనే అంశం మీద ఏర్పాటు చేయబడ్డ సమాలోచన సదస్సు విజయవంతంగా సాగింది. సభకు విచ్చేసిన సదస్యులు ప్రభావితులయ్యారు.

అయిదవ సమాలోచనం కార్యక్రమం 2-5-1993 ఆదివారం నాడు జరిగింది. ఈనాటి కార్యక్రమంలో 'అవధానకళాభారతి' శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారి "అష్టావధానం" జరపడం విశేషం. తెలుగువారు తమదని చెప్పుకొని గర్వించే విశిష్ట కవితా ప్రక్రియ అయిన ఈ అవధానం అవధాన వాచస్పతి, శతావధాని చూడామణి, శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారు రసవత్తరంగా నిర్వహించారు. మంచి ఎండాకాలంలో, మండు టెండల తాపాన్ని మరపింపజేస్తూ క్రిక్కిరిసిన జనం కరతాళధ్వనుల మధ్య ఈ కార్యక్రమం అతి మనోహరంగా సాగింది.

ఈ అవధాన కార్యక్రమానికి జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారులయిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేసి ప్రసంగించారు. ధారాధారణల సంగమం అవధానం అని,ఆ ప్రక్రియ గురించి వివరించారు. ఈ సభకు నాటి కులీకుతుబ్‌షా పట్టణాభివృద్ధి సంస్థ అడ్మినిస్ట్రేటర్; నేటి కడప జిల్లా కలెక్టర్ అయిన శ్రీ కె.వి. రమణ IAS గారు అధ్యక్షులుగా వ్యవహరించారు.

ఈ కార్యక్రమంలో పృచ్ఛకులుగా ఎనిమండుగురు సుప్రసిద్ధ సాహితీ వేత్తలు, కవులు, సంస్థల నిర్వాహకులు అయినవారు పాల్గొన్నారు. నిషిద్ధాక్షరిని కవికౌస్తుభ శ్రీ ఆచార్య తిరుమలగారు, దత్తపదిని డాక్టర్ తిరుమల శ్రీనివాసా చార్యులుగారు, సమస్యను డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు, ఆశువును శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు, అనువాదం ఆచార్య రవ్వా శ్రీహరి గారు, వర్ణన ఎం. కె. రాముగారు, అప్రస్తుత ప్రశంస ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారు, గంటలు శ్రీ వై.కె. నాగేశ్వరరావు గారు నిర్వహించారు. ఈ కార్యక్రమ సమగ్ర సమీక్షను మా జూన్ 1993 'నందిని'లో ప్రచురించాం.

ఆరవ సమాలోచనం కార్యక్రమం 6-6-1993 ఆదివారం జరిగింది. అత్యుత్సాహవంతులైన యువకవులు పదేపదే అభ్యర్థించడం వల్ల ఈనాటి కార్యక్రమాన్ని కూడా "కవిసమ్మేళనం"గా రూపొందించడం జరిగింది. ఈనాటి కార్యక్రమంలో కూడా విద్యార్థులు, యువకులు అనేకులు పాల్గొని, మధురమైన తమ కవితలను వినిపించారు. ఈ కార్యక్రమానికి హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో రీడర్‌గా ఉన్న డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు అధ్యక్షత వహించవలసి ఉండగా, కొన్ని అనివార్య కారణాల వల్ల వారు రాలేకపోయారు. ప్రముఖ సంస్కృత విద్వాంసులు శ్రీ మూలా రామ్మూర్తి గారు అధ్యక్షత వహించి, నాటి కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.

ఏడవ సమాలోచనం కార్యక్రమం 4-7-1993 ఆదివారం "ప్రసార రంగంలో స్త్రీలు" అనే అంశంమీద జరిగింది. నేటి పత్రికల్లో, ప్రసార సాధనాల్లో (టి.వి., రేడియోలలో) స్త్రీల సమస్యలు ప్రచురించి ప్రచారం చేస్తున్న తీరుపై జరిగిన ఇష్టాగోష్ఠి కార్యక్రమానికి ఆచార్య నాయని కృష్ణకుమారిగారు అధ్యక్షత వహించగా ముఖ్యఅతిథిగా ప్రముఖ దినపత్రిక "ఉదయం" సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు విచ్చేసారు. ఆచార్య నాయని కృష్ణకుమారి గారు పత్రికల్లో, టి.వి., రేడియోలలో స్త్రీని వాణిజ్యపరంగా చిత్రించడాన్ని వ్యతిరేకించారు. అసభ్యతను తొలగించి, స్త్రీకి స్వేచ్ఛ పరిపూర్ణంగా ఇవ్వాల్సిన అవసరం ఉందని నొక్కి వక్కాణించారు.

శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు 'ప్రసారరంగంలో స్త్రీలు' అనే అంశంపై ప్రసంగిస్తూ స్త్రీల స్వేచ్ఛ గురించి వివరిస్తూ, స్త్రీ స్వేచ్ఛకు అనేక

పరిమితులుంటాయని తను అనుభవంలోని సంఘటనలను ఉదాహరిస్తూ వివరించారు.

ఈ కార్యక్రమంలో శ్రీమతి తురగా జానకీరాణీ గారు రేడియో కార్యక్రమాల్లో స్త్రీల స్థానం గురించి, డా. సి. మృణాళిని గారు, శ్రీమతి అడివి సూర్యకుమారి గారు టి.వి. లో, పత్రికల్లో స్త్రీలను గురించి, వారి సాధక బాధకాలను గురించి, వారి స్థానం గురించి చక్కగా వివరించారు.

ఆగస్టు 1వ తేదీ 1993 ఆదివారం "ఆధునిక తెలుగు సాహిత్యంలో దళిత స్పృహ" అనే అంశంపై ఆలోచనాత్మకమైన గోష్ఠి జరిగింది. ఈ కార్యక్రమానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యులు ఆచార్య ఎన్. గోపిగారు అధ్యక్ష్యం వహించి కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.

ఈనాటి కార్యక్రమానికి హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం డీన్ ఆచార్యులు కె. కె. రంగనాథాచార్యులు గారు ముఖ్య అతిథిగా విచ్చేసి దళిత సాహిత్యంయొక్క చారిత్రక, సామాజిక నేపథ్యం గురించి సవివరంగా చెప్పారు.

ఈ కార్యక్రమంలో వక్తలు డాక్టర్ యస్. వి. సత్యనారాయణ గారు తెలుగు సాహిత్య చరిత్రలో దళిత సాహిత్యం ప్రారంభ దశ నుండి నేటివరకు పొందిన వికాసాన్ని వివరించారు. శ్రీ కె. శ్రీనివాస్ దళిత సాహిత్యాన్ని విశ్లేషిస్తూ మహారాష్ట్రలో దళిత సాహిత్యం ఉద్యమ రూపంలో వచ్చిన విధంగానే ఆంధ్ర ప్రదేశ్‌లో వచ్చే అవకాశం తక్కువ అని చెబుతూ, ఇచటి దళిత సాహిత్యం గురించి చర్చించారు. ఈ కార్యక్రమంలోని అందరి వ్యాసాలను కలిసి ఒక పుస్తకంగా యువభారతి తీసికొని వచ్చింది. వివరాలకు దాన్ని చూడవచ్చు.

5-9-1993 ఆదివారం సమాలోచనం కార్యక్రమంలో భాగంగా, అధ్యాపక దినోత్సవం సందర్భంగా నిరంతర సాహితీ చైతన్యమూర్తులు, ఉత్తమ అధ్యాపకులు, ప్రసిద్ధ కవిపండిత విమర్శకులైన ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యుల వారికి ఆగస్టులో షష్టిపూర్తి అయిన సందర్భంగా సముచితమైన సాహిత్యోత్సవం నిర్వహించి, సన్మానించాలని ఈ కార్యక్రమం రూపొందింది.

ఒక సాహిత్యాచార్యునికి సాహిత్య సమాలోచనంతోనూ, సాహిత్య గ్రంథాంకితం తోనూ సన్మానించే సాహిత్యోత్సవాన్ని యువభారతి, జాతీయ సాహిత్య పరిషత్తు సంయుక్తంగా నిర్వహించాయి.

ఈ కార్యక్రమాన్ని అశ్వనీ హోమియో హేర్ ఆయిల్ (మూసాపేట, హైదరాబాద్) వారు దయతో స్పాన్సర్ చేశారు.

ఈ కార్యక్రమం రెండు భాగాలుగా నిర్వహించబడింది. మొదట సాయంకాలం 3 గంటల నుండి 5 గంటల వరకు ''సంపత్కుమార సాహితీ సమాలోచనం" జరిగింది. ఈ కార్యక్రమానికి కాకతీయ విశ్వవిద్యాలయం ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు గారు అధ్యక్షత వహించి ఆత్మీయంగా సంపత్కుమార గురించి, వారి సాహిత్య కృషిని గురించి వివరించారు. ఈనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆచార్య పేర్వారం జగన్నాథం గారు తమకు సంపత్కుమారకుండే ఆత్మీయతను వివరిస్తూ, గత స్మృతులను నెమరువేసుకొన్నారు. ఈనాటి సభా ప్రారంభకులుగా శ్రీ భండారు సదాశివరావుగారు రావలసియుండగా కొన్ని అనివార్య కారణాల వల్ల వారు రాలేకపోయారు. ఈ కార్యక్రమంలో సంపత్కుమార సాహిత్య విమర్శ గురించి ఆచార్య యస్.వి. రామారావుగారు, సంపత్కుమార వ్యక్తిత్వం గురించి డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు, సంపత్కుమార ఛందశ్శాస్త్ర వివేచన గురించి డాక్టర్ పులికొండ సుబ్బాచారిగారు, సంపత్కుమార కవిత్వం గురించి శ్రీ జి. బాల శ్రీనివాసమూర్తిగారు పత్రాలను సమర్పించారు.

రెండవ భాగంలో సాయంత్రం 5 గంటలకు హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు అయిన డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు వ్రాసిన "కళాతత్త్వ శాస్త్రం : మౌలికాంశాల వివేచన" అనే గ్రంథాన్ని సంపత్కుమార గారికి అంకితమిచ్చారు. ఈ సభకు కళాప్రియులు, సాహిత్యాభిమాని, మనస్వి అయిన శ్రీ కె.వి. రమణ IAS గారు అధ్యక్షత వహించారు. సుప్రసిద్ధ కవి, డాక్టర్ జె. బాపురెడ్డి IAS గారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. గ్రంథ స్వీకర్త అయిన కోవెల సుప్రసన్నాచార్యుల వారిని అశ్వనీ హోమియో ఆయిల్ అధినేత శ్రీబచ్చు సుబ్బారావు, BE గారు పట్టు దుకూలములతో సన్మానించారు.

ఈ కార్యక్రమంలో శ్రీ వాకాటి పాండురంగారావుగారు, ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య రవ్వా శ్రీహరిగారు కృతిస్వీకర్త ఆచార్య సంపత్కుమార గారికి తమ శుభాకాంక్షలను

అందజేశారు. డా. ముదిగొండ వీరభద్రయ్యగారు వ్రాసిన "కళాతత్త్వశాస్త్రం - మౌలికాంశాల వివేచన" అనే గ్రంథాన్ని ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు, శ్రీ టి. హరిహర శర్మగారు సమీక్షించారు.

3-10-1993 ఆదివారం సాయంత్రం 'నవయుగ కవిచక్రవర్తి' మహాకవి గుఱ్ఱం జాషువా 98 వ జయంతి సందర్భంగా ఆ కవి సాహిత్యంపై ఇష్టాగోష్ఠి కార్యక్రమం నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమానికి యువభారతి ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె.బి. లక్ష్మిగారు అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారితోసహా అనేకమంది వక్తలు జాషువాగారి వ్యక్తిత్వం గురించి, కవిత్వం గురించి చక్కగా ప్రసంగించారు. కొందరు జాషువాగారి పద్యాలను రసరమ్యంగా వినిపించారు.

7-11-1993 ఆదివారం "నాయని సుబ్బారావు సాహితీ సమాలోచనం" ఏర్పాటు చేయబడింది. ఈ కార్యక్రమానికి సుప్రసిద్ధ విమర్శకులు, ప్రముఖ భాషాశాస్త్రవేత్త అయిన ఆచార్య చేకూరి రామారావుగారు అధ్యక్షత వహించి, తెలుగు సాహిత్యంలో శ్రీనాయని సుబ్బారావుగారికి గల స్థానాన్ని వివరించారు. ఈనాటి కార్యక్రమానికి సుబ్బారావుగారి కూతురైన ఆచార్య నాయని కృష్ణకుమారిగారు విచ్చేసి- సుబ్బారావుగారి జీవితానికి, సాహిత్యానికిగల సంబంధాన్ని వివరించారు. ఈ కార్యక్రమంలో శ్రీ పి. నాగరాజుగారు సుబ్బారావుగారు వ్రాసిన 'మాతృగీతాలు' గురించి, డాక్టర్ ఎన్. నిర్మలాదేవిగారు వారు ప్రతిపాదించిన 'కులపాలికా ప్రణయం' గురించి విశదంగా వివరించారు.

ఈ సంవత్సరంలోని చివరి 'సమాలోచనం' కార్యక్రమంగా కవిసమ్మేళనం 5-12-1993 ఆదివారం నాడు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కార్యక్రమానికి యువభారతి ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె.బి. లక్ష్మిగారు అధ్యక్షత వహించారు. అనేకమంది యువకవులు, కవయిత్రులు తమ మనోహరమైన కవితలను వినిపించి సదస్యులను ఆకట్టుకొన్నారు.

ఈ 1993 'సమాలోచనం' కార్యక్రమాలలో మూడు కవి సమ్మేళనాలు, ఒక అష్టావధానం, ఒక గ్రంథావిష్కరణ, ఒక అంకితోత్సవం, ముగ్గురు సాహితీ మూర్తులపై గోష్ఠులు, గడిచిన సంవత్సరపు సాహిత్య సమీక్ష, స్త్రీలకు సంబంధిం

చిన ఒక కార్యక్రమం, దళిత సాహిత్యం గురించిన ఒక కార్యక్రమం చోటుచేసుకోవడంవల్ల యువభారతి తన కార్యక్రమాలను ఎంత వైవిధ్యంతో, సమకాలీన సాహితీ స్రవంతిపై అవగాహనతో నిర్వహిస్తున్నదో గ్రహించవచ్చు. ఈ కార్యక్రమాల ద్వారా సాహితీ ప్రియులందరినీ, ముఖ్యంగా యువకులను ఆకర్షించి యువభారతి తన పేరును, తీరును సార్థకపరచుకొంది.

ఈ 'సమాలోచనం' కార్యక్రమాలే కాకుండా ఈ సంవత్సరంలో 18-6-93 శుక్రవారం త్యాగరాయ గానసభలో "దీపాలచూపులు" ఆవిష్కరణం- అంకితోత్సవం జరిగింది. వచన కవిత్వంలోనూ, గేయ కవిత్వంలోనూ ప్రత్యేకించి రుబాయీల అభినవ ప్రయోగంలోనూ సమకాలీన సత్కవులలో మొదటి వరుసలో నిలచేవారు డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు. శబ్ద శిల్పంలోను, అర్థ వైచిత్రిలోనూ, నాద మాధుర్యంలోనూ, శ్రీనివాసాచార్యుల వారి కవితలు అభినవ భారతికి బంగారు మంజీరాలు. యువభారతి ఉపాధ్యక్షులు, కవులు, వక్తలు అయిన డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యుల వారి రుబాయీల సంకలనమే "దీపాలచూపులు." ఈ కావ్య స్వీకర్త నటసమ్రాట్, పద్మభూషణ్,దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు గారు. ఈ కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనర్ డాక్టర్ జె. బాపురెడ్డి ఐ.ఎ.ఎస్. గారు అధ్యక్షత వహించగా, ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకర్ మాన్యశ్రీ డి. శ్రీపాదరావుగారు ముఖ్యఅతిథిగా వచ్చారు. "దీపాల చూపులు" కావ్యాన్ని ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారు, పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. ఈనాటి సభా ప్రారంభకులు ఆం.ప్ర. స్పోర్ట్స్ అథారిటీ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ కె.వి. రమణ ఐ.ఎ.ఎస్. గారు. కృతికర్తకు శుభాకాంక్షలు అందజేసినవారు సాంస్కృతిక సమ్రాట్ శ్రీ కళా సుబ్బారావు గారు మరియు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. "దీపాలచూపులు" కావ్యాన్ని సమగ్రంగా పరిచయం చేసినవారు డాక్టర్ ఎల్లూరి శివారెడ్డిగారు, డాక్టర్ ఆచార్య తిరుమలగారు.

# తెలుగు సాహిత్యం – 1993

—ఆచార్య నాయని కృష్ణకుమారి

ఈ సంవత్సరంలో వచ్చిన తెలుగు సాహిత్యాన్ని అవలోకనం చేస్తే నా మటుకు నాకు గతించిన సంవత్సరాలకంటే ఇందులో చెప్పుకోదగ్గ కొత్తదనం కానీ, మెచ్చుకోదగ్గ సాహిత్య పరిణామక్రమం కానీ, ఏమీ కనిపించలేదు. అదే కవిత్వ ధోరణి, కథలు, నవలల నడక చర్వితచర్వణంగా సాక్షాత్కరిస్తున్నాయి.

కవిత్వంలోనూ, కథల్లోనూ దేశకాల పరిస్థితులూ, వాటికి సంబంధించిన సంఘటనలూ చోటు చేసుకున్నాయి. అలా చేసుకోవడం సహజం. అది సాహిత్యానికి సంబంధించిన సార్వత్రిక లక్షణం. దాన్ని 1993 కు సంబంధించిన ఒక విశిష్టగుణంగా చెప్పుకోవలసిన అవసరంలేదు.

ఈ సంవత్సరమంతా దేశానికి అభ్యుదయకరమైన కాలంగా కనిపించదు. జనంలో మానవ సంబంధాలమధ్య ఉండవలసిన సున్నితమైన గుణం లోపించి, ఎక్కువగా స్వలాభచింతన చోటు చేసుకోవడం మనం గమనించవచ్చు. రాజకీయాలలో దుండగీడుతనం, సీట్లకోసం కొట్లాటలు, కుర్చీని నిలబెట్టుకోవడానికి కుతంత్రాలూ కొట్టవచ్చినట్లు మన అనుభవంలోకి వచ్చాయి. శాశ్వత ప్రాతిపదికపై బడుగుబ్రతుకుల్ని బాగుచేసే ప్రణాళికలు లేకపోగా, ఓట్లకోసం కన్నుతుడుపు తాత్కాలిక సహాయాలు, వాళ్ళను మసిపూసి మారేడుకాయచేసి, వంచించడం వంటి గారడీలు, ఎక్కువగా రాజకీయ చరిత్రలో చోటు సంపాదించుకుంటున్నాయి. భయం సామాన్య జనజీవితాలను కుదిపి వేయడం గమనించవచ్చు. ఉద్యోగంకోసం ఇల్లు విడిచిన సగటు మనిషి, పొరుగూరికి పోవడానికి రైలో, బస్సో ఎక్కిన అమాయకుడు, విహారయాత్రకై ఇల్లు వదిలిన బడిపిల్లలు- వీరంతా క్షేమంగా ఇల్లు చేరకపోవచ్చుననే శంకకు ఈ కాల చరిత్రలో అవకాశం కలగడం గమనార్హం. భాగ్యవంతులు మరీ భాగ్యవంతులు కాగల షేర్

మార్కెట్ కోలాహలం ప్రతిపల్లెలోనూ మారుమ్రోగే విధానం ఈ సంవత్సరంలో వేళ్లూనుకున్నది. దానివెంట అంబోతులూ, ఎలుగుబంట్లూ ప్రభుత్వాన్ని గుప్పిట్లో ఇరికించుకుని, దాంతో ఆడుకుంటూ, దాన్ని అవమానకర పరిస్థితుల్లో పడేసిన కాలం యిది. మరొకవైపు కాశ్మీర్ విషయంలో తాను సృష్టించుకున్న తెలివితక్కువ పరిస్థితులకు తానే అవస్థల్లో చిక్కుకుని పొరుగురాజ్యపు అవక తవక ప్రకటనల్ని అడ్డుకోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్న ప్రభుత్వం!

సామాజికంగా దళిత వర్గాల మేల్కొలుపు ఈ కాలంలో చిక్కబడ్డది. మనుష్య సమూహం నుండి దళిత సమూహం అని పేరు పెట్టుకున్న మనుషులు విడిబడడానికి గట్టి ప్రయత్నాలు ఆరంభమైనాయి. ఏకత్వం నుండి భిన్నత్వ మనేది ఆక్రోశిస్తూ ఊపిరి పోసుకోనారంభించింది. కేవలం ఆర్థిక, సాంస్కృతిక సమస్య అయిన ఈ దళితత్వ భావన, పూర్తిగా కుల సమస్యగా వికృత రూపావి ష్కారం చేయడం ఈ కాలంలో మొదలైంది. పరాకాష్ఠకు చెందిన విషయం ఏమిటంటే- బి.సి.లు ఎస్.సి.లు అన్న పేరుతో ప్రభుత్వోద్యోగులు, పాలక వర్గా నికి సంబంధించిన వారు, ఎన్.జి.వో.లు ఒక సంఘంగా ఏర్పడి, సమావేశాలు కావడం ఈ కాలంలో కనిపించే ఒక వింత.

దీన్ని విప్లవ ధోరణిలో ఒక భాగంగా గ్రహించి సమర్థించిన వాళ్ళున్నట్లే దీని వెనక ఉన్న తాత్త్విక భూమిక ఏమిటని ప్రశ్నించిన విప్లవకారులూ ఉన్నారు. ఇది జాతీయ భావనను దెబ్బకొట్టి వేర్పాటు ధోరణుల్ని పెంచి పోషిస్తున్నదన్న అభిప్రాయం చాలామందిచేత వ్యక్తం చేయబడుతూ ఉంది.

ఈ సంవత్సరంలో సాహిత్యానికి వెలిగా స్త్రీ వాద ధోరణి గల సభలూ, సమావేశాలూ కొన్ని జరుగక పోలేదు. 1975-85 మధ్య కాలం స్త్రీ వాద దశకంగా పేర్కొనబడి స్త్రీ వాదాన్ని ఒక ఉద్యమ రూపంలో వెలికితీసుకు రావాలన్న ప్రయత్నం జరిగిన విషయం అందరికీ విదితమే. స్త్రీ జనాభ్యుదయ సమాజాలు ఈ విషయాన్ని సభలు పెట్టి అప్పుడప్పుడూ జ్ఞాపకం చేసుకోవడం మన మెరిగినదే. ఈ సంవత్సరంలో సామాజికంగా ఈ వాదం ఉద్యమస్ఫూర్తిని పొందినట్లు కనిపించదు. కాని సాహిత్యపరంగా ఈ వాదం కొంత స్థిరమైన స్థానాన్నే సాహిత్యచరిత్రలో సంపాదించుకున్నదని చెప్పవచ్చు. ఈ వాదాన్ని సమర్థించే కవయిత్రుల సంఖ్య పెరిగింది.

ఈ వాదానికి కొమ్ముకాచి, 3, 4 ఏండ్ల నుండి పెంచి పోషించికొస్తున్న కవయిత్రులు జయప్రభ, ఓల్గా, కొండేపూడి నిర్మల, ఘంటసాల నిర్మల, విమల, గీత, పాటిబండ్ల రజని వంటి వారెందరో ఉన్నారు. ఎస్. జయ, పార్వతి, అంజన, సుధ, వరలక్ష్మి, రాజేశ్వరి. లలిత, పద్మ, ఊర్మిళ వంటి కొత్తవారు బలమైన కవిత్వంతో ఈ సంచలనంలో కనిపిస్తున్నారు.

స్త్రీ వాదానికి సంబంధించిన 1) సామాన్య స్త్రీ వాదం. 2) సామాజిక స్త్రీ వాదం 3) రాడికల్ స్త్రీ వాదాలలో ఈ రచయిత్రులు మొదటిదానిపైనే దృష్టి కేంద్రీకరించినట్లు కనబడుతుంది. పురుషాధిక్య సమాజంలో స్త్రీ సమస్యల పట్ల పురుష దృక్పథం మారాలని వీరు ఉద్యమిస్తున్నారు. స్త్రీ పురుష సమానత లకు అడ్డంగా పురుషాధిక్య ప్రపంచం చేత పటిష్ఠంగా తయారుచేయబడ్డ 'జండర్' నియమాలూ, అనుభవించే బాధలూ, వాటిని స్త్రీ పట్ల సానుభూతితో కాక, తప్పనిసరి బాధ్యతలన్నట్లుగా పురుషులు పట్టించుకోకపోవడాలూ వీళ్ళ కవితా వస్తువు లయినాయి. ఈ సంవత్సరంలో ప్రకటితమైన 'నీలి మేఘాలు' అనే స్త్రీ వాద కవితల సంకలనం, జయప్రభ 'యశోధరా వగపెందుకే' అన్న కవితా ఖండికల సంకలనం ఈ దృష్టితో పరామర్శింపదగినవి.

ఈ సంవత్సరం, ఈ అనుభవ కవిత్వం వెలువరించినవారిలో ఎన్నదగ్గ వారు డా. ఎన్. గోపి, ఎండ్లూరి సుధాకర్, విన్నకోట రవిశంకర్, ఆశారాజు, శిఖామణి, యాకూబ్, త్రిపుర, శ్రీనివాస్, అప్సర్ వంటివారెందరో ఉన్నారు. వీరి కవితల్లో బహుధోరణులు కనిపించడం గమనార్హం. సూటిగా చెప్పదల్చు కున్నది పఠిత గుండె కెక్కేట్లు చెప్పేవాళ్ళు కొందరయితే, కవితావిష్కారానికి చిక్కని సాంకేతికత, శిల్ప విన్యాసాలనే పేర కొంత అయోమయాన్నీ మరి కొంత గుప్తంగా ఉంచదలచుకున్న అనుభవాల సాంద్రతనూ కలబోసి, ఎంత అర్థం కాకుండా చెప్తే అంత శిల్పమనుకునే వాళ్లూ ఉన్నారు. ఎవరి యిష్టాన్నైనా కాదని శాసించడానికి ఎవరికీ పూర్తి అధికారముండదుకదా! కాకపోతే అర్థం కాని కవిత్వం కాలక్రమేణ తిరస్కరింపబడి, పఠితల పాలకాకుండా, పరిశో ధకుల పాలబడడం అనివార్యం. ఒకనాటి చిత్రకవిత్వం గురైన అనాదరణ దశ కవిత్వానికీ కలగకుండా ఈ ఆధునిక అయోమయ (వాచ్యార్థంలోనే!) కవులు జాగ్రత్తపడవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ అయోమయపు పరిధిలోనికి స్త్రీ కవులు ఎవరూ రాకపోవడం ముదావహం!

పురుషులు ఎక్కడో అరకొర కవితల్లోతప్ప స్త్రీవాదాన్ని బలపరుస్తున్నట్లు కనిపించదు. పైపెచ్చు ఈ కవయిత్రులు వెలువరిస్తున్న భావజాలం పట్ల, తోటి పురుష కవులకు సానుభూతి లేనట్లు ఉదాహరణలు దొరుకుతున్నాయి. అంతే కాక పురుషకవులు వారిని దూషణలతో కవిత్వంలోని కెక్కించడం, వారు పెట్టే చివాట్లకు గురికావడం కూడా ఈ సంవత్సరంలో మనం చూడగల సత్యం. కొందరికి వీరిపై సానుభూతి ఉంది. సాహిత్య విప్లవంలో స్త్రీవాద ప్రకటన కూడా ఒక భాగంగా ఇమిడేదేనని ఈ సానుభూతిపరులు వివరిస్తున్నారు.

ఈ సంవత్సరంలో జరిగిన మరొక విశేషం 'సారా నిషేదం'- ప్రభుత్వం ఈ నిషేధాన్ని ప్రకటించడం అమోదకరం. ఈ నిషేధానికి నేపథ్యమైన నెల్లూరు మహిళల చారిత్రాతక్మక పోరాటం, అన్ని పార్టీలవారూ దీన్ని కొమ్ము కాయడం, ఇట్లా నిషేధించడం వలన ప్రభుత్వపు బొక్కసానికి లోటు కలుగు తుందన్న కుంటిసాకులు ఎట్టకేలకు ప్రభుత్వం వదిలిపెట్టి సారా మాత్రం నిషేధ పానీయంగా అమలులోనికి తేవడం బహు కవితా ఖండికలకు వస్తువు లైనాయి. నిషేధం వలన ప్రాప్తమైన దొంగసారా పెరుగుదల, కల్తీ సారా విజృంభణ, జన నష్టం, సమాజ జీవన విచ్ఛిత్తి మొదలైన వస్తువులమీద కూడా ఎన్నో కవితలు ఆవిష్కరించబడ్డాయి.

ఆటంకవాదుల వలన, విదేశీయమైన కుట్రల వలన జనజీవన సామ రస్యాన్ని దెబ్బతీసే దుండగుల పన్నాగాలు ఈ సంవస్సరంలో చాలా జరిగాయి. A B C D అనే సంకేతనామాన్ని వహించిన అస్సాం, బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలోని బాంబు ప్రేలుళ్ళ సంఘటన నాధారంగా చేసుకుని కొంత కవిత్వం రూపుదిద్దుకున్నది.

పైన పేర్కొన్న రాజకీయ సామాజిక వస్తువుల కంటె వెలిగా, మనస్సు స్పందించి, ఆత్మీయానుభూతులను మేళవించి చెప్పిన కవిత్వం వచన కవిత గానూ, పద్యకవితగానూ ఎక్కువగా రూపుదిద్దుకున్నది.

పద్య కవితకు ఇతోధిక ప్రశస్తి తీసుకురావాలన్న దృష్టితో బెజవాడ వరంగల్లు రాజమండ్రి నగరాలలో పద్య కవితా సదస్సు లేర్పాటయినాయి. జ్ఞానానందకవి, కాటూరి హనుమంతరావు, ఊట్ల కొండయ్య వంటివారు పద్య

కవితాసృష్టికి తమ కవితాకళను మీదుకట్టుకున్నారు. ఊట్ల కొండయ్య గారు వెలికితెచ్చిన, గృహిణి ప్రతిబింబాలు, జ్ఞానానందకవి ఆహ్వానం ఈ కోవలోనివి.

ప్రకృతి వైపరీత్యాలు కలిగినప్పుడల్లా కవులు స్పందించడం జరిగింది. ఈ సంవత్సరం జనుల బ్రతుకులపై ప్రకృతికిసంధించిన మారణాయుధం మహారాష్ట్ర భూకంపం. ఇది వేనవేలు జనుల్ని నిద్రలోనుండి దీర్ఘ నిద్రలోనికి ప్రయాణం చేయించింది. ప్రాణాలుపోక మిగిలినవాళ్ళు నష్ట బంధుమిత్రులు, కొంపా గోడూ తుడిచిపెట్టుకుని పోయినవాళ్ళు, వాళ్ళనుగూర్చి సమాజ సేవకులు, ప్రభుత్వం, సంస్థలు కదిలి రావడమేకాక కవులు కూడా కలం పట్టి గళం విప్పి సానుభూతిని కురిపించారు. మతం కారణంగా జరిగిన ఘర్షణలు కూడా కవిత్వం, కథలు పుట్టడానికి కారణం కాగలిగాయి.

ప్రయోగ పరంగా, జపాన్ భాషాఛందానికి ఒదిగే హైకూలనేవి తెలుగులోనికి దిగుమతి అయినాయి. చాలామంది ఈ కొత్త ఛందాన్ని లొంగదీసుకునే ప్రయత్నాలు ఈ సంవత్సరంలో చేశారు.

ప్రభుత్వ ఆర్థిక విధానాలవలన,ద్రవ్యోల్బణంవల్ల కలిగే కీడు సామాన్యుల దైనందిన జీవిత గమనంపై ఎంతో విషమ ఫలితాల్ని చూపించింది. పెరుగుతున్న ధరల భారం కవిత్వంలో ప్రతిబింబించింది. కాగితమూ, ముద్రణాకూడా ప్రియమైపోవడం వల్ల రచయితలు తమంతట తాము పుస్తకాలు వేసుకునే అనందానికి దూరమైనట్లే చెప్పాలి. అందుకు తెలుగు విశ్వవిద్యాలయం, తిరుపతి దేవస్థానం, సాంస్కృతిక వ్యవహారాల శాఖవంటివి సహాయ హస్తాలు చాచినా, ఆ చేతులనుండి రాలిందంతా సముద్రానికి చిరుజల్లు. వ్రాసుకున్నవి ప్రచురించుకునే శక్తిలేని రచయితలపాలిట కల్ప వృక్షాలు పత్రికలు, వారపత్రికలలో సాహిత్యానికి సముచిత స్థానం లభించడమేకాక ఈనాడు ప్రతి దినపత్రికా సారస్వతానుబంధాలను వారం వారం పాఠక లోకానికి అర్పిస్తూ ఉంది. అందులో కవితా ఖండికలకూ, కథలకూ లభిస్తున్న స్థానం పేర్కొదగ్గదే.

అంతేకాక, జనవరి 1994 లో ఆంధ్రజ్యోతి కవిత్వ విశేష సంచికను ప్రచురించింది. దీనిలో ప్రచురితమైన కవితలు చాలా వరకు. 1993లో వ్రాయబడ్డవే. ఇండియా టుడే 1993 సాహిత్యాన్ని ఉద్దేశిస్తూ వార్షిక సాహిత్య

సంచికను వెలువరించింది. తర్జన భర్జన అనే పేరుతో సాహిత్యలక్షణ వివేచన చేసింది. ఆంధ్రజ్యోతి సోమవారం సాహిత్యవేదిక 1993 లోని తెలుగు కవితా వికాసాన్ని గూర్చి ముచ్చటించింది. రాజధానిలోనేకాక జిల్లాలనుండి సాహిత్య పత్రికలు ఈ సంవత్సరంలో వెలువడ్డాయి. దేవరకొండ నుండి సాహితీస్రవంతి అనే సాహిత్య ప్రత్యేక సంచిక; ఆదిలాబాద్ జిల్లా, ఇచ్చోడ నుండి ప్రత్యూష అనే సాహిత్య మాసపత్రిక, కరీంనగర్ నుండి సాహితీ గౌతమి అనే సాహిత్య విశేష సంచిక వెలువడింది. ఇట్లా ప్రతి జిల్లాకూ ఒక పత్రిక వెలువడడమూ, అవి సారస్వత ప్రక్రియల పట్ల మోజుచూపడమూ ఈ సంవత్సరంలో ఎక్కువ కావడం సాహిత్యానికి ఆరోగ్యకరమైన లక్షణమే. జిల్లాలలో మూల మూలల్లో ఉన్న ప్రతిభ వెలికిరావడానికి ఇదొక మార్గం.

ఈ సంవత్సరం కవితా సంకలనాలూ, కథాసంకలనాలూ విరివిగానే ప్రచురింపబడ్డాయి. సాహిత్య ఎకాడమీ కోసం డి. రామలింగం సంపాదకత్వం వహించిన "తెలుగు కథ" పేర్కొనదగ్గది. కవితా సంకలనాలలో ఏటుకూరి ప్రసాద్, కవుల చేతి వ్రాతల సమీకరణకోసం సంపాదకత్వం వహించి ప్రచురించిన పోయట్రీ వర్క్‌షాప్ విశిష్టమైనది. స్త్రీవాద ధోరణుల్ని ఒక్కచోట చేర్చి, ఈ వాదాన్ని పట్టి ముందుకు నడుపుతున్న స్త్రీల కవితా సంకలనం నీలిమేఘాలు ఎన్నదగ్గది. హైదరాబాదులో ప్రతి నెలా ఒక్కసారి సమావేశమై స్వీయకవిత్వ పఠనాన్ని ప్రోత్సహించే నెల నెలా వెన్నెల కార్యక్రమం ఈ సంవత్సరం తన మూడవ సంపుటాన్ని వెలుగులోకి తెచ్చింది. అమెరికా సాహిత్య జిజ్ఞాసువులు 'తానా' వారు సంకలనం చేసిన 'మచ్చు తునకలు' చూడదగ్గవే. "మరో కొత్త వంతెన" అనే పేర తెలుగు, ఉర్దూ భాషలకు అనుసంధానాన్ని కలిస్తూ 'హైదరాబాద్' మీద రెండు భాషల్లో వచ్చిన కవితల్నీ, వాటి అనువాదాల్నీ సంకలనం చేసిన కవిత్వం ఈ సంవత్సరంలో జరిగిన కొత్త ప్రయత్నం. ఇట్లా పట్టికలిస్తూపోతే మరికొన్ని చేరడానికి అవకాశం ఉంది.

ఈ సంవత్సరం కథకుడు, నవలాకర్త రావిశాస్త్రి, కవి అబ్బూరి వరద రాజేశ్వరరావు, కవి చిత్రకారుడు అలిసెట్టి ప్రభాకర్, ప్రఖ్యాత విమర్శకుడు డి. రామలింగం, పాత్రికేయ ప్రపంచంలో పేరుగన్న బావరాజు నరసింహారావు, సుప్రసిద్ధ సాహిత్యకుడు దేవులపల్లి రామానుజరావు దివంగతులయ్యారు. ఆయా

సందర్భాలననుసరించి స్మృతి కవిత్వం, వారి వారి రంగాలకు సంబంధించిన సమీక్ష, వ్యాసాలు, బాష్పాంజలులూ వెలువడ్డాయి. అబ్బూరి సర్వ కవితల సంకలనం వెలువడ్డది. రావిశాస్త్రి పాత కథలు పత్రికల్లో తిరిగి ముద్రింపబడ్డాయి. అబ్బూరి మరణంపై అజంతా, అలిసెట్టి మరణంపై వరవరరావు విరచించిన కవితలు మనస్సును కదిలించేవి.

ఈ సంవత్సరంలో సామాజిక నేపథ్యంతో వెలువడిన బలమైన కవితా ఖండికలు చాలానే ఉన్నాయి. మత కల్లోలాలు చెలరేగినప్పుడు యాకూబ్ ఏ తెరిపి మరుపులూ లేని పద్ధతిలో, ఎదుటివాడి గుండె తాకేంత బలంగా, సాదా సీదాగా తన ఆవేశాన్ని వెల్లడిస్తున్నాడు:

"నా ఊపిరిని ఏ మతం శ్వాసగానో
ఊహించే మీరు
నా ఏడ్పుని ఏ మతగ్రంథంలోంచో
పోల్చే మీరు
మీరు నావాళ్ళు కారు
నాకు మనుషుల మధ్య
కూసింత చోటు కావాలి
ప్రేమించే మనిషి కావాలి
నా ఆకలిని తీర్చే రెండు మెతుకులు కావాలి
పక్షులూ జంతువులూ ఏ మతానివో
నేనా మతంవాణ్ణి
నా నిర్ణయాలూ నా జీవితమూ
ఇప్పుడు నా ఆలోచనల్లోంచి
మొదలవుతాయిక—" (ఆంధ్రజ్యోతి, సోమవారం, డిసెంబర్ '93)

మానవ సంబంధాలను పటిష్ఠం చేసుకుని, మమకారపు బంధాల్ని మనుషుల మధ్య సృష్టించుకోవాలనే గోపీ కవిత కూడా గుండెల్లోంచి తన్నుకొచ్చి వెలికురికిన బలమైన కవిత—

"మనుషుల మధ్య ప్రవహించే
ఎడారుల గురించే బాధ
గొంగళిపురుగులు పాకుతుంటే
పువ్వులు గజగజలాడుతాయి
చిరునవ్వుల డొల్లల్లో
ప్రాణకాంతిని నింపండి
అన్ని సుఖాలనూ మించిన
మైత్రీతంత్రికల్ని తెగిపోకుండా ఆపండి
భయంతో రెపరెపలాడే దీపాల చుట్టూ
అరచేతుల ప్రాకారాల్ని నిర్మించండి.
కన్నీరు వొట్టి నీటిచుక్క కాదు
జీవనసాఫల్యాలను ప్రతిఫలిస్తే
అది అనర్ఘరత్నమౌతోంది.(క్రోటన్స్- ఆంధ్రప్రభ వారపత్రిక, 1993.)

దళితుల పక్షం వహించి, దళిత కవిత్వం మైనారిటీ కవిత్వం వ్రాస్తున్నారన్న పేరుపడ్డ సతీష్‌చందర్ బలమైన గొంతుకతో అడుగునబడ్డ మనుష్యుల బాధల్నీ ఉద్రేకాల్నీ చాటుతున్నాడు:

"లేనితనం మా చిరునామా
నిన్న రవిక లేనితనం
నేడు బొట్టు లేనితనం
.... .... .... ....
కలిగినతనానికి నమస్కారం
గుండెలకు రవిక లిచ్చినట్లు
నుదుటికి బొట్టు నివ్వకండి
పడినచోట వెతుక్కుంటున్నవాళ్ళం
నిదురించినచోటనే మూడోరోజు మేల్కొంటున్నవాళ్ళం
అరచేతిరంధ్రాల్లో ఆకలిదప్పులు చూచుకుంటున్నవాళ్ళం
నుదుటిమబ్బులమీద
మాకేమాత్రం మోజులేదు

ఫాలభాగం నీలాకాశం కావాలన్నదే మా స్వప్నం
ఒక్క సూర్యబింబంమీదేతప్ప మాకు
ఏ బొట్టుమీదా భ్రమల్లేవు."

ఇతనిదే 'ఒక జననం వాయిదా' అనే కవిత కూడా చాలా బలమైనది.

ఇట్లా కవిత్వంలో ప్రయోగాలు చూపిస్తూపోతే ఎంతైనా గ్రంథం పెరుగుతుంది. ఏ కాలపు సాహిత్య సమీక్ష చెయ్యాలన్నా ఎక్కువగా కనిపించేది నిస్సందేహంగా కవిత్వమే. తరువాతే వచన ప్రక్రియలు.

ఈ సంవత్సరం నవలల పరిస్థితి పెద్ద ఆశాజనకంగా లేదు. పుస్తక ప్రచురణకర్తలు నవలాప్రచురణ విషయంలో చూపించే ఆదరం యొక్క సాంద్రత ఈ కాలంలో తగ్గిందనే చెప్పవచ్చు. వెనక సంవత్సరాలలో నవలా వస్తువుకు అనుసంధింపబడిన 'మసాలా' అంతా ఈనాడూ అట్లాగే ఉంది. మంచి నవలలు అనేవి చాలావరకు ఆంధ్రప్రభ నిర్వహిస్తున్న నవలల పోటీలో బహుమతి పొందినవే అని ఇప్పుడు కూడా చెప్పవలసివస్తూంది. రచయిత స్వతంత్రంగా మంచి ప్రయోజనాత్మక నవల వ్రాసి అచ్చొత్తించుకునే స్తోమతను ఈనాటికీ గడించుకోలేకపోతున్నాడు. ఈ సంవత్సరం నవలల విషయంలో ఒక ప్రయోగం జరిగింది. ఆంధ్రజ్యోతి వారపత్రిక 'ప్రేమ' అనే పేర ముగ్గురు చేయితిరిగిన రచయితల్ని వేరువేరుగా మూడు నవలల్ని వ్రాయమని, వాటిని ధారావాహికంగా అచ్చువేయడం ఆరంభించింది. మూడూ రచయితల అంతస్సత్త్వాలను బట్టి శైలీవిన్యాసాన్నిబట్టి ఒకే వస్తువు మీద మూడు నవలలుగా రూపు దిద్దుకున్నాయి.తులనాత్మక పరిశీలనకి ప్రయోగం మంచి అవకాశాన్నిచ్చినట్లైంది.

పోలీసు వృత్తిలో ఉన్నత పదవిని అధిష్ఠించి, విశ్రాంతి నందిన తరువాత తన అనుభవాలను కథాకథన పద్ధతిలో ప్రకటించిన సూరత్తు వేణుగోపాలరావు గారి 'పోలీసు ప్రస్థానం' ఈ కాలంలో ఎన్నదగ్గది. తమ తమ వృత్తులు, వాటి అనుభవాలు ఇటువంటి రచనలకు వైవిధ్యాన్ని ఆపాదిస్తాయి.

డా॥ రావూరి భరద్వాజ, తన భార్య కాంతం స్మృతిని వివరిస్తూ ఎన్నో 'డైరీ జ్ఞాపకాలను' అర్థశ్రీమైన వచనంలో మలిచారు. 'ఒకింత వేకువకోసం' అనే

ఆయన పుస్తకం ఒక రచయిత వ్యక్తిగత వేదనను తాత్త్వికతగా మార్చిన కాల ప్రభావాన్ని విప్పి చెప్తుంది. అంతరంగ మథనాన్ని దినచర్యగా, బలంగా చెప్పిన ఈ రచన తెలుగు సాహిత్యానికి మరొక ప్రక్రియ.

నవలల్లో స్త్రీ వాద ధోరణిని జొనిపినవారిలో ఎన్నదగ్గ రచయిత్రి ఓల్గా. ఈవిడ నవలలు స్త్రీ స్వేచ్ఛనూ, స్త్రీ పరమైన పురుషాధిక్య సమాజపు అత్యాచారాలనూ చాటిచెప్తాయి. ఇటువంటి ప్రయోజనాత్మక నవలా రచనకు ఈ సంవత్సరం ఇచ్చిన స్థానం చాలా తక్కువ.

సాహిత్య అకాడమీ ఈ సంవత్సరం ఒక కథాసంకలనాన్ని వెలికి తెచ్చింది.దానికి సంపాదకత్వం వహించిన డి. రామలింగం పాత కథల్ని ఎంపిక చేశారు.ఈ సంవత్సరం వచ్చిన కథ లందులో లేవు కాని కథా చరిత్రను వ్రాయడానికి ఈ సంకలనం ఉపయోగపడుతుంది.ఔత్సాహికబృందం ఒకటి వివిధ పత్రికల్లో అచ్చైన ఉత్తమ కథల్ని ఏరి కథ 91, కథ 92, సంకలనాలను తెచ్చింది. ఇంకా కథ 93 వెలుగు చూచినట్లు లేదు. కథా వస్తువునూ, పరిణామాన్నీ పాఠకులకూ, విమర్శకులకూ అందుబాటులోనికి తెచ్చే యీ ప్రయత్నం హర్షింపదగ్గ ప్రయత్నం. సాంస్కృతిక శాఖ చేయవలసిన పనిని ఔత్సాహికులైనా చేయడానికి నడుం కట్టడం మెచ్చుకోదగ్గ విషయం. ముందు పేర్కొన్న రాజకీయ సామాజిక సాంస్కృతిక భావజాలమంతా ఈ సంవత్సరంలో వచ్చిన చాలా కథలకు ఆధార భూతమైంది. విస్తరణభీతిచేత ఉదాహరణలు ఇవ్వడం లేదు.

ఈ సంవత్సరం, మేఘ సందేశం రఘువంశంవంటి సంస్కృత కావ్యాలకూ, గాంధీతత్త్వం, శ్రీ శంకరాచార్యవంటి గ్రంథాలకూ తెలుగులో అనువాదాలు వచ్చాయి.కీ॥శే॥ కేతవరపు రామకోటిశాస్త్రి నాటకవ్యాసాల సంకలనం 'నాటక విశ్లేషణ', వచ్చింది. నాటకరంగానికి సంబంధించి రసరంజని అనే పేరుమీద ఆంధ్ర సారస్వత పరిషత్తులోని డా॥ దేవులపల్లి రామానుజరావు కళామందిరంలో నిత్య నాటకోత్సవం జరపడం- హైదరాబాదులో నాటక ప్రదర్శనకు కొత్త ద్వారాలు తెరిచినట్లయింది. వారానికి అయిదురోజులపాటు జరిగే ప్రదర్శనకు సరిపోయే నాటక, ఏకాంక రచనలు విరివిగా ఈ సంవత్సరం జరిగినట్లు

లేదు. చిన్న పిల్లలకు అవసరమైన రచనలు అంతగా రాలేదు. కాని అంతటి నరసింహంగారి కోటవీరన్న సాహసం, మంత్రాల రామన్న మొండితనం, ఉదయగిరి పోలన్న ధైర్యం వంటి పిల్లల రచనలు పునర్ముద్రణపొందడం జరిగి, పిల్లలకు కొత్త రచనల అవసరాన్ని జ్ఞాపకం చేస్తున్నయ్.

మొదటినుండీ రచనా వ్యాసంగంలో తలలుపండి, చేయి తిరిగి లబ్ధ ప్రతిష్ఠులైనవారి రచనలు ఈ సంవత్సరంలో కూడా వచ్చాయి. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి సౌదామనీ దీప్తులు శ్రీ శేషేంద్రశర్మ జనవంశం, శ్రీ నారాయణరెడ్డి కవితలు, గజళ్ళ ప్రయోగాలు, మాదిరాజు రంగారావు జైలు కార్నరు నుండి, అజంతా స్వప్న లిపి, మోహనప్రసాద్ పునరపి అటువంటివి.

ఇక స్త్రీ సాహిత్యానికివస్తే శారదా అశోకవర్ధన్, లక్ష్మీరమణ, వాసా ప్రభావతి, గోవిందరాజు సీతాదేవివంటి ముందుతరాల రచయిత్రుల రచనలు ఈ సంవత్సరంలో కనిపించదమేకాక, కొత్తతరానికి చెందిన చిల్లర భవానీదేవి, ఆదూరి సత్యవతీదేవి, చక్రవర్తుల లక్ష్మీనరసమ్మ వంటివారు అనేకులు తమ రచనలతో సాక్షాత్కరిస్తున్నారు. పేరు పేరునా చెప్పాలంటే గ్రంథవిస్తరణ భీతి!

సాహిత్య విమర్శ పేర చేరాతలు జీవియస్ కాలమ్‌వంటివి ఈ సంవత్సరం కూడా ఎడతెగకుండా వస్తూనే ఉన్నాయి. జి. లక్ష్మీనరసయ్య కవితా నిర్మాణ పద్ధతులు అనే పేర కావ్య శాస్త్రాన్ని పాశ్చాత్య పద్ధతిలో వివరించే ప్రయత్నం చేస్తున్నాడు. సంతోషమే. అయితే, అవే విషయాలను మన ఆలంకారికులు సంస్కృత పరిభాషతో ఎలా వ్యక్తం చేశారో తులనాత్మకంగా నిరూపించి ఉంటే ఆ వ్యాసాలు సాహిత్య విద్యార్థికి ఇంకా బాగా ఉపకరించి ఉండేవి. మరొక భాషలో ఒక విషయం ఇలా ఉందని తెలియజెప్పడంతోపాటు, ఆ విషయం మన భాషలో కూడా ఉన్నదనే సత్యాన్ని తెలియజేయడం అవసరం. ఎందుకంటే, పరిణత ప్రజ్ఞలేని విద్యార్థి ఆ రెండూ వేరనుకునే ప్రమాదం ఉంది. అంతకుమించి కొత్తదనే భ్రమలో పడే ప్రమాదమూ ఉంది.

ఈ విధంగా 1993 వ సంవత్సరం సాహిత్య విషయంలో కొంతవరకు నూతనత్వాన్నీ, కొంతవరకు గతానుగతిక లక్షణాన్నీ సంతరించుకుని విలసిల్లింది.

# 1993లో తెలుగు కవిత

—డా॥ కసిరెడ్డి

**దీర్ఘాయువు :**

జడయల్లి జడకుచ్చు లిడ రాయప్రోలు
తల్లావజ్ఝల కిరీటలక్ష్మి నింప
పింగళి కాటూరి ముంగురుల్ సవరింప
దేవులపల్లి శ్రీతిలక ముంప
విశ్వనాథ వినూత్నపీదుల కిన్నెరమీట
తుమ్మల రాష్ట్రగాన మ్మొనర్ప
వేదుల నాయని వింజామరలు వీయ
బసవరాజు కొడాలి పదములొత్త
అడవి నండూరి భరతనాట్యములు సేయ
జాషువా ఏటుకూరి హెచ్చరిక లిడగ
నవ్యసాహిత్య సింహాసనమున నీకు
ఆంధ్రకవితా కుమారి దీర్ఘాయురస్తు!

అనేక పర్యాయాలు అచ్చయిన కరుణశ్రీ సుప్రసిద్ధ గ్రంథం ఉదయశ్రీ లోనిదీ పద్యం. రాయప్రోలు, తల్లావజ్ఝల, పింగళి, కాటూరి, దేవులపల్లి, విశ్వనాథ, తుమ్మల, వేదుల, నాయని, బసవరాజు, కొడాలి, అడవి, నండూరి, జాషువా, ఏటుకూరి .... తదితరు ల్నీపద్యంలో ఆంధ్రకవితాకుమారి కై సేసే ఆలంకారికులుగా (మేకప్ చేసేవారినిగా) పేర్కొన్నారు. పద్యంరాసిన కరుణ శ్రీలేరు. ఈ మహాకవులూ లేరు.

కాని ఆంధ్ర కవితాకుమారి ఉన్నది. ఆ తల్లి కై సేత జరుగుతున్నది. ఆ మహాకవులతో సమానులైన వారు, వారికి అటునిటుగా నిలబడేవారు, వారి వెనుక నడిచేవారు, అడుగుల్లో అడుగులువేసేవారు, వారికన్నా ముందు పరుగెత్తే వారు- ఎందరో 1993 లో ఉన్నారు. తెలుగుకవితా కుమారిని కై సేస్తున్నారు.

జ్ఞానపీఠ పురస్కారగ్రహీత సి. నా. రె. దగ్గరినుండి యువకవి శ్రీనివాస్ వరకు వందలాదిమంది ఈ సం॥లో కవితలల్లారు; గ్రంథాలుగా వెలయించారు; పత్రికల్లో ప్రచురించారు. ఆధునిక కవితా ప్రస్థానంలో 1993 కొక ప్రత్యేకతను సంతరించి పెట్టారు.

## ఈయేటి నిర్వచనం :

"విశ్వశ్రేయఃకావ్యమ్" దగ్గరినుండి నేటివరకు తెలుగునాట కవిత్వానికి నిర్వచనాలు వస్తూనే ఉన్నాయి. గతంలో వచ్చిన నిర్వచనాలు అప్పుడప్పుడు ఎందరో స్పృశించారు. ఈ ఏడు వచ్చినవన్నీ చెప్పడం కూడా కష్టమే. అందులో ఒకటి మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తా:

"లోహపు తీవెల్లో/వెలుతురుపూలని/పూయించే విద్యుత్తు/కవిత్వం.

రాళ్ళని కరిగించేది / నీళ్ళని ఘనీభూతమొనర్చేది/గుండెల్ని ఏకత్రాటిని బిగించేది/కవిత్వం.

కవిని మాయనుండి దూరంగా/తీసుకువెళ్ళే మరోమాయ/కవిత్వం.

మాయకు చిక్కినట్లే చిక్కి/చిక్కకుండా ఉండేవాడు / మాయకళ్ళకు గంతలుకట్టి/మాయను చిక్కించుకునేవాడు/ఆడించేవాడు/కవి.

సముద్రానికి తన లోతు తనకు తెలియనట్లు / కవికి తన లోతు తనకు తెలియదు/నిజానికి సముద్రం లోతులు ఎందరికి తెలుసు? సముద్రాన్ని మరో సముద్రంలోకి దింపితే తప్ప/మనకు సముద్రాల లోతులు తెలియవు.

కవుల లోతులూ తెలియవు / అసలు గుండెలోతుల్లోకి / కవిత్వపు అఖాతాల్లోకి వెళ్ళినవాడు / ఎవడు తిరిగొచ్చాడని?"

(జాగృతి, వార, 1993 అక్టోబర్ 25-31)

శ్రీ గన్నుకృష్ణమూర్తి 'కవిత్వపు లోతుల్లోకి' అన్న కవిత ఇది. ఈ కవితలోని ప్రథమ భాగమంతా ఆధునిక నిర్వచనం కాగా ద్వితీయ భాగమంతా ప్రాచీన కవితా తత్త్వానికి సమన్వయంగా కనిపిస్తుంది. ముగింపు పాదాలు "రసో వైసః" అన్న మహా వాక్యాన్ని సంపూర్ణంగా సమర్థించాయి. అయితే శ్రీ గన్ను వారిలాగానే మరెందరో ఈ సంవత్సరం కవితకు నిర్వచనాలందించారు. ఎవరి పరిధి వారిదే అయినా వాటిలో కూడా సార్వకాలీన సత్యాలున్నవెన్నో ఉన్నాయి.

## నిన్నూ నన్నూ నిలిపే కవిత్వం :

కవిత్వ నిర్వచనంలాగానే సుదీర్ఘ కవితల్లో అలానిలిపి ఆలోచింపజేసే "కవిత్వకవిత" లెందరో చెప్పారు. కవిత్వ కవిత అనే మాట ఇక్కడ సాభిప్రాయప్రయోగమే.

కొన్ని కవితలు వర్ణనల్లా ఉంటాయి; వ్యాఖ్యానాల్లా ఉంటాయి; విమర్శల్లా ఉంటాయి. అందులో ఎక్కడో సూత్రప్రాయమైన ఒక అంశం ఉంటుంది. ఆ సూత్రప్రాయమైన అంశమే ఆ కవితకు ప్రాణం. అసంఖ్యాకంగా ఉన్న ఆ ప్రాణప్రదపాదాల్లో కొన్నిటినే ఇక్కడ ప్రస్తావించే అవకాశముంది.

"....హృదయంతో జీర్ణపత్రాలను స్పర్శించు / నువ్వు వసంతమై చిగురించి చలించిపోతావ్" (ఆంధ్రప్రభ, ఆదివారం, 31-1-1993)

శ్రీ కందాళై రాఘవాచార్య శిశిరస్థలి కవితలోని రెండు పాదాలివి. బాధామయ గాథలకు హృదయం స్పందిస్తుంది; ద్రవిస్తుంది; స్రవిస్తుంది. హృదయంతో సంబంధం లేకుండా జరిగిన స్పర్శలో "ఆర్ద్రిత-తడి" ఉండవు. ఇవి లేనప్పుడు బండలు తాకిన దృశ్యం తప్ప గుండెలు తాకిన (తడిసిన) అనుభూతి కలగదు. మరి ఆర్ద్రీభూత హృదయంతో జీర్ణపత్రాలను స్పృశించిన నువ్వేమవుతావ్! నువ్వు వసంతమై చిగురించి చలించిపోతావ్! నీ హృదయ స్పర్శతో నీవే వసంతం కావు! ఆ జీర్ణపత్రం కూడా వసంతమవుతుంది

ఇందులో జీర్ణపత్రం మోడువోయిన మనిషికి ప్రతీక. హృదయం కేవల హృదయం కాదు. ఇది జీర్ణపత్రాన్నయినా సువర్ణపుష్పంగా మార్చే పరశువేది.

ఈ సృష్టిలో ఎక్కడ లోటుందో ఆ లోటు లోటుగా ఉండరాదు. ఆ లోటు పూడ్చబడాలి. అది పూడ్చే హృదయం కావాలి. అందుకే స్పర్శ కావాలి. ఈ స్పర్శ అఖండచేతనాస్థితిని ప్రస్థాపించి పులకింపజేస్తుంది.

ఇలా ఈ రెండు పాదాలు ఇంత మహార్థాన్ని ఈ శిశిరస్థలి కవితలో నిక్షిప్తంచేసి నిలిచాయి. నిన్నూ నన్నూ నిలిబెట్టి ఆలోచింపజేశాయి.

"ఎన్ని ఉదయాలతో కడిగినా/చీకటి మైల వదలటంలేదు".

(ఆంధ్రజ్యోతి, వార, 7 1-1994)

ఆచార్య ఎన్. గోపి "కొత్త పాటల్తో పెదవుల్ని కాల్చుకోక తప్పదు" అన్న కవితలోని రెండు పాదాలివి. 94 సం॥ర ప్రారంభంలో అచ్చయినా 93 మహారాష్ట్ర భూకంప బాధితుల వ్యధల స్పందనతో పుట్టిన కవితే ఇది.

అసలు శీర్షిక 'చుఱ్ఱు'మని కాలుస్తున్నది; నిప్పు పుట్టిస్తున్నది: వెలుతురు దారి చూపిస్తున్నది. ఏ మాత్రం భేషజం లేని, దాపరికం లేని సందేశ మంది స్తున్నది.

అదే విధంగా కవిత కూడా బ్రహ్మాండమైన ఆవరణాన్ని నిర్మిస్తున్నది. కార్య కారణ సంబంధాల్ని గుదిగుచ్చుతున్నది. ద్వంద్వాల్ని ప్రస్తావిస్తూనే ఉదయం వైపుగా నికార్సయిన దారి చూపిస్తున్నది.

ఈ చీకటి శాశ్వతమే; ఉదయమూ శాశ్వతమే. అయితే చీకటి అజ్ఞా నానికి, అక్రమానికి, అవినీతికి, అన్యాయానికి ప్రతీక. శాశ్వతమే అయినా చీకటి మైలను కడిగేసి ఆ చోట జ్ఞానాన్ని, క్రమానుగత నడవడిని, నీతినీ, న్యాయాన్ని నింపుతాం. ఈ చీకటి మైలను ఉదయం అనే సబ్బుతో కడిగేస్తాం. కవితలో మైల వాచ్యమయింది. సబ్బు సూచ్యమయ్యింది. అయితే ఎన్ని సబ్బు లతో (ఉదయాలతో) కడిగినా ఈ మైల (చీకటి) వదలటం లేదు అంటున్నారు శ్రీ గోపి.

ఇది నిరాశ ఎంత మాత్రం కాదు; అలసట అసలేకాదు; ఆక్రోశం లేనే లేదు. మైలను వదలగొట్టమనే సందేశమే ఈ పాదాల వెనుక ఉన్న పరమార్థ ప్రబోధం.

దేహంలాంటి దీర్ఘ కవితలో ప్రాణంలాంటి పాదాలు ఇలా ఉండి కవితా ధాత్రికి భూధరాల్లా నిలుస్తాయి. వ్యాఖ్యాన సాపేక్షకాలైన మరికొన్ని పాదాల్ని చూద్దాం:

"........ఎన్నో ఏకాంతాలు ఉరికంబమెక్కిన రోడ్డుపైన/మనుషులంతా చినుకులై వర్షిస్తున్నారు"........ (ఆంధ్రప్రభ, దిన, ఆది, 3-10-93)

'సిటీ' అనే ఈ కవితను శ్రీ సౌభాగ్యం రాశారు. ఇక్కడ ఉరికంబం ఉరి కంబంకాదు;చినుకులు చినుకులుకావు.ఉరికంబం పోలీసు గన్ కావచ్చు;తీవ్రవాది తుపాకి కావచ్చు; దయ్యపు'లారీ' కావచ్చు; వీధిరౌడీ చేతి తల్వార్ కావచ్చు. ఇవన్నీ మారణాస్త్రాలే. మారణాస్త్ర ప్రయోగం చూచి స్పందించిన మనిషి

చినుకై వర్షిస్తాడంటే, ఒక్క మనిషి కాదు- మనుషులంతా చినుకులై వర్షిస్తారంటే, వర్షిస్నారంటే - కన్నీరు ప్రవహిస్తుందనే అర్థం.

మనిషి బ్రతకాలి; బ్రతుకు చితుకరాదు; చితికిన బ్రతుకును చూచిన మనిషే చినుకై వర్షిస్తాడు.

అయితే ఏ మనిషి? బండమనిషి కాదు- హృదయమున్న మనిషి! ఇలాగే మరో కవిత్వ కవిత చూడండి:

"…. చిలిపి ప్రశ్నలతో సిద్ధాంత స్వర్గాన్ని ఎదిరించకండి! ఎందుచేతని అడగరేం? అడిగేముందు అడ్రసు చెప్పండి."

(ఆంధ్రప్రభ, వార, 1993, అక్టోబరు, 6-12)

'అడగరేం' అనే ఈ కవిత రాసినవారు శ్రీ చందు సుబ్బారావు. ఈ పాదాలూ సుదీర్ఘ కవితలో మిలమిల మెరిసే ప్రాణానిలాలే.

ఒక సిద్ధాంతాన్ని నమ్ముకొని కొందరు నడుస్తున్నారు. నమ్ముకోవడమేనా- దానికేమన్న 'విజ్ఞత' ఉన్నదా అన్న అనుమానం కలుగుతుంది. నిజానికి ఇది నమ్మకమే అనిపిస్తుంది. ఎందుకంటే, ఈ సిద్ధాంతం స్వర్గమైపోయింది కాబట్టి. హేతువాదికీ గతిశీలజీవికీ సిద్ధాంతమెప్పుడూ స్వర్గం కాదు. ప్రశ్న వేసినంతలో కోపం రాదు. అది చిలిపి ప్రశ్న అయినా, జిజ్ఞాసాత్మక ప్రశ్న అయినా సమాధానం చెప్పడానికే సంసిద్ధం కావాలి.

కాని, ఆ 'సిద్ధాంతస్వర్గి' అడ్రసు చెప్పమంటున్నాడు. ఎందుకూ! ఇందులో ఉన్న ధ్వని ఏమిటి? నీ అడ్రసు లేకుండా చేస్తానని ధ్వని. చంపుతాననేకదా!

ప్రశ్నించిన కంఠాన్నే కత్తిరిస్తానంటున్న వ్యక్తి తన స్వర్గక్షుద్రదేవతకు వ్యక్తిని బలి ఇస్తానన్నట్టే కదా!

ఉపనిషత్తుల కాలంలోనే ఈ భావన ఉంటే విజ్ఞానం అక్కడే ఆగిపోయేది. ఏ దేశం తన సిద్ధాంత స్వర్గం చుట్టూరా ఇనుప కచ్చడాలు కట్టుకుంటుందో, ఉక్కు గోడలు నిర్మించుకుంటుందో- ఆ దేశం మురికి గొట్టుకొనిపోయి ఎప్పుడో కుప్పకూలిపోతుంది. అది మత సామ్రాజ్యవాదం గానీ, సోషల్ సామ్రాజ్యవాదంగానీ నోరెత్తేవారిని నొక్కివేస్తే ఎప్పుడో చట్టుబండలు కాక తప్పదు.

రచయిత ఈ సంగతి ఇక్కడ చెప్పకపోవచ్చు. అడ్రసు చెప్పండి అని అడిగిన 'సిద్ధాంత స్వర్గి' అడ్రసే దొరక్కపోవచ్చు...కవిభావన ఇదే కావచ్చు. ప్రజాస్వామ్య ప్రియుల మనస్సులలో ఇదె భావన మెదలుతుంది. అలాగే మన స్సులో ముద్రపడే ఈ క్రింది భావన చూడండి:

ఆమె (అతను) అటూ ఇటూ వెతికారు. పారవేసుకొన్న మనస్సు ఎక్కడా కనిపించలేదు. చివరికి ఇలా జరిగింది....

"ఇంతలో..../ఎదురుగా 'నువ్వు' వస్తున్నావు/ఆశ్చర్యంగా..../నా మనసు అదిగో/నీ కనుపాపల్లో నవ్వుతూ/తుళ్ళుతూ/అప్పుదర్శమైంది నాకు / నేన్నిన్ను ప్రేమిస్తున్నానని/నేన్నీకు అంకితమయ్యానని."

(ఆంధ్రభూమి, దిన. 31-9-1993)

చెళ్ళపిళ్ళ శ్యామల గారు రాసిన ఈ కవిత చివరలో వాచ్యమైపోయినా ఓ మంచి ముద్ర వేస్తుంది. "నీ కనుపాపల్లో నవ్వుతూ / తుళ్ళుతూ...." అనేచోట ఈ కవితను ఆపేసి ఉంటే ఎంత గొప్ప కవిత! అనుకొనేవాళ్ళం, పాఠకుణ్ణి అక్కడ నిలబడి తృప్తిగా కళ్ళు మూసుకోనీకుండా తొందరపడి ఆ తర్వాతి సంగతంతా వాచ్యం చేశారు. ఆధునిక రచయితల్లో (ఈ వ్యాస రచయితతో పాటు) నూటికి తొంబయిమంది ఈ పొరపాటు చేస్తారు. అందుకే పలచబడ్డ కవిత్వంలో చిక్కని పాలచుక్క లెక్కడో కనిపిస్తాయి.

నగరంలో వెన్నెల అనే తమ వచన కవితా గ్రంథంలో శ్రీ కనపర్తి రామచంద్రాచార్యులు ఎన్నో మంచి కవితలు రాశారు. ఆ గ్రంథం ఈ సంవత్స రమే అచ్చయ్యింది. అందులో గుర్తుంచుకోదగ్గవి అయిదారున్నా ఒకటి మాత్రం పూర్తిగా ఉదాహరిస్తా. "నల్లురికి నీడనిస్తూ...." అనే శీర్షిక క్రింద కవిత ఇది.

"ఎండకు ఎండి/ వానకు నాని/ చలికి - / ముడుచుకొని పడుకొంది గొడుగు/లేచిందంటే-/ నెమలి పురివిప్పుకొన్నట్లే!/[1]

కవి-/ మౌనంగా, తుపాకిలా/ గోడకు వేలాడేదాని గుండెల్లో/ ఎన్ని 'అగ్నిగుళ్ళు' దాగున్నాయో / సూర్యకిరణాలు సోకి సోకి దాని శరీరం కమిలి పోయింది./[2]

చినుకుల దెబ్బలు తాకితాకి / గుండెలు తూట్లు పడ్డాయి/ యుద్ధభూమిలో సైనికునిలా/ దాని ఒళ్ళన్నీ గాయాలే!/[3]

అయినా, నాలాగే -/ ఎంత 'అల్పసంతోషి' అది/ అప్పుడే నల్లకల్వలా వికసిస్తుంది! / అంతలోకే ముఖం ముడుస్తుంది / దాని అంతరంగం ఎంత చల్లనిదో-/ అంత విశాలమైంది!/[4]

కొత్తలో..../ 'మేమిద్దరం' ఆ ఛత్ర ఛాయలో నడుస్తుంటే/ ఎంత ఆనందంగా వుండేది!/ తాతయ్య దాన్ని క్రింద ఉంచితే చాలు, /కాళ్ళ మధ్యన పెట్టుకొని చిన్నప్పుడు-/ 'బుయ్యాట' ఆడుకొనేవాణ్ణి/ అందుకే విరిగినా చిరిగినా/ ప్రతి ఏడూ చికిత్స చేయిస్తాను!/ దాన్ని చూసినప్పుడల్లా- నాకనిపిస్తుంది/ నల్గురికీ నీడనిచ్చే ఈ గొడుగు/ తన బాధలకు నిరసనగా/ ఎగిరే 'నల్లజెండా' అని."[5] (నగరంలో వెన్నెల)

ఇవి అయిదు వచన పద్యాలని భావిద్దాం. అయిదవ వచన పద్యంలోని కవినీ తాతగారినీ వదిలేసి, మిగతా భావాన్ని చూద్దాం. గొడుగు కథలో శ్రమజీవి కథ వినిపిస్తుంది.

ఆ శ్రమజీవి కష్టాలకు క్రుంగాడు (గొడుగు ముడుచుకొంది). సుఖాలకు పొంగాడు (నెమలి పురివిప్పింది). అతని గుండె నిండా 'అగ్నిగుళ్లు'న్నాయి. అగ్ని చైతన్యానికి ప్రతీక; గుడి మానవతా వికాస కేంద్రం. చైతన్యం మానవతా వికాస కేంద్రం దాచిపెట్టరాదనే వ్యంగ్యార్థం. అందుకే సూర్యకిరణాలు సోకి ఇవి వాడిపోరాదని రచయిత వాచ్యం చేసేశారు.

గుండెలు తూట్లుపడ్డవి కూడా శ్రమజీవికే. తూట్లుపడ్డ శ్రమజీవి బింబం- యుద్ధభూమిలో గాయపడ్డ సైనికుడే ప్రతిబింబం.

శ్రమజీవి కర్మక్షేత్రంలో ఉన్నాడు; యుద్ధజీవి ధర్మక్షేత్రంలో ఉన్నాడు. వాచ్యంచేసినా కవి తుల్యయోగిత తులలేనిది.

ఆ తర్వాతి సంగతంతా మామూలే. ఆ శ్రమజీవి అల్పసంతోషి; ముఖం ముడుచుకొన్నప్పుడల్లా అతనికి ఛత్రఛాయ కావాలని ధ్వనింప జేశాడు కవి.

ఈ శ్రమజీవి నల్గురికీ అన్నం పెడతాడు; తన బాధల్ని నిరసిస్తూ ఎగిరే 'నల్లజెండా' అవుతాడు. హక్కులూ - బాధ్యతలూ రెండూ తెలిసిన వ్యక్తి; అందువల్లనే సామాజిక జీవనంలోని లోటును పూరించడానికి శ్రమిస్తాడు; పోరాడుతాడు; పరస్పరపూరకంగా వ్యవహరిస్తాడు.

గొడుగు వెనుక శ్రమజీవి కనిపించడమే ఈ కవితలోని ప్రత్యేకత. అది ప్రకృతికి సంబంధించింది కానీ, పరికరానికి సంబంధించింది కానీ ప్రతి మంచి కవిత వెనుక ఓ మనిషి ఉంటాడు - మానవత ఉంటుంది- అని ఈనాటి కవితలూ ఈ యేటి కవితలూ తెలుపుతున్నాయి.

ఆధునిక వచన కవితల్ని ఇలా పరిశీలిస్తూ అలా అలా ఎంతో దూరం వెళ్ళిపోవచ్చు. ఈ పరిశీలనలో శ్రీ శేషేంద్రను, శ్రీ ఇస్మాయిల్ను, శ్రీ అజంతాను, శ్రీ త్రిపురనేని శ్రీనివాసును, శ్రీమతి కొండేపూడి నిర్మలను, శ్రీ ఎండ్లూరి సుధాకర్ను, శ్రీ సంపత్కుమారను, శ్రీ శివారెడ్డిని, శ్రీమతి జయప్రభను, శ్రీ యాకూబును- ఇంకా వారినీ వీరినీ ఓ వందమందిని గ్రహించవచ్చు. కాని అదంతా ఒకే గాడిన నడిచే సమీక్షల 'కవిలెకట్టై' అవుతుంది. అందుకే ఈ మార్గాన్ని ప్రక్రియవైపు మళ్ళిస్తా!

## ప్రక్రియాదృష్టి పరిశీలన :

కవితా వస్తువు ఏదైనా రచయిత తన అభిరుచినిబట్టి రూపాన్ని ఎన్నుకొంటాడు. రూపమంటే ఇక్కడ బాహ్యరూపమే. ప్రాచీనకాలంలో ఈ రూపాలే పురాణ కావ్య ప్రబంధ యక్షగానాలుగా నిలిచాయి. ఇప్పటికీ ఈ ప్రక్రియల్ని అనుసరిస్తున్న వారున్నారు.

అయితే, ఆధునికాంధ్ర కవిత్వానికి ప్రధానంగా పద్యం, గేయం, వచనం- ఈ మూడింటిని ప్రక్రియలుగా గ్రహిస్తున్నారు. పద్య కవితల్లో వృత్తాలున్నాయి. దేశి పద్యాల్లో జాతులూ ఉపజాతులూ ఉన్నాయి. ఇక గేయ కవితల్లో నవవిధ రగడల్లోని ప్రధానగతులైన త్ర్యస్ర, చతురస్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణాది గతులన్నీ ఉన్నాయి. ఈ గతుల కందకుండా ఉన్న లయగతులు కూడా కనిపిస్తున్నాయి. ప్రత్యేకంగా జానపదబాణీల్లో కనిపించే కొన్ని గతులు స్వరగతుల క్రింద పరిశీలించే అవకాశమూ ఉంది. ఇక వచనకవిత లేదా వచనపద్యం గ్రంథాల్లో పత్రికల్లో అతివేలంగా వికసిస్తూ వస్తూనే ఉంది. వచన కవితల్లోనే కనిపించే అత్యల్ప పాదాల్ని లేదా ఒకానొక భావాన్ని మినీకవితల క్రింద పరిశీలించే అవకాశముంది. ఇవేగాక దించిన చిత్రాలమీది వ్యాఖ్యానాల్ని చిత్రకవితలుగా పరిగణించవచ్చు. తీసిన ఫోటోల మీది వ్యాఖ్యానాల్ని ఫోటో కవితలుగా అనుశీలించవచ్చు.

ఈ విధంగా 1. పద్యకవిత, 2. గేయకవిత, 3. వచనకవిత, 4. మినీ కవిత (వచన కవితలో అంతర్భాగం), 5. స్వరకవిత (జానపదుల గేయకవితల్లో అంతర్భాగం), 6. చిత్రకవిత, 7. ఫోటో కవిత మొత్తం ఏడు విధాలుగా ఆధునిక కవిత కనిపిస్తున్నది. ఈ ఏడు ప్రక్రియలూ ఈ సంవత్సరంలో సుసంపన్నమయినై.

## 1. పద్యకవిత :

పద్యంలో మహాకావ్యాలు ఖండకావ్యాలు ఈ సంవత్సరం వచ్చినై. పేరు పేరునా అన్నిటిని స్పృశించే అవకాశం లేదు. ఒకటి రెండింటిలోని ఒకటిరెండు పద్యాలు మాత్రమే ఇస్తాను.

"భళి భళి భాగ్యనీయుడవు భాగ్యమహో! విను నీవె మెచ్చుకొం
దువు రసికోద్ధ! శ్రీ జనమనోహర! ఎందరొ స్త్రీల స్పర్శమీ
వెరుగుదు వింతదాక, మరి ఈ దృశమౌ నతిలోక సౌఖ్య దా
యకమగు స్పర్శమీవెరుగ వంచు వచింతును నిశ్చయమ్ముగన్."

(భారతము, ఆది సభావిరాట పర్వములు, పు : 386)

మళ్ళీ అదే భారతం వచ్చింది. ఇది శ్రీ కాటూరి హనుమంతరావుది యతిగణాలు పాటిస్తూ, ప్రాసల్ని పరిత్యజించి వీరు సంగ్రహంగా భారతం రాశారు. అందులో తొలిగా ఈ మూడు పర్వాల భారత గ్రంథాన్ని అందించారు. ద్రౌపది వేషంలో ఉన్న భీముడు కీచకునితో సంభాషించే ఘట్టంలోనిదీ పద్యం.

ఈ పద్యంలో స్పర్శకు సంబంధించిన అంశమే కీలకమయింది. మిగతా విషయమంతా దానికి పరిపోషకమే.

పద్యాన్ని ఎంత సరళంగా ఎంత హాయిగా నడిపించ వచ్చునో యువకవి శ్రీ కొండపి మురళీకృష్ణ 'దీపావళి' ఖండికలోని ఈ పద్యం చూడవచ్చు:

''తన ధైర్యాతిశయమ్ము జూడుమని కాంతన్ బిల్చి హస్తాన ని
ల్పిన బాంబొక్కటి కాల్చబోవ, నది ప్రేలెన్‌వేగమై, బొబ్బ లె
క్కిన హస్తంబునుజూచు, భర్త మొగమున్ క్రీగంట వీక్షించి న
వ్విన నవ్యోఢ సుహాసమందు వెలయున్ వేవేల దీపావళుల్."

(ప్రతీక, ఖండకావ్యము)

దీపావళి ఎక్కడో లేదు- ఆ నవ్వోథ నవ్వులో ఉంది. ఆ నవ్వు వెనుక చూచిన క్రీగంటిలో ఉంది. బాంబు కాల్చడం, అది పేలడం, చేయి బొబ్బ లెక్కడం - ఇవన్నీ క్రీగంటి చూపునకు వేవేల దీపాల నవ్వులకు కారణాలయినై.

ఇలాంటి పద్యాలెన్నో ఈ సంవత్సరం గ్రంథాల్లో, పత్రికల్లో వచ్చినై. డా॥ ఎన్.ఆర్. వెంకటేశం కందాల మకరందాల శతకం వచ్చింది. ఆంధ్రప్రభ వార పత్రికలో ఆరుద్ర కేరాలక్ష్మీశతక పద్యాలెన్నో వచ్చినై. యువకవి శ్రీ కె. మధుసూదన్ వీరహనుమ శతకం పదిమంది ప్రశంసలందుకొంది. ఒక్క పద్యం-

''కులము భరతజాతి క్రూరరోగము కదా
కులము విడువ జాతి వెలుగు నెపుడు
గ్రహణ ముక్తమైన రవివోలె నభమున
విశ్వ వినుతనామ వీర హనుమ! (పుట : 7)

మకుటాన్ని పక్కన పెడితే మిగిలినవి మూడు పాదాలు. ఆ మూడింటి లోనే ఓ అలంకారముంది; ఓ భావ చిత్రముంది; ఓ సందేశముంది. గ్రహణం వదలిన సూర్యునిలాగా ఈ జాతి వెలుగుతుందనడం అలంకారం. భరతజాతి కులమనే క్రూరరోగంతో బొమ్మకట్టి నిలవడం భావచిత్రం. ఈ కులాన్ని వదలి పెట్టాలి అనడం సందేశం. ఆ శతకంలోని చాలా పద్యాల్లో ఈ మూడున్నాయి. చిత్రకారుడు, కవీ, గాయకుడు అయిన శ్రీ కె. మధుసూదన్ అందించిన మంచి శతకం ఇది.

విశ్వయోగి విశ్వంజీ జీవితాన్ని స్వీకరించి శ్రీ తాళ్ళూరి సత్యనారాయణ ఆధ్యాత్మిక జీవన చిత్రణం చేస్తూ, విశ్వమందిర జ్యోతి అనే కావ్యాన్ని ప్రచు రించారు. వేదాంతమెంత ఆచరణీయమై విశ్వశాంతికి దోహదం చేస్తుందో ఈ కావ్యం తెలియజేస్తుంది. బాంబుల సంస్కృతి బలిసిపోయి మానవ మారణ హోమాన్ని సృష్టిస్తున్న సమయంలో ఒక మహా పురుషుని జీవితాన్ని నేపథ్యంగా స్వీకరించి విశ్వశాంతిని ఆకాంక్షించి కావ్యాన్ని అందించడం వల్ల కవి శ్రీ సత్యనారాయణపై దేశకాల పరిస్థితుల ప్రభావం పడ్డట్లు స్పష్టమవుతూనే ఉంది. నిజమైన కవి దేశకాల పరిస్థితుల నెరిగి స్పందిస్తాడంటామే - అది ఇదే. అందులోని ఒకానొక పద్యం.

"చందనంపు చలువ, మందారముల తావి
మధువునందు చిందు మధురిమంబు
నీదు నుడులలోన నిలువెల్ల కన్పించు
నీదు నడలలోన నివ్వటిల్లు." (పుట : 46)

ఇలా ఎన్నో పద్యాలు ఈయేడు వచ్చినై. శ్రీ ఉత్పల సత్యనారాయణా చార్య, శ్రీ కపిలవాయి లింగమూర్తి, శ్రీ ఊట్ల కొండయ్య, శ్రీ ప్రసాదరాయ కులపతి, ఆచార్య తిరుమల, శ్రీ మరింగంటి, శ్రీ సదాశివ, డా॥ ఓగేటి, శ్రీ సంపత్కుమార, ఆచార్య రామబ్రహ్మం. శ్రీ జాపురెడ్డి తదితరులెందరో వందలమంది పద్యాలు రచించారు, పత్రికల్లో ప్రచురించారు; గ్రంథాలుగా వెల యించారు.

అవధానులు శ్రీ మేడసాని, శ్రీ సుబ్బన్న, శ్రీ నరాల, శ్రీ గుమ్మన్న గారు, శ్రీ అష్టకాల, శ్రీ ఆశావాది, శ్రీ కడియాల, శ్రీ మరడాన,శ్రీ వాచస్పతి, శ్రీ నటేశ్వర, శ్రీ మల్లికార్జున, శ్రీ మాడుగుల ప్రభృతులెందరో శతసహ స్రాధిక పద్య పుష్పాలు అవధానాల్లో ఇంటా బయటా గుప్పించారు. పద్యం చచ్చిపోయిందని కొంతమంది గొంతుచించుకొని మొత్తుకొంటున్నా పద్యం పరమశాంతంగా తన భావపరిమళాలచేత ఆంధ్రలోకంలోని అణువణువునూ స్పృశిస్తూనే ఉంది. (ఈ వ్యాస రచయితకు తుమ్మల సాహిత్య పరిషత్‌వారి తుమ్మల పద్యకవితా పురస్కారం ఈ సంవత్సరమే వచ్చింది!)

ఇక స్థూలంగా ఈయేటి గేయకవితను పరిశీలిద్దాం.

## 2. గేయకవిత :

1940 దశకంలోనే శ్రీ సత్యపురి రామాయణం గేయ మహాకావ్యంగా ప్రశస్తిగాంచింది. ఆచార్య సి. నా. రె నాగార్జున సాగరం, విశ్వనాథనాయకుడు గేయకావ్య ప్రస్థానంలో మలుపుగా నిలిచినై. అప్పటినుండి ఇప్పటిదాకా గేయం కాలంచేసిన ఎన్నో గాయాలను బొమ్మ గట్టుతూనే ఉంది.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య,శ్రీ రఘుమన్న, డా॥పొద్దుటూరి ఎల్లారెడ్డి, శ్రీ గద్దర్, శ్రీ వంగపండు, శ్రీ చేకూరి గోపాలరావు, ఆచార్య తిరుమల, డా॥ పద్మినీ చిత్తరంజన్, శ్రీమతి వనం సావిత్రి, శ్రీ హెబ్బార్ నాగేశ్వరరావు,

శ్రీ శివప్రసాద్, శ్రీ ఘనశ్యామల, శ్రీ విజయసారథి, శ్రీ దామోదరశాస్త్రి, శ్రీ మందాడి సత్యనారాయణరెడ్డి, శ్రీ రాజమౌళి, డా॥ కసిరెడ్డి. ఇలా వందల మంది గేయాలు రాస్తూనే ఉన్నారు! పత్రికల్లో ప్రచురిస్తున్నారు; గ్రంథాలు ప్రకటిస్తున్నారు.

"మధురవాణి" శ్రీ యస్. మార్కండేయులు వీరశివాజి జీవితచరిత్రను స్వీకరించి 'ధర్మదక్ష' అనే కావ్యాన్ని ప్రచురించారు. 'దీపాలచూపులు' ఖండ కావ్యంలో డా॥ తిరుమల శ్రీనివాసాచార్య హృదయానికి హత్తుకొనే అపూర్వ భావాల్ని సంధించారు.

"బిచ్చగాణ్ణి చూసినప్పుడే చచ్చాను
లోభిముఖం చూసినప్పుడే చచ్చాను
చదువు నీతి పాతరేసి జీవించేటి
నరమృగాన్ని చూసినప్పుడే చచ్చాను."

"సింహాదులు అడవుల్లో ఉన్నాయి
మకరాదులు అంబుధిలో ఉన్నాయి
భూచరాలు జలచరాలు అన్నీ
ఒక్కనరుని ఎదలో దాగున్నాయి."

(దీపాల చూపులు, పుటలు : 52 - 53)

రుబాయిల బాణీల్లో నడిచిన ఈ గేయకవితలు మనిషిని నిలవేస్తాయి; ఆలోచింప జేస్తాయి.

మళ్ళీ ముత్యాలసరాల జడివాన ఈ వర్షం కురిసింది. శ్రీమతి జయప్రభ ఆంధ్రప్రభలో రాశారు. ఆచార్య చేకూరి రామారావు, శ్రీ గోపాలకృష్ణ ప్రభృతులు మరోసారి ముత్యాలసరం మీద చర్చలు ప్రారంభించారు. శ్రీ చైతన్య ప్రసాద్ ముత్యాల సరాల్ని 'ఆవాహన' చేశారు. వారివే రెండు మూడు చూడండి:

"కులకవే ముత్యాలసరమా!
పలకవే కోకిల స్వరమా!
మగతనిద్దుర పొగలమబ్బుల
రగులు భాస్వరమా!....

హంతకులకు అధికారపీఠం
ఖంతలకు సుందరకిరీటం
వింతకాదు, నియంతలేలే
ధ్వాంతసామ్రాజ్యం!
వింటివా, ఈ లోకవృత్తము
కంటివా, కల్లోలనృత్తము
రక్తసిక్తము రణోన్మత్తము
శప్త మీదేశం ...." (ఉదయం, దిన, సోమవారం, 8-11-93)

ఈ విధంగా గేయకవిత లెన్నో ఈ సంవత్సరం గ్రంథ రూపంలోనో - పత్రికల్లోనో వచ్చినై. ఇక వచన కవితల గురించి—

## 3. వచన కవిత :

ఈ సంవత్సర కాలంలో వేలకొలది వచన కవితలు వచ్చినై. పందలాది గ్రంథాలూ వచ్చినై. లబ్ధప్రతిష్ఠులు, ఇప్పుడే కలం పట్టినవారూ ప్రధానంగా వచన కవితలే రాస్తున్నారు. ఆచార్య సి. నారాయణరెడ్డి యువతరంతో పరు గెత్తుతూ స్పందించి వచన కవితలు రాస్తున్నారు. మహారాష్ట్ర భూకంపానికి వ్యథాభరిత హృదయంతో వారు పలికిన తీరు చూడండి:

"....పత్రికల కంటుకున్న తడి వార్తలను/కొనవేళ్ళతో తడిమితే ఎలా?/ ఒక్కొక్క అక్షరాన్ని పిండితే నీ గుండె/ఒక్కొక్క నెత్తురు చుక్కై రాలదూ?....

....బంతులు వెతుక్కునే పసివాళ్ళ చేతులకు/తెగిపడ్డ తలకాయలు తగులు తున్నాయి/ఎవ్వరు తెరదించేది ఈ నరమేధ నాటకానికి/దిండు కింద దాక్కుం దేమో మృత్యువు/గుడ్డలో దాచి వుంచిన గుండ్రని పండులా...."

(ఆంధ్రజ్యోతి, వారపత్రిక 1993 దీపావళి ప్రత్యేక సంచిక)

ప్రకృతి - ఈ సర్వసృష్టి తెగించి మానవకోటిని నాశనమేమీ చేయడం లేదు. అయితే అప్పుడప్పుడు భూకంపాలు, తుఫాన్లు జీవకోటిని నాశనం చేస్తూనే ఉన్నాయి. కొన్నాళ్ళపాటు పచ్చగా బతకాల్సిన మనిషి గమ్యం చేరకముందే ఇలాంటి విపత్తులకు బలయిపోతున్నాడు. అప్పుడు కవి స్పందిస్తున్నాడు. ఆ స్పందన భూకంపం విషయంలోనే కాదు; ప్రజాస్వామ్యకంపం విషయం లోనూ ఉంది.

అయోధ్య ఘటనల అనంతరం కేంద్ర ప్రభుత్వం నాలుగు ప్రజాస్వామ్య ప్రభుత్వాల్ని నిరంకుశంగా కూలద్రోసింది. అప్పటి ప్రజాస్వామ్య భూకంపానికి స్పందించిన 'ధర్మపీఠ' పందిరి అనే కవితలో ఇలా అంటున్నారు:

''ఇది నాలుగు స్తంభాల పందిరి / నియంతృత్వ ఖడ్గంతో / ఢిల్లీగద్దె / ఈ స్తంభాల్ని నరికేసింది / పందిరిని కూల్చేసింది / పచ్చని ఈ పందిరిని / నిలబెట్టకుంటే / రేపు / ప్రజలు ప్రజలుగా ఉండరు.''

(జాగృతి, వార, 1993 జూన్ 21-27)

ఇందులో పందిరి ధర్మానికి ప్రజాస్వామ్యానికి ప్రతీక. స్తంభాలు నాలుగు పాదాలకు ప్రతీకలు. ఈ నాలుగు స్తంభాలు సరిగా ఉంచేనే ప్రజాస్వామ్యం నిలబడుతుంది. ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. ఇదంతా ఈ కవిత నేపథ్యం. పందిరని నిలబెట్టాలనేది సందేశం. నిలబెట్టకపోతే ప్రజలు ప్రజలుగా ఉండరు. అంటే ప్రజలే ప్రభువులవుతారని హెచ్చరిక; లేదా ధ్వని. కవిత పేలవంగానే నిర్మాణమైనా ఇందులోని పందిరి, కూల్చివేత, స్తంభాలు, ప్రజలు ప్రాణపద పదాలుగా నిలిచి ఈ విశిష్టార్థాన్ని భాసింపజేసినై.

## 9. మినీకవిత :

ఈ కాలంలో మినీకవిత చాలా బలంగానే వచ్చింది. వక్రోక్తి అలంకారాన్ని సమాశ్రయించి మినీకవిత గట్టిగా ప్రేలుతుందనే చెప్పాలి. పత్రికల్లో స్థలపూరణార్థం వచ్చిందే మినీకవిత అనే భావన ఇప్పు డెవ్వరిలో లేదు. అయితే ప్రేలక పేలవంగా ఉన్న మినీకవితలు ఆ భావనను కలిగింపజేస్తున్నాయని విజ్ఞులంటున్నారు.

నిజానికి వ్యాఖ్యానప్రాయమైన అంశ, వర్ణనాత్మకమైన అంశ ప్రతి సాహిత్య ప్రక్రియలోనూ ఉంటుంది. కథా కథనానికి ఏ రచయిత అయినా ఈ పద్ధతిని అనుసరించక తప్పదు. అయితే అందులో ఎక్కడో కొన్ని పాదాలు 'కవిత్వాత్మ'గా (ఆ కవిత ఆత్మగా) ప్రకాశిస్తాయి. అవికాకుండా వర్ణనాంశ అనే ఆవరణమేమీ లేకుండా రెండు, మూడు, నాల్గు పాదాలతో ఆవిర్భవిస్తున్నవే మినీ కవితలు.

ఒక దశాబ్ది కాలంగా వస్తున్న ఇవీ, ఈ సంవత్సరమూ బోలెడన్ని వచ్చినై. అందులో రెండు మూడు మాత్రమే ప్రస్తావిస్తాను:

"నిండుకుండకు చిల్లి పడితే/నీరంతా కారిపోతుంది/మనిషి గుండెకు చిల్లి పడితే/జీవితమే జారిపోతుంది." (ఆంధ్రప్రభ, వార, 1993 జూన్ 23-29)

ఇక్కడ కుండ - మనిషి రెండు బింబ - ప్రతిబింబాలు. కాని కుండలో నీళ్లున్నాయి; మనిషిలో గుండె ఉన్నది. నీళ్ల కారరాదు; జీవితం జారరాదు. అందుకే 'చిల్లి' పడరాదు. ఇది శ్రీ మేడికుర్తి వెంకటరమణ మినీకవిత. మనిషికి సంబంధించిన శ్రీ చిమ్మపూడి శ్రీరామమూర్తి మినీ కవిత చూడండి: కవిత పేరు 'మనిషి.'

"ప్రతి మనిషిలోను / ఇద్దరు దౌర్భాగ్యులు / ఒకడు 'మనీ'కి దాసోహం/ మరొకడు 'షి'కి దాసోహం / ఈ రెంటికీ అతీతుడు 'మనీషి'."

(ఆంధ్రజ్యోతి, వార, 1993 దీపావళి ప్రత్యేక సంచిక)

ధర్మార్థకామాల్లో అర్థకామాలే ఈ దౌర్భాగ్యులు. ధర్మం లేకపోతే ఉండేది దౌర్భాగ్యులేమరి! శ్రీ చిమ్మపూడివారిదే (ఆ సంచికలోనిదే) మరో జోల పాట కవిత చూడండి:

"ఆపరేషన్‌తో బయటపడ్డ / పిల్లాడు ఏడ్చాడు క్యాక్యా అంటూ / రేషన్ కార్డుతో జోకొడుతోంది తల్లి / క్యూక్యూ అంటూ"....

అబ్బ! ఎంత పెద్ద బొమ్మ నిలిపాడీ మినీ కవితా రచయిత. నేటి మినీ కవిత అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని నిక్షిప్తం చేసుకొందని ఇలాంటి కవితలను గూర్చే అనడం. మట్టి విత్తనంలో మహావృక్షం దాగిన మాదిరిగా ఈ అక్షరాల్లో మహాప్రపంచం దాగి ఉంది. పేలవంగా లేని ప్రతి మినీ కవిత ఒక కొటేషన్.

## 5. జానపద కవిత :

ఇక జానపద కవిత. గతులకు ఒదగని కవితల్ని స్వరకవితల క్రింద పరిశీలించాలనే ఉద్దేశ్యంతోనే ఈ ప్రక్రియ గేయకవితలో అంతర్భాగమైనదని అనడం జరిగింది. (విమర్శకుల చర్చకు ఆహ్వానం). అయితే ఊనికను బట్టి, స్వర దైర్ఘ్యాన్ని బట్టి దానిని ఏదో ఒక గతి క్రింద పరిశీలించవచ్చుననే అభిప్రాయం ఉంది. స్వరానికి ఉన్న ప్రాధాన్యాన్ని బట్టి ఈ జానపద బాణీల్లోని కవితల్ని 'స్వరకవిత' లనడం జరిగింది.

"పల్లవి : మానుకో ఈ రోత సారానూ/తాగుడు/
మానితే నీ రాతే మారేనూ/

చరణం : ఇప్పపువ్వు సారబెట్టి/తిప్పల పడుబోకన్నా/
ఇంటిలోని సారబట్టి/కొంప కెసరు పెట్టునన్న/
ఎద్దు ఎవుసం మాని/పొద్దంతా తాగుడాయె/
తల్లి తాగె, పిల్ల తాగె/మూల్గె ముసలోడు తాగే/
—మానుకో ఈ రోత సారానూ/

(జనచైతన్య గీతాలు, పు : 12)

శ్రీ మందాడి సత్యనారాయణరెడ్డి, శ్రీ నాగపురి రాజమౌళి రాసిన గీతాలీ గ్రంథంలో ఉన్నాయి. పల్లవి ఖండగతిలో, చరణం త్ర్యస్రగతిలో నడిచాయి. అయితే అక్కడక్కడ కనిపించే స్వర్గ దైర్ఘ్యాన్ని దృష్టిలో పెట్టుకోవాల్సి ఉంది. అందుకే వీటిని గేయాల్లోకాక జానపద కవితలుగా ప్రత్యేకంగా పరిశీలించడం జరిగింది. ఈ లాంటి గేయాలు వందలకొలది వచ్చినై. పదుల కొలది సంపుటలు, సంకలనాలు వచ్చినై.

## 6. చిత్రకవిత & ఫోటోకవిత

ఇదొక ప్రక్రియగా చెప్పడాన్ని అందరూ అంగీకరించకపోవచ్చు. అయితే, ఒకప్పుడు చెప్పకున్నా ఇప్పుడు చాలా పత్రికల్లో రోజూ వస్తున్న చిత్ర కవితల్ని (బొమ్మతోపాటు వ్యాఖ్యాన పద్యగద్య గేయాల్ని), ఫోటో కవితల్ని (ఫోటోతోపాటు వ్యాఖ్యాన పద్యగద్య గేయాల్ని) సంఖ్యాదృష్ట్యా పరిగణనలోకి తీసుకొని, ఇదికూడా పరిశీలనార్హమైందే అని ఒక ప్రక్రియగా భావించడం జరిగింది.

కవితలు రాసిం తర్వాత చిత్రమో ఫోటోనో వేయించి (తీయించి) గ్రంథాలకు గ్రంథాలే ప్రచురించినవారున్నారు. అలా గ్రంథాలుగా వచ్చినవీ, పత్రికల్లో అనునిత్యం వస్తున్నవి పరిశీలిస్తే, ఈ సంవత్సరం కొన్ని వందల చిత్ర-ఫోటో కవితలు వచ్చినట్లు తెలుస్తున్నది. అందుకే ఈ శీర్షిక.

"లౌకికవాద విశిష్టత / లోకానికి చెప్పవచ్చు / ప్రజాస్వామ్య సిద్ధాంతం/ పంచాంగం విప్పవచ్చు/ఓటుకొరకు విజృంభించి / వెన్నుపోటు పొడవవచ్చు / ఆమీదట తీరిగ్గా / అశ్రువులను విడువవచ్చు."

(ఉదయం, దిన, సోమ, 8-11-1993)

కుహనా లౌకికవాదం గురించి వ్యంగ్యంగా శ్రీ గజ్జెల మల్లారెడ్డి రాసిన ఈ కవిత ప్రక్కనే భావస్ఫోరకమైన చిత్రమున్నది. చిత్రాక్షరాల సమ్మేళనం వల్ల ఈ కవిత ఎలాంటి పఠితనైనా చదివించే విధంగా ఉంటుంది.

ఇక ఫోటో కవితలు కూడా ఆయా పత్రికల్లో వస్తూనే ఉన్నాయి. అయితే గ్రంథాలుగా వచ్చినవి తక్కువ అనే చెప్పాలి. "అయోధ్యలో 36 గంటలు" అనే ఓ కార్డు సైజు చిన్న పుస్తకం వచ్చింది. ఇందులో 24 ఫోటో లున్నాయి. పై కవర్ ఫోటోలుకాక లోన ఉన్న 24 ఫోటోలకు 28 కవిత లున్నాయి. 8వ ఫోటో కవిత ఈ క్రింద ఉదాహరిస్తున్నాను.

"రాజ శక్తి దారి తప్పి/రాష్ట్ర శక్తి మేల్కొలుపగ/ధర్మ శక్తి నిలుచుంటది/నైమిశమో హిమాలయమొ/కాషాయము కాదు ఉనికి;/జగం మధ్య జనం మధ్య/జన చేతనకై వస్తది/చింతనాల మంతనాల/చిచ్చుకిని చూపిస్తది/ శివోఽహమ్మని పిలుపిస్తది".

ఈ ఫోటో 1992 డిసెంబర్ 5వ తేదీన అయోధ్యలోని వివాదాస్పద శతాబ్దాల అవమానపు కట్టడం కూలడానికి ముందు ధర్మాచార్యులున్న "ధర్మ సంసద్"కి చెందింది. నిన్నూ నీ సత్యాన్ని తొక్కివేసి నేను నిలిచాను అని సవాలు చేస్తున్న ఈ కట్టడం కూలాల్సిందే అని ధర్మసంసద్ నిర్ణయించిన సందర్భంలోని ఫోటో అది.

## విశ్లేషణ ఎలా !

ఇలా వివిధ ప్రక్రియలకు సంబంధించినవే కాక అనువాద కవితల్ని, పేరడీ కవితల్ని, రాజకీయ వ్యాఖ్యాన కవితల్ని వేరు వేరుగా పరిశీలించవచ్చు.

ప్రచురించిన గ్రంథాల్ని వస్తుదృష్టితో పరిశీలన చేసినప్పుడు పౌరాణిక కవితగా, చారిత్రక కవితగా, సాంఘిక కవితగా, ప్రకృతి కవితగా విశ్లేషించవచ్చు.

సామాజిక జీవనంలో ఆయా ప్రదేశాల్లో ఉన్నవారిని గ్రహించి పరిశీలిస్తే గ్రామ జన జీవన కవితలుగా, నగర జన జీవన కవితలుగా, వన జన జీవన కవితలుగా గిరిజన. జీవన కవితలుగా, జల జన జీవన కవితలుగా ఇవి కనిపిస్తాయి.

వృత్తి దృష్టితో పరిశీలిస్తే వ్యవసాయం, వివిధ వృత్తులు, వ్యాపారం, ఉద్యోగం, కూలి- కార్మికుడు, అధికారులు- తదితర వృత్తులవారిని స్పృశించిన భావాలున్న కవితలుగా కనిపిస్తాయి.

గుణదృష్టితో అనుశీలిస్తే మహామానవులు, త్యాగులు, వీరులు, ఉదారులు• నిస్వార్థులు, సంస్కర్తలు, నేతలు, శ్రామికులు, నీచులు, కుసంస్కారులు తదితర భావాలున్న కవితలుగా వింగడించే అవకాశముంది.

వ్యక్తి దృష్టితో పరిశీలిస్తే బాలబాలికల గురించి చెప్పినట్టుగా, వృద్ధులను స్పృశించినవిగా, యువతీయువకులకు సంబంధించినవిగా కనిపిస్తాయి.

ఇది కవితా విరాట్ ప్రపంచం. ఇలా ఎన్ని విధాలుగానో అనంత వైవిధ్యంతో కనిపించే వాటిని వస్తుగుణ దృష్టితో ఈ క్రింది వాదాల క్రింద అధ్యయనం చేయవచ్చు.

## వస్తుగుణ దృష్టి విభజన:

1. లౌకికవాదం, 2. కుహనా లౌకికవాదం, 3. అయోధ్యవాదం, 4. బాబరీ వాదం, 5. సమన్వయవాదం, 6. ఉగ్రవాదం, 7. ఉగ్రవాద వ్యతిరేకవాదం, 8. మండల్‌వాదం, 9. సమతావాదం, 10. వేర్పాటువాదం, 11. మతవాదం, 12. ప్రాంతీయవాదం, 13. సంప్రదాయవాదం, 14. స్త్రీవాదం, 15. మైనార్టీ వాదం, 16. దళితవాదం, 17. సంస్కారవాదం, 18. ఆర్యధర్మవాదం, 19. కులనిర్మూలన వాదం, 20. ప్రజాస్వామ్యవాదం, 21. అభ్యుదయవాదం, 22. ప్రగతివాదం, 23. ప్రేమ(స్నేహ)వాదం, 24. నీతివాదం, 25. నిరాశా వాదం, 26. మానవతావాదం, 27. స్వదేశీవాదం, 28. జాతీయవాదం, 29. సామాజిక న్యాయవాదం.

ఈ సంవత్సరం (1993) వచ్చిన కవితలన్నిటిని పరిశీలిస్తే ఇందులో ఏదో ఒక వాదంలో ఇవి ఒదిగిపోతాయని తెలుస్తుంది. ఏ వాదానికి ఒదగకపోతే మరొకొత్తవాదం క్రిందికి తేవచ్చు.

ఈ విధంగానేగాక వ్యక్తి సమస్యల్ని, కుటుంబ సమస్యల్ని, సమాజ సమస్యల్ని, జాతి సమస్యల్ని, దేశ సమస్యల్ని. ప్రపంచ సమస్యల్ని చిత్రించిన కవితల్ని ప్రత్యేకంగా ఒక్కో-వర్గం క్రింద పరిశీలించవచ్చు. సమస్యల్ని చిత్రించడమేగాక పరిష్కారాన్ని చూపిన కవితల్ని కూడా ఆ వర్గం క్రిందికే తేవచ్చు.

## సమస్యల చిత్రీకరణం:

ఈ విశ్వం చాలా పెద్దదే. ఈ విశ్వంలోని మనుష్యులు విశ్వాన్ని దిగమింగేంత శక్తి ఉన్నవారే. తమ మేధస్సుతో సృష్టిని జయిస్తూ ముందు ముందుకు సాగిపోతూన్నవారే. అయినా, సమస్యల సుడిగుండాల్లో చిక్కుకొంటున్నవారే. పరిష్కారం కొరకు పరితపిస్తున్నవారే.

కవి - రచయిత ఈ సమస్యలకు అతీతుదేమీ కాదు. జీవిత సమస్యల సుడిగుండంలో గిలగిలకొట్టుకొంటున్నప్పుడు స్పందిస్తున్నవాడే. ఆ కారణంగానే ఒక్కొక్క సమస్యమీద బోలెడన్ని కవితలు వచ్చినై.

1. వరకట్నం, 2. వధువు అగ్నిపరీక్ష, 3. సారా నిషేధం, 4. భూకంపం, 5. బాల వెట్టి కార్మికులు, 6. బస్సు ప్రమాదాలు, 7. రైలుప్రమాదాలు 8. విమాన ప్రమాదాలు, 9. గోరక్షణ, 10. నేతకార్మికులు, 11 గీతకార్మికులు, 12. డంకెల్ వ్యతిరేకత, 13. కాశ్మీరు కాందిశీకులు, 14. పాకిస్థాన్ - బంగ్లాదేశ్‌ల చొరబాటుదారులు, 15. సంతృప్తీకరణ విధానం, 16. స్కాంకుంభకోణం, 17. షేర్ల కుంభకోణం, 18. ఎయిడ్స్, 19. ధూమపానం, 20. అప్పులు, 21. ఎరువులు, 22. లంచాలు, 23. రాజకీయ హత్యలు, 24. హింస, 25. విదేశీ రుణాలు, 26. తిరుగుబాటు ధోరణులు, 27. నగర జీవితంలోగల నీళ్ళు పాలు సమస్యలు, 28. దేశద్రోహం, 29. మతోన్మాదం, 30. పర్యావరణ కాలుష్యం.

ఇవేగాక కళ్ళముందు తాండవించిన, తాను స్వయంగా అనుభవించిన అనేక విషయాల్ని కవితలుగా రచయిత మలచవచ్చు. ఈ సంవత్సరం పైన చెప్పిన అన్నిటిమీద కవితలు కొల్లలుగా వచ్చినై. వాదాలకు సంబంధించి, సమస్యలకు సంబంధించి ఏ ఒక్కటి రెండు విశ్లేషించి చూపినా ఈ వ్యాసం పెరుగుతుంది; అంతేగాక, మిగతా అంశాల్ని వదలివేసిన నేరం మోపబడుతుంది. అందుకే ప్రక్రియా దృష్టితో ఈ సంవత్సరం వచ్చిన కవితల్ని ఉజ్జాయింపుగా చూపించే ప్రయత్నం చేస్తాను.

## 1993 లో కవితాగ్రంథాలు :

1. ఏక సూత్రత ఉన్న పద్యకావ్యాలు (25), 2. పద్య ఖండకావ్యాలు (50), శతకాలు (50), గేయ కవితా గ్రంథాలు (50), వచనకవితా గ్రంథాలు (125), మినీ కవితలు (10), చిత్ర కవితలు (5), ఫోటో కవితలు (2), అనువాద కవితలు (5), కవితా సంకలనాలు (20).

ఇలా మొత్తం 352 కవితా గ్రంథాలు ఈ యేడు తెలుగులో వచ్చినై. అయితే ఇది అంచనా మాత్రమే. ఈ అంచనాకున్న శాస్త్రీయదృష్టి అంత గొప్పదేం కాదు. ఒకటి రెండు మాసాల్లో భిన్న పత్రికల్లో వచ్చినవి, గ్రంథావిష్కరణలు జరిగినవి పరిగణనలోకి తీసుకొని ఈ అంచనా వేయడం జరిగింది. ఇది లోపభూయిష్ఠమైనదే! అయినా ప్రస్తుతానికి ఇంతకుమించి చేయలేకపోయాను.

ఇవిగాక లిఖిత రూపంలో గ్రంథాలుగా రూపుదిద్దుకొన్నవి ఇందులో చేర్చలేకపోయాను. ఆ సంఖ్య తెలవాలంటే ఎక్కడెక్కడ ఎవరెవరు రాసి పెట్టుకున్నారో పత్రికాముఖంగా ప్రకటించినప్పుడే తెలుస్తుంది. అయిదార్గురి శతకాలు లిఖితరూపంలో ఉన్నవి నాకు తెలుసు. అలా దేశమంతటా లిఖిత రూపంలో ఎన్ని కవితాగ్రంథాలు ఆవిర్భవించాయో! ప్రౌఢకవుల గ్రంథాలకన్నా పిల్లకవుల గ్రంథాలెన్నో లిఖితరూపంలో మూల్గుతూ ఉంటా యనేది మాత్రం నిర్వివాదాంశం.

## పత్రికల్లో వచ్చిన కవితలు - తదితరములు:

తెలుగునాట కవితలు ప్రచురిస్తున్న దినపత్రికలు, వారపత్రికలు, పక్ష పత్రికలు, మాసపత్రికలు ఎన్నో ఉన్నాయి. కవితలకు ప్రత్యేకంగా స్థలం కేటాయించి అన్ని పత్రికలూ తగిన ప్రోత్సాహాన్నిస్తూనే ఉన్నాయి. ఒక్క 'ఈనాడు' తప్ప మిగతా అన్ని పత్రికలు కవితల్ని ప్రచురిస్తూనే ఉన్నాయి. ఇవేగాక త్రైమాసికలు, ప్రత్యేక సంచికలు, వార్షికోత్సవ సంచికలు కవితలకు సముచిత స్థానాన్ని ఇస్తూనే ఉన్నాయి.

ఇలాంటి పత్రికల్లో, సంచికల్లో ఒకటి రెండు మాసాల్లో వచ్చిన వాటిని దృష్టిలో పెట్టుకొని ఇన్ని కవితలు వచ్చి ఉంటాయని అంచనా వేయడం జరిగింది.

1. వృత్తపద్య ఖండికలు (120), 2. దేశిపద్య ఖండికలు (240), 3. గేయకవితలు (120), 4. వచనకవితలు (800), 5. మినీకవితలు (600), 6. జానపద గేయకవితలు (20), 7. చిత్ర కవితలు (220), 8. ఫోటో కవితలు (60) 9. అనువాద కవితలు (109), 10. పేరడీ కవితలు (30), 11. చలనచిత్రగేయాలు (1000), 12. క్యాసెట్ పాటలు (400), 13. రేడియో కవితలు (లలిత గేయాలతో కలిపి 420). 14. దూరదర్శన్ కవితలు (120), 15. అష్టావధాన శతావధానాల్లో మౌఖిక ప్రసారమైన పద్యాలు (2000), 16. పల్లెల్లో-పట్టణాల్లో జరిగిన కవి సమ్మేళనాల్లో మౌఖిక ప్రసారం పొందిన పద్యాలు-గేయాలు-వచన కవితలు (2000).

—ఇలా మొత్తం 8250 కవితలు పత్రికల్లోనూ, ప్రచార ప్రసార సాధనాల్లోనూ, మౌఖిక సంప్రదాయంలోనూ వచ్చినాయని అంచనా వేయడం జరిగింది. పత్రికల్లో - ప్రచార ప్రసార సాధనాల్లో, మౌఖిక సంప్రదాయంలో ఒకటి రెండు మాసాల్లో వచ్చిన కవిత్వాన్ని దృష్టిలో పెట్టుకొని సంవత్సరానికి లెక్క కట్టడం జరిగింది. ఇదికూడా సమగ్ర శాస్త్రీయ దృష్టి కాదు. ఇది గురికి బెత్తెడు దూరంలో తగిలిన దెబ్బగానే విజ్ఞులు గ్రహించాలని మనవి.

**ఉపశ్రుతి :**

ఇది 1993 లో తెలుగు కవిత విహంగావలోకనం మాత్రమే. ఇది 'శాంపిల్'గానే మీ ముందుంచాను. ఈ వ్యాసమంతా రఫ్‌స్కెచ్. "నేనింతబాగా రాస్తాను కనీసం నాపేరైనా ఇందులో స్పృశించలేదని" ఎవరూ అనుకోరనే భావిస్తాను. ఇక చివరగా ప్రేమతత్వ ప్రపూర్ణత కేతామెత్తిన 'మా మంచికవి' శ్రీ ఊట్ల కొండయ్య పద్యంతో ఈ వ్యాసానికి ఉపశ్రుతి పలుకుతాను. (గృహిణి, పద్యం : 628.)

"ప్రేముడు లాగ్రహమ్ములుగ, ప్రేమలె ద్వేషముగా ప్రతీక్షగా
ప్రేముడులే వ్రతమ్ములుగ, ప్రేమలె త్యాగముగా ప్రతిష్ఠగా
ప్రేమలె ప్రాణనైజముగ స్త్రీల సృజించిన సృష్టియెట్టిదో
ఆ మహనీయ తత్త్వమున కంజలిజేతు సదా జయార్థినై."

# 1993 లో 'నవల'

—శ్రీమతి అడివి సూర్యకుమారి

'నవల' ఆధునిక నాగరికత సృజించుకొన్న గొప్ప ప్రజా కళారూపం.

మానవ జీవితం ఎన్ని మార్పులు చెందుతూ వస్తోందో, నవల కూడా ఆవిర్భావం నుండి ఈనాటి వరకూ అన్ని మార్పులూ తనలో సంతరించుకొని వస్తోంది. అంటే....నవల. జీవితానికి ప్రతిస్పందనే కాదు, పరావర్తనం కూడా. అందుకనే మానవ జీవితం అంత సజీవంగా నవల జీవించింది. మరింత విశ్లేషించి చెప్పాలంటే- నవల తన జీవ శక్తిని కోల్పోకుండా వుంది అంటే మానవ జీవితం లోని మార్పుల్ని ఆహ్వానించి, చర్చించి, విశ్లేషిస్తూ మనుగడ సాగిస్తోందన్న వాస్తవమేనన్న మాట!

మానవుణ్ణి పరిపూర్ణంగా తన పరిధిలోకి తీసుకొని అతని జీవితాన్ని సంపూర్ణంగా చిత్రించడానికి మానవుడు తయారు చేసుకొన్న మొట్టమొదటి కళారూపం నవల. అంతేకాదు, మానవుడి రహస్య జీవితాన్ని సైతం దృశ్యమానం చేయగల శక్తి నవలకున్నట్లు మరే కళారూపానికీ లేదు. బహుశ మిగతా కళారూపాలకి, నవలకి ఉన్న ముఖ్యమయిన తేడా ఇదొక్కటే కావచ్చు.

ఇంగ్లీషులోని 'నోవెల్' అన్న పేరు ఇటాలియన్ భాషలోని 'నొవెల్లా' అన్నపదం నుండి వచ్చింది. ఇటాలియన్ భాషలోని నొవెల్లా పదం, లాటిన్ భాషలోని 'నోవా' నుంచి పుట్టింది. లాటిన్‌లోని 'నోవా' శబ్దం, సంస్కృతం లోని 'నవ' శబ్దానికి సమానమైంది. అంటే ఈ పదం ఇండో-యూరోపియన్ భాషా కుటుంబంలో చేరిన లాటిన్, సంస్కృత భాషల్లో సమానంగా వుంది.

**1872** నుండి తెలుగులో నవలా ప్రక్రియ ప్రారంభమైనా 'నవల' అనే నామకరణం మాత్రం 1897 లో మాత్రమే జరిగి స్థిరపడి వ్యాప్తితో కొచ్చింది. 'నోవెల్' అన్న ఇంగ్లీషు పదానికి 'కొత్తది' అని అర్థం. సంస్కృతంలో 'నవ'

శబ్దానికి కొత్తది అనే అర్థంవుంది.'నవాన్ విశేషాన్ లాతి గృహ్ణాతీతి నవలా'అన్న అర్థాన్ని సాధించి, తెలుగులో కూడా 'నవల' అని పిలవడం సబబుగా ఉంటుం దని కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారు 1897 లో ఒక విమర్శ గ్రంథానికి (రాజ శేఖర చరిత్ర) రాసిన పీఠికలో వ్రాశారు. అప్పటినుండే తెలుగులో 'నవల' అన్న పదం వాడుకలోకొచ్చి స్థిరపడిపోయింది.

విప్లవాలు, సంగ్రామాలు, నిరంకుశ ప్రభుత్వాలు, దౌష్ట్యం, రాజరిక పతనాలు, ప్రజాస్వామ్య వ్యవస్థలు, ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతిక పరిస్థితులు, విడాకులు, ప్రేమ, ఉమ్మడి కుటుంబాలు, వాని విచ్ఛిన్నతలు, కార్మిక కర్షక ఉద్యమాలు, విభిన్న మానవ మానసిక ప్రవృత్తులు, దైనందిన జీవితంలో మనిషి ఎదుర్కొనే అనేక క్లిష్ట సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించి నవల నవరసభరితమైంది. ఈ ఇతివృత్తాలు సమగ్ర మానవ జీవితాన్ని చిత్రించడానికి వీలు కల్గించాయి. నవల మానవ జీవితానికి భాష్యం చెప్తోంది. అందుకే నవల 'ఆధునిక ఇతిహాసం.'

టాల్‌స్టాయి, మాక్సింగోర్కి, చార్లెస్ డికెన్స్, స్కాట్, గోల్డ్‌స్మిత్, డాస్టోవిస్కీ వంటి ప్రపంచ ప్రఖ్యాత నవలాకారులు ఈ సాహిత్య ప్రక్రియకు తమ అపూర్వ శిల్ప విన్నాణంతో అత్యంత గౌరవాదరాలని, వైశిష్ట్యాన్ని కల్గించారు, మన దేశంలో ఠాగూర్,బంకించంద్ర, శరత్, వీరేశలింగం పంతులు గారు, ఉన్నవ లక్ష్మీనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి, ముల్కరాజ్ ఆనంద్, కిషన్‌చందర్, ఆర్.కె. నారాయణ్ మొ॥న రచయితలు భారతీయ నవలా సాహిత్యంలో ప్రథమశ్రేణికి చెందిన నవలల్ని సృష్టించి, విశ్వసాహిత్యంలో మనకు మంచిపేరు తెచ్చిపెట్టారు.

ఇదంతా పూర్వరంగం, నవలకి స్వర్ణయుగం వంటిది.

కవులు, రచయితలు ప్రతి కాలంలోనూ ఆయా దేశ కాలాల సామాజిక, ఆర్థిక, రాజకీయ, భౌగోళిక పరిస్థితుల ననుసరించి సాహిత్య సృష్టి చేస్తుంటారు. సాహిత్య ప్రక్రియల్లో ప్రధానమైన 'నవల' కూడా కాలానుగుణ్యంగా అనేక మార్పులు సంతరించుకొంది.

ఈ ప్రసంగం కోసం నేను చూసిన 1993 లో వచ్చిన, వస్తూన్న కొన్ని నవలల పేర్లు చెబుతాను - ఆరంగేట్రం, రక్తచందనం, రైవల్‌గ్యాంగ్, కలల కౌగిళ్ళు, లవర్స్‌డెన్, ప్రాక్టికల్ జోకర్, కబంధుడు, ది ఇన్వెస్టిగేటర్, అంకురార్పణం, వేదనిధి - (ఇదేదో వేదాలకి సంబధించిన గొప్ప గ్రంథం అనుకోకండి- మాదకద్రవ్యాలు, నిధుల మీద రాస్తున్న నవల) కాలం ఒడిలో, ప్రేమ, తమసోమాజ్యోతిర్గమయ, మహాభినిష్క్రమణం - ఇలా దాదాపు ఒక ఏభై నవలలు చూశాను.

వీటిల్లో కొన్ని (మూడు నాలుగు) నవలలు మినహాయిస్తే - కథావస్తువు మొత్తం నవలల్లో ఒక్కటే - అది - నేరం. హింస, సెక్స్ - ఈ మూడింటి చుట్టూ తిరిగింది.

పాత్రల చిత్రణ గమనిస్తే నాకో పాతసామెత గుర్తొస్తోంది. "ఏమిట్రా తమ్ముడూ, వసంతం నామీద చల్లుతున్నావూ?" అని అక్కగారంటే........ ఆ తమ్ముడు "అయ్యో! అక్కయ్యా నువ్వటే, అమ్మనుకున్నాను!" అన్నాట్ట. పై నవలల్లో పాత్రల వ్యక్తిత్వాలు అట్లా వున్నాయి.

ఒక పది పదిహేను సంవత్సరాలుగా నవలా ప్రపంచాన్ని క్షుద్రశక్తులు, సెక్స్, క్రైం, గూండాయిజం, హోటళ్ళు, కామోత్సవాలు, క్యాబరే డాన్సర్లు, ఎయిర్ హోస్టెస్‌లు, - నవలా వస్తువులుగా పలుకుతున్నాయి. ఇరవై ఏళ్ళుగా ఈ విషవలయం ఇక్కడిక్కడే వీటి మధ్యలోనే తిరుగుతోంది.

ఈ పుస్తకాల్లోనే ఓ నవల వెనక పాఠకుల ప్రశ్నలకు జవాబు లిచ్చాడో రచయిత. ప్రశ్న ఏమిటంటే -

"మీరెందు కిలాంటి రచనలు చేస్తున్నారు?"అని.దానికారచయిత జవాబు- "మా రచనల్లో సమాజం లేదా? గూండాలు, వేశ్యలు సమాజంలో భాగం కాదా?" ఇదీ జవాబు.

399 పేజీలు హింస, సెక్స్, బీభత్సాల్ని సృష్టించి ఆఖరి పేజీలో నాలుగు వాక్యాలు నీతిని బోధించినంత మాత్రాన అది సాంఘిక ప్రయోజనంగల నవల అనిగాని, లేక ఆహ్లాదకరమైన నవల అనిగాని అనిపించుకుంటుందా?

అవాస్తవిక కల్పనలు, అసందర్భ ఆదర్శాలు, ధనప్రలోభం, కాముక వ్యాపారం, స్వార్థచింతన నిండిన ఆ నవలలు చూస్తుంటే - మనుషుల్లో ఈ ప్రవృత్తులు లేవని కాదు, ఇవి ఎప్పుడూ ఉంటాయి. అయితే వీటినే అతిగాను, అనుసరణీయాలుగా, ఆకర్షకాలుగా చేసి రాస్తున్నప్పుడు అవి పాఠకుల మీద చూపించే ప్రభావం, సమాజాన్ని ఎటు తీసుకుపోతాయోనన్న చింత కలక్కమానదు.

ఒకనాడు రచయితలు మానవీయ విలువలు పోగొట్టుకోకుండా. తమ పాఠకులస్థాయి ఎరిగి, వారి పఠనాసక్తిని పెంపొందిస్తూ, చక్కని ఇతివృత్తాలు ఎన్నుకొని, కొంత టెక్నిక్కుని జోడించినప్పటికీ, - ప్రేమాభిమానాలు, మానవత్వం, దయ, సత్యం, అహింస, సమష్టి శ్రేయాదర్శనం, స్వార్థత్యాగం, నీతి, న్యాయం, ధర్మం - మొ॥ న విలువల్ని ప్రతిపాదిస్తూ నవలలు రాశారు.

మరి ఈనాడో? పాఠకుణ్ణి బాగా చదివించగల కథనంతో నవలలు రాయగల రచయితలు, రచయిత్రులు కూడా పుంఖానుపుంఖాలుగా, వ్యక్తికి, వ్యవస్థకి హాని కల్గించే ఇతివృత్తాలతో నవలలు రాస్తున్నారు. ఉదా : 'రక్తచందనం' నవల గంధపు చెక్కల దొంగ వీరప్పన్‌మీది నవల. తన పనులకి సహకరించిన కొందరికి అతను సహాయం చేయడాన్ని, వర్గరహిత సమాజంకోసం ప్రభుత్వంతో పోరాటానికి దిగిన వ్యక్తిగా అతణ్ణి చిత్రిస్తూ, హింసను ప్రోత్సహించే నవల. ఇక్కడ రెండు విషయాలు గమనించవచ్చు.

ఒకటి - రచయితకి వర్గరహిత సమాజం కోసం పోరాడే శక్తుల పట్ల ఏ మాత్రం అవగాహన లేకపోవడం.

రెండు వీరప్పన్ లాంటి స్మగ్లర్ని, కన్నకూతుర్ని భార్యని చంపుకున్న స్వార్థపరుణ్ణి విప్లవకారుడిగా పోల్చటం చూస్తే - రచయితకు 'విప్లవకారులు' అంటే ఎవరో తెలీదని అర్థమవుతోంది.

సమకాలీన సమస్యనిగాని, వ్యక్తుల్ని గాని తీసుకొని నవల రాసేటప్పుడు రచయిత సత్యాన్ని ప్రధానంగా తీసుకోవాలి. నవల రాయడానికి ఊహ కొంత తప్పనిసరి, కాదనను కాని... సత్యం మరుగున పడరాదు. అంతేగాదు, రచయితకి సమస్యల పట్ల ఒక అవగాహన, విశ్లేషణ తప్పనిసరిగా ఉండాలి.

ఇన్‌వెస్టిగేటివ్ నవలల పేరుతో చాలా నవలలు చూశాను. పోలీసు ఉన్నతాధికారులు, మిలిటరీ అధికారుల మీద కొన్ని నవలలొచ్చాయి. ఆయా అధికారుల విద్యుక్తధర్మాలు, కర్తవ్యాలు, పరిమితులు. వారు కేసుల్ని టేకప్ చేసే విధానాలు, అప్రోచింగ్, వారి ట్రయినింగ్, డ్యూటీ లిమిట్స్, వర్క్ లిమిట్స్, ఏరియా లిమిట్స్ - ఇలాంటివి ఉంటాయని, 'విదేశాల్లోలా మన దేశంలో అధికారులు ప్రవర్తించరు' అన్న కనీస ప్రాథమిక పరిజ్ఞానంలేని రచయితలు - నాలుగు ఇంగ్లీషు నవలలు చదివి ఆ మాదిరిగా, వారి పరిశోధనా పద్ధతుల్ని, మన దేశంలోని అధికారులకి ఆపాదించి రాస్తుంటే - రచయితకి కనీస జ్ఞానం కూడా ఈ అధికారుల విషయంలో లేదని అర్థమవుతోంది.

మరో నవల - ఆరంగేట్రం - మూడొందల పైచిలుకు పేజీలుగల ఈ నవలలో - ఒక వేశ్యకూతురు చివరికి వేశ్యకావటం. ఒక విటుడి చేత నాయిక రేప్ చేయబడటం - ఎంత అశ్లీలంగా రాయబడిందో....

శృంగారం, ప్రేమ - మానవజీవితంలో భాగాలే. (నేటి నవలల్లో కన్పించేవి ఇవేనా అన్న అనుమానం కలుగుతోంది.) అవి సాహిత్యంలో ప్రతిఫలించనూ వచ్చు. కాని ఇంత పచ్చిగా, సభ్యసమాజం సిగ్గుతో తలవంచుకునే స్థితికి మాత్రం దిగజారకూడదు విద్య, ఉద్యోగాలు తదితర సామాజిక రంగాల్లోకి స్త్రీలింకా ధైర్యంగా ముందుకు రాలేని స్థితిలోనే ఉన్నారు. వారికి తగిన ప్రోత్సాహం ఇవ్వాల్సిన ఉద్యమం ఇంకా ప్రాథమిక స్థాయిలోనే వుంది. ఈ స్థితిలో స్త్రీల చైతన్యాన్ని తప్పుదోవ పట్టించే ఇటువంటి రచనలు ఓ రచయిత్రి రాయడం మరీ దురదృష్టం. ఇంత అసభ్య ధోరణిలో స్త్రీ చిత్రించబడటం వల్లనే సమాజంలో స్త్రీకి, రక్షణ, విలువ తగ్గిపోతున్నాయి. యువతరంలో పిల్లల్లో ఆమెపట్ల తేలిక భావా లేర్పడుతున్నాయి. ఈ రకంగా స్త్రీ జాతి మానసిక వేదనకి గురైతే సమాజంలో ప్రగతి వస్తుందా?

అశ్లీలతకి, శృగారానికి తేడా తెలియని స్థితిలో ఉన్నారు రచయితలు.

ఓ రచయిత తన నవలవెనక పాఠకులడిగిన ప్రశ్నకు జవాబిస్తూ -

"అశ్లీలత ఎక్కడ లేదు? మన ప్రాచీన కావ్యాల్లో ఇంతకంటే ఎక్కువ వుంది. ఉదా: మనుచరిత్ర" అన్నాడు.

అవగాహన లేని వ్యక్తులు ఆలోచనారహితంగా అనే మాట. మను చరిత్రని అర్థం చేసుకోవాలంటే మన సంస్కృతి, తత్త్వశాస్త్రం తెలియాలి. కనీసం గౌరవమైనా ఉండాలి. "మనుచరిత్ర తాత్త్విక, ధ్వనిపూర్వకమైన మహాకావ్య

మని, దాని ప్రయోజనం - గార్హస్థ్య ధర్మ నిరూపణం, - ప్రేమ, గార్హ్యస్థ్య ధర్మానికి ఎలా ప్రాతిపదిక కావాలో రుజువుచేయడం." అని సదరు రచయితకేం తెలుసు పాపం! ఆంగ్ల నవలల్ని తర్జుమాచేసి రాయడం తప్ప.

రచయితలు కథలో మలుపులకి, సంఘటనలకి ఇచ్చే ప్రాధాన్యం - శిల్పానికి, సందేశానికి ఏ మాత్రం ఇవ్వడం లేదు. పాత్రల్ని కేవలం కథనడిపే వాహికలుగా మాత్రమే ఉపయోగించుకుంటున్నారు గాని, పాఠకుల హృదయాల్లో మరిచిపోలేని విధంగా ముద్రవేసే పాత్రల్ని సృష్టించటం లేదు. అందుకే నేటి నవలల్లో - ఆనాడు కన్పించిన గిరీశం, గంగూ, దయానిధి. రామదాసు, ధర్మారావు, నారాయణరావ్ లాంటి సజీవపాత్రలు కన్పట్టంలేదు. అంటే ఆనాటి రచయితలు ఆయా పాత్రల్ని తీర్చిదిద్దడంలో ఎంతో నైపుణ్యం కనపరిచారు కాబట్టే ఆ పాత్రలు మనకు ఈనాటికీ గుర్తున్నాయి. మరి ఈ నాటి నవలల్లో ఒక పాత్ర అయినా మనం గుర్తుంచుకోదగినది ఉన్నదా? అంటే లేదనే చెప్పాల్సొస్తోంది.

ఇంత అవాంఛనీయ ధోరణి కేవలం ఈ నవలా సాహిత్యానికే ఎందుకు పట్టింది? అని ఆలోచిస్తే నాకు నాలుగు కారణాలు కన్పించాయి.

ఒకటి - రచయితల బాధ్యతలేనితనం.
రెండు - ఘోస్ట్‌రైటర్లు.
మూడు - స్పాన్సరర్లు.
నాలుగు - తక్కువ కాలంలో ఎక్కువ రచనలు చేసి ఎక్కువ డబ్బు సంపాదించాలనుకోవడం.

1. ఒక్కో రచయిత నెలకి రెండు మూడు నవలలు రాస్తున్నారు. దీని వలన - వస్తువు, శిల్పం, పాత్ర చిత్రణం, కథాకథనం - వేటిమీద శ్రద్ధ చూపలేక అతి తేలికతనపు నవల లొచ్చాయి. ఈ ప్రపంచంలో మంచికి చెడుకీ నడుమ సంఘర్షణ ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది - అప్పుడు రచయిత పాఠకుడికి ఏమార్గం అనుసరించాలో నిర్ణయించి ఆ దారినే పొమ్మని సూచించాలి. పాఠకుణ్ణి మంచిదారిలోకి మళ్ళించటం మంచి రచయిత బాధ్యత అనుకుంటాను.

2. ఘోస్ట్‌రైటర్లు - రచయితలు కొంచెం పేరు రాగానే మరెవరి చేతనో రాయించి, తమ పేరుమీద పబ్లిష్ చేయించటంతో - ఆ నవలల్లో విలువల్లేక, మఖలో పుట్టి పుబ్బలో మాడిపోతున్నాయి.

3. స్పాన్సరర్లు - ఏ టోపీల కంపెనీవారో స్పాన్సర్ చేస్తారు నవలని. పత్రికా యజమాన్యం రచయితకి రెమ్యూనరేషన్ ఇవ్వక్కర్లేదు. కనక, ఆ రచ

నలో శిల్పం ఉందా? వస్తువు మంచిదా? కాదా? కథాకథనం భాష, పాత్ర చిత్రణ ఎలా ఉన్నాయి? ఇవేవి చూడాల్సిన అవసరం లేదనుకుంటారు పత్రికాధిపతులు. ఫలితంగా వచ్చిన నవలల స్థాయి ఎంతో పడిపోయింది.

4. బాధ్యతలేనితనం - రచయితలు తమకో గురుతరమైన బాధ్యత వుందన్న విషయం చాలామంది గుర్తించటంలేదు. డబ్బు సంపాదనే ధ్యేయంగా ఎలాగోలా పేరు నలగడమే ప్రధానంగా పెట్టుకోవడం వలన-డ్రాక్యులా సినిమా ల్లాంటివి, ఛేజ్ నవలల్లాంటివి తెలుగులో దిగుమతయ్యాయి. ఈ కాపీ నవల దుమారం ఇలా ఉండగానే, నవలలు సినిమాలుగా రావడం మళ్ళీ మొదలైంది. సినిమాల్లోలా నవలల్లో కూడా హీరోకి విలన్‌కి, హీరోయిన్‌కి వ్యాంప్‌కి తేడా తెలీని మనస్తత్వాలతో, బాధ్యతారాహిత్యంతో నవలల్ని సృష్టించారు రచయితలు.

పాఠకుణ్ణి బుజ్జగించి, మత్తులో ముంచే ఈ రకంరచనలు వందలాది. ఉండగా-

ఒకటీ అరా - వ్యక్తిని సంస్కరించగల, జాగృతం చేయగల, గుండెని తట్టి మానవత్వాన్ని మేల్కొల్పే నవలలు కన్పించాయి. అంతేకాదు, ఇరవై సంవత్సరాల విషవలయం నుండి విడివడి మంచిని పెంచుకుంటూ, పంచుకుంటూ ముందుకు సాగాలనే ప్రయత్నం ఈ సంవత్సరంలో కన్పించింది.

కుటుంబం, కుటుంబ వ్యవస్థ, సంస్కృతి, సంప్రదాయం, ఆత్మీయతలు, అనురాగాలవైపు నవల కదిలింది. భాషలో, శిల్పంలో నాజూకుతనం హెచ్చింది.

ప్రేమని ఇతివృత్తంగా తీసుకొని ముగ్గురు రచయితలు ఏయే కోణాల్లో చూస్తూ ఎలా వ్యక్తీకరిస్తారు? ఇది కొత్త ప్రయోగమే.

ముగ్గురిలో యండమూరి వీరేంద్రనాథ్ రచనలో భావుకత, శిల్పం ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

సులోచనా రాణి రచన మామూలే, అభిమానవతియైన మధ్య తరగతి ఆడపిల్ల జీవితంతో సాగించే పోరాటం, ధనవంతుడు అందగాడు హీరో. పెద్దగా మార్పేంలేదు, అయితే పాత్రల మనస్తత్వాలపై రచయిత్రి చేసిన విశ్లేషణ అక్కడక్కడ కన్పించింది. అదొక్కటే ఆమె నవలలో కొత్తదనం.

జలంధర రాస్తున్న 'తమసోమా జ్యోతిర్గమయ' భార్యాభర్తల మధ్య ఉత్పన్నమయ్యే సమస్యలని సున్నితంగా చిత్రీకరిస్తూన్న నవల.

జాగృతిలో వచ్చిన అడివి సూర్యకుమారి రాసిన నవల "కాలం బడిలో...." ఈ దేశంలో కుటుంబ వ్యవస్థకు మూలమైన స్త్రీ ఎన్నో ఆటుపోట్లకి, విషమ పరీక్షలకి, తిరుగుబాట్లకి తట్టుకొని, మన సంప్రదాయాన్ని, సంస్కృతిని ఈనాటి వరకూ కాపాడుతూనే వుంది. ఇందుక్కారణం - వ్యక్తిగా ఎలాంటి అవమానాలకి, అసహనానికి గురైనా, ఒక సామాజిక శక్తిగా అందరి అనుబంధాల్ని, ఆత్మీయతల్ని పొందగలిగింది. ఇదే మూలశక్తిగా, జీవ చైతన్యంగా ఆమె జీవిస్తుంది. కాని.... ఆ స్త్రీమూర్తికి ఇప్పుడు మరో దెబ్బ తగిలింది. అది - ఆత్మీయత, అనుబంధం, ప్రేమ లాంటి జీవశక్తులన్నీ కేవలం ఆర్థిక పునాదులపై ఆధారపడి ఈ జాతికి ప్రాణభూతమైన సంస్కృతి సంప్రదాయాల్ని కాపాడే స్త్రీని పూర్తి నైరాశ్యంలో ముంచుతున్నాయి. ఈ తరుణంలో కూడా నిరాశా నిస్పృహలకి లోనుకాకుండా స్త్రీ - భార్యగా, తల్లిగా, సోదరిగా తన విధిని ఎంత సమర్థవంతంగా నిర్వహించగలదో చెప్పడమే ఈ నవల ధ్యేయం.

మొత్తం మీద ఈ సంవత్సరంలో రచయిత(త్రు)లు నవలని హింస, సెక్స్‌ల నుండి బైటపడేసి, విలువల్ని చూపించాలనే ప్రయత్నంలో చిన్న కదలిక చూపారు. ఇది చాలా శుభ పరిణామం.

మారిన ఈనాటి పరిస్థితుల్లో (టి.వి.లు. స్టార్ టి.వి.లు, కేబుల్ టి.విలు హోరెత్తిస్తున్న స్థితిలో) మానవత్వపు విలువలు పోగొట్టుకోకుండా కళాత్మకంగా మంచి ఆదర్శాలవైపు పఠిత మనస్సు మొగ్గు చూపేవిధంగా, మంచి నవల రాసి పాఠకుడిచేత చదివించగలగడం (అదీను అనేక ఆకర్షక నవలలు, వాతావరణం పక్కనుండగా) రచయితకి కత్తిమీద సాము లాంటిదే. మంచి రచనలే చెయ్యాలన్న తపనగల కొందరు ఈ 'సాము' నిరవధిరంగా అనేక ఇబ్బందులు ఎదుర్కొంటూ కూడా సాగిస్తున్నారు. వీరి సంఖ్య అతి స్వల్పం.

చివరగా ఒక్కమాట -

నవల ఏం చూపించాలి? అని ప్రశ్నించుకుంటే - నవల చైతన్యంతో వెల్లివిరిసే జీవితాన్ని చూపించాలి. వాస్తవికతకి దర్పణం కావాలి. మనిషిని ఒట్టి మనిషిగానే కాక, విశ్వమానవుడిగా దర్శించగలిగేట్టు చెయ్యాలి. మానవత్వానికి నిజమైన విలువ సిద్ధించేలా చెయ్యాలి. ఇందుకు రచయితల మీద గురుతరమైన బాధ్యత వుంది. దీన్ని గుర్తించినవారు బాధ్యతాయుతంగానే రాస్తున్నారు. కాని వీరి సంఖ్య పెరగాలి. పెరిగే అవకాశాలు కలగాలి. అపుడు చిరకాలం నిలిచే మంచినవలలు తెలుగులో కూడా రావడానికి వీలు కలుగుతుంది.

నవల 'చలనశీల'యే కాదు 'ప్రగతిశీల' కూడా!

# 1993 లో తెలుగు సాహిత్య విమర్శ—కొన్ని పరిశీలనలు

—డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య

సాహిత్య విమర్శ ఎక్కడ అచ్చుకావాలి? దిన పత్రికలలోనా? వార పక్ష మాస వారీగా వచ్చే కథల పత్రికలలోనా? ఈ రెండు రకాల పత్రికలూ విమర్శకు ఇచ్చే ప్రాధాన్యం ఏమిటి? భారతి చరిత్ర గర్భంలో కలిసిపోయాక స్రవంతిని 'సమాలోచన'ను మినహాయిస్తే విమర్శ వ్యాసాలను ప్రచురించే పత్రికలు లేవనే చెప్పాలి. తెలుగు ఎకాడెమీ వారు ప్రచురించే తెలుగు పత్రిక మాత్రం ఇతర శాస్త్రాలపైని వ్యాసాలనే కాకుండా తెలుగు సాహిత్య విమర్శ - పరిశోధన వ్యాసాలనుకూడా ప్రచురించి పుణ్యం కట్టుకొంటున్నది. అట్లాగే ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు సంవత్సరాని కొకసారి ప్రచురించే 'వివేచన' కూడా కేవల విమర్శకు అంకితమైన పత్రిక. సాధనక్షే(జా.సా.ప.వారిది) కూడా అలాంటి పత్రికే.

ఇదంతా ఎందుకంటే, ప్రచురణకు అవకాశం లేని సందర్భంలో విమర్శ ఆరోగ్యవంతంగా ఎట్లా వస్తుందన్నది అడగడానికే. వారానికోసారి దినపత్రికల వాళ్ళు ఒక్క పేజీని విమర్శకు, పుస్తక సమీక్షకు, కవితకు కేటాయించి కాస్త అవకాశాన్నిస్తున్న మాట సత్యమే కాని దినపత్రికల ముద్రణ రీతి పరిశోధన పద్ధతులను ఇముడ్చుకొనే అవకాశం లేనివి కావడం, మరి ఇతర కారణాలు - విమర్శ సరియైన రీతుల్లో రావడానికి అవకాశాలను బాగా తగ్గించి వేసింది.

దిన పత్రికల్లో వస్తున్న విమర్శ వ్యాసాలు రెండురకాలుగా ఉంటున్నాయి. ఒకే రచయిత ధారావాహికంగా ఒక కాలమ్‌ని నిర్వహించడం. గత సంవత్సరం చేరా, జి.వి. సుబ్రహ్మణ్యం, శ్రీకాంతశర్మగార లిట్లా ధారావాహికమైన విమర్శను నిర్వహించారు. ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ దినపత్రికలిట్లాంటి

అవకాశాన్నిచ్చినవి. ఇక రెండవ తరహా అనేక రచయితలవి వారాని కొకటో రెండో విమర్శ వ్యాసాలు ప్రచురించడం.

ఇంకో విషయం: ఈ రెండవ తరహా వ్యాసాలపై చర్చకు ఆహ్వానించడం ద్వారా సంపాదకులు తమ తమ పత్రికలపై పాఠకుల దృష్టి పడేట్లుగా చేయడం. ఇది వాద ప్రతివాదాలను ప్రోత్సహించి పత్రికలను పాఠకులు కుతూహలంతో చదవడానికి ఉపయోగపడడం అన్న అంశం పత్రికా యాజమాన్యం వారికి ఎంతో లాభదాయకం కావడంతో పాటుగా సాహిత్య రంగంలో కొన్ని అంశాలు నిగ్గుతేలడానికి కూడా బాగా ఉపయోగపడ్తుంది.

ఆయా సాహిత్య సంస్థలు సాహిత్య గోష్ఠులద్వారా విమర్శను ప్రోత్స హించడం జరుగుతుండేది. ఈ సమావేశాన్ని నిర్వహిస్తున్న యువభారతి ఈ విషయంలో గణనీయమైన సేవ చేస్తున్నది. ఆంధ్ర సారస్వత పరిషత్తు మొదలగు సంస్థలు కూడా నెల నెలా ఇలాంటి గోష్ఠులను నిర్వహించేవి. కాని ఇటీవల ఎందుకో నిర్వహించడం లేదు. ఐతే ఈ గోష్ఠి వ్యాసాలను ప్రచురించక పోవడం చేత ఈ కృషి అంతా అప్రయోజకమౌతున్నది.

ఆంధ్రప్రభ వంటి దిన పత్రికలలో వచ్చిన వాద ప్రతివాద విమర్శలలో పద్యం మీది చర్చలు ఆసక్తిదాయకంగానే జరిగినవి. ఏమి తేల్చినా తేల్చక పోయినా ఆ చర్చలు వరంగల్లులో, విజయవాడలో పద్యం మీద మంచి గోష్ఠులకు ప్రేరకాలయ్యాయి.

Negetive దృక్కోణంతో వచ్చిన వ్యాసాలు కూడా ఈ సంవత్సరంలో ఉన్నాయి. శ్రీకాంతశర్మగారి కృషి ఇందులో అధికం. ఇవి అప్రయోజక మార్గం అని వేరే చెప్పనక్కర లేదు నెగెటివ్ పంథాతో పాటుగా నిర్మాణాత్మకమైన అంశాలను కూడా సృష్టిస్తూ విమర్శ చేసినవాళ్ళు కసిరెడ్డి, వల్లభాచార్యగారలు. వీరి వ్యాసాలు జాగృత సాహితి, మధుకళ అన్న పుస్తకాలుగా కూడా వచ్చాయి.

జి. వి. సుబ్రహ్మణ్యం గారు, చేరాలు తమ తమ వ్యాసాలలో కొత్త రచయితల రచనలను పరిచయం చేసి, ఎంతో పుణ్యం కట్టుకొంటున్నారు. చేరా విమర్శలలో తెలుగు మార్క్సిస్టుల మార్క్సిజం ముద్ర అసలు ఉండక

పోవడం విశేషం. ఆయన సాహిత్య విమర్శకు మంచి మార్గదర్శనం చేస్తున్నా రనడంలో అతిశయోక్తి ఏమీలేదు. కొత్త రచయితలను సాహిత్యరంగం మీద వెలుగువేసి చూపించిన ఘనత చేరాకు ఎంతగానో దక్కుతుంది. మన సాహిత్య క్షేత్రంలోని గుత్తాధిపత్యం మీద చేరా దెబ్బతీయకపోయి ఉన్నట్లయితే కొండేపూడి నిర్మల, ఆదూరి సత్యవతి లాంటి విశిష్ట ప్రతిభావంతులు బైటకు రాగలిగే వాళ్ళే కారు. ఇటీవల గోదావరి Theme మీద రాసిన రచనలను, ఎండ్లూరి సుధాకర్, శిఖామణి మొదలైనవారి కావ్యాలను సమీక్షిస్తూ జి. వి. సుబ్రహ్మణ్యం గారు రాసిన వ్యాసాలను చూడండి. అవి వర్ధిష్ణువుల నెంత ఉత్తేజితులను చేస్తాయో చెప్పనక్కరలేదు.

ఒక కవితలోని నిర్మాణ మర్మాలను తెలపడం అన్న విశిష్ట విమర్శరీతిని వెలయిస్తున్నవాడు చేరా. ఐతే, వీరు ఎన్నుకొనే రచనల కేదో శాస్త్రీయమైన నేపథ్యం ఉండాలి. కేవలం తమ ఇష్టానిష్టాలు ఆధారంగా కొందర్ని ఎన్నుకొని, మరికొందరిని తిరస్కరించడం సరైన పద్ధతి కాదు. దినపత్రికల వంటి సంకుచిత - సంక్షిప్త పరిధిలో, అర్భక - కుహనా విమర్శకుల దుర్మార్గ ప్రతిస్పందనలకు జంకకుండా ఆయన రాసుకొంటూపోతున్నాడు. వారం వారం శీర్షికలను ఏక రచయితల చేత నిర్వహింపజేసే పత్రికలు ఈ రకమైన విమర్శను ప్రోత్సహించడం వల్ల సాహిత్యక్షేత్రంలో ఎక్కువ లాభం ఉన్నది.

స్త్రీవాదం ఇత్యాది సాంఘిక వాదాలమీద రెచ్చగొట్టి వస్తువిమర్శను ప్రచురించడం వల్ల సాహిత్య క్షేత్రానికి ప్రత్యేకంగా ఒరిగేది ఏమీలేదు. జయప్రభ, విమల వంటి సత్కవయిత్రులలో స్త్రీవాదం బాగా బ్రతకిందంటే అది వారి కవిత్వ సృజనాశక్తి వల్లనే. దాన్ని విశ్లేషించి ఎత్తిచూపకుండా కేవలం అందులోని వాదాలను పరామర్శిస్తే లాభం ఏమిటి?

ఇంక సంకలనాలలో విమర్శ వ్యాసాలను ప్రస్తావిస్తే-అట్లా వచ్చినవాటిల్లో సంపత్కుమారాచారిగారి కవి - కవిస్వామ్యం, సుప్రసన్నగారి భావుక సీమ, సుబ్రహ్మణ్యంగారి జీవియస్ వ్యాసాలు, అఫ్సర్‌గారి ఆధునికత - అత్యాధునికత, కసిరెడ్డిగారి జాగృత సాహితి, సంపత్కుమారాచార్యగారి షష్టిపూర్తి సందర్భంలో వెలువడిన సాహితీ సంపద - అన్నవి పేర్కొనదగినవి. జీవియస్

వ్యాసాలుతో 'తెలుగు సాహిత్య పరిశోధన : నాడు నేడు, తెలుగులో పరిశోధన తీరుతెన్నులు, ఈ పాతికేళ్ళ సాహిత్య విమర్శ, తెలుగు సాహిత్య విమర్శలో దేశీయతాన్వేషణ అన్న వారి వ్యాసాలు అన్నీ విమర్శమీది వ్యాసాలే. అధ్యయన శీలురకి బాగా పనికివచ్చేవే. విమర్శకూ పరిశోధనకూ ఉండే భేదాన్నీ అను బంధాన్నీ 18 అంశాలుగా ఎంతో వివరణాత్మకంగా సుబ్రహ్మణ్యంగారు ఈ గ్రంథంలో వింగడించారు. (కవి - కవిస్వామ్యంలో సంపత్కుమారాచార్య గారు పరిశోధన పుట్టుపూర్వోత్తరాల మీద ఒక మంచి Original వ్యాసం రాశారు.) ఇదే గ్రంథంలో వారెంతో శ్రమపడి పాతికేళ్ళ తెలుగు సాహిత్య విమర్శను సమీక్షించి ఇప్పుడు నడుస్తున్నది సమీక్షాయుగంగా తేల్చారు. 5, 6 సం॥లుగా భారతీయ భాషా సాహిత్యాలలో Post Modernism అన్న ధోరణి ఏర్పడిందంటారు వారు. ఈ అంశంమీద ఇంకా వారెంతగానో వివరించాల్సి ఉన్నదనుకోండి. దేశీయతను సాహిత్యంలో గుర్తించి నిరూపించడం, భారతీ యతను తులనాత్మక అధ్యయనం ద్వారా అన్వేషించి వివేచించడం నేటి సాహిత్య విమర్శ కర్తవ్యంగా వారింకో వ్యాసంలో సూచించారు. 'శ్రీనాథల యుగం- మరొక్క చూపు' అన్న సాహిత్య సంపద సంకలన వ్యాసంలో వారు 'శ్రీనాథుడు శృంగారియా?' అన్న విచారణలోని దోషాన్ని పట్టి శ్రీనాథునిది ఎట్లా విశిష్టమైన రసదృష్టియో, శృంగార రసంతోపాటుగా భక్తి, వాత్సల్యాదు లను కూడా చేర్చి శ్రీనాథులెలా కావ్యరచనచేసి విశిష్టమార్గాన్ని ప్రవర్తింపజేశారో ప్రౌఢంగా నిరూపించారు. ఈ సంకలనంలో మంచి విమర్శ వ్యాసా లున్నాయి.

సంపత్కుమారాచార్యగారు తమ కవి- కవిస్వామ్యం అన్న సంకలనంలో అభ్యుదయ కవితోద్యమం మీద వచ్చిన తిరుగుబాటును, భావ కవిత్వం మీద అభ్యుదయ కవిత్వం చేసిన తిరుగుబాటును, నవ్య సంప్రదాయ మార్గం మీదా ఎంతో పరిశోధనా ఫలితంగా సిద్ధాంతాలను ఇమిడిస్తూ గొప్ప వ్యాసాలు రాశారు. 1993 ఈ దశాబ్దంలో మరుపున పడకుండా ఉండటానికి ఈ వ్యాసాలు ఎంతగానో సహాయపడ్డాయి. ఇదే సంకలనంలో వారు యుద్ధకాండ (కల్పవృక్షం) లోని శిల్పాన్ని వివేచిస్తూ రాసిన వ్యాసం మకుటాయమానమైంది. ఇలాంటి వ్యాసాలను వేసికోగల్గిన సాహిత్య పత్రికలు మృగ్యం అని అంటే అది అతిశయోక్తి కాదు. విశ్వనాథవారి శిల్పశక్తిని ఇంతగా ఎత్తిచూపిన రచనలు - చాలా తక్కువ.

అసలు మనకు సాహిత్య విశేషాలపై వస్తున్న విమర్శ వ్యాసాలే తక్కువ. కారణాలు తెల్పడం కష్టం కాదు, విద్వద్విమర్శకులు నేడు వ్రేళ్ళ మీద లెక్క పెట్టగలిగినంతమందికూడా లేరు మధుకళ - (వల్లభాచార్య)లో "శేషేంద్ర ప్రతీకోపనిషత్తు" అన్న వ్యాసం కూడా ఈ సం॥ వచ్చిన మంచి వ్యాసాలలో ఒక్కటి. శేషేంద్ర వాడిన సూర్య అగ్ని సముద్ర అశ్వ పతీకలకు వైదిక మూలాల్ని వల్లభాచార్య ఇందులో చక్కగా చూపారు.

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు జాగృత సాహితి సంకలనంలో 22 వ్యాసాలు రాశారు. కొందరు మహానుభావులు సాహిత్యక్షేత్రంలో లబ్ద ప్రతిష్ఠులు - అలవోకగా మాట్లాడిన నిందార్థాలను గండ్రగొడ్డలితో ఖండించిన వ్యాసాలు ఇందులో కొన్ని. ఇంచుమించు అన్ని వ్యాసాలలోను రెడ్డిగారు సాహిత్యలోకంలో బలవంతంగా తప్పుడు విలువలను చెలామణీ చేయించడానికి పూనుకొన్నవారి ప్రయత్నాలను సాహిత్యపరంగా ఎదుర్కోవడం కన్పిస్తుంది. ఇందులోని చాలా వ్యాసాల్లో పూర్వభాగం ఖండన ఉత్తరభాగం తాను నమ్మిన విలువను ప్రతిపాదించి ప్రతిష్ఠాపించడం కన్పిస్తుంది. కమ్యూనిజం ఆగడం, సాహిత్యంలోని కమ్యూనిస్టుల హిపోక్రసీ, దేశీయతాసాహిత్యసంస్కృతిపై వారి నిందాదృష్టులను రెడ్డిగారెంతో తీవ్రంగా ఈ వ్యాసాలలో ఖండించారు.

కోవెల సంపత్కుమారాచారిగారి షష్టి పూర్తికి ప్రచురించిన 'సాహితీ సంపద'లో వడలి మందేశ్వరరావుగారి 'మహాకావ్యరచనకు కాలం చెల్లిందా?' మంచి వివేచనాత్మకమైన వ్యాసం. ఇదే అంశంపై కవి - కవిస్వామ్యంలో సంపత్కుమారాచార్య, వేరేచోట జి. వి. సుబ్రహ్మణ్యంగారూ చక్కగా చర్చించారు. 'మహా కావ్యం నేటికే కాకుండా మారుతున్న సమాజంలో ఏనాటికైనా అప్పటికి ప్రస్తుతమైనదిగా కనబడాలి' అన్న మందేశ్వరరావుగారి వివేచనకు మూలాలున్నా అది మంచి వివేచనే.

'ఆధునికత - అత్యాధునికత' అన్న సంకలనంలో అఫ్సర్ అజంతా, కుందుర్తి, బైరాగిలపై విమర్శ వ్యాసాలను వెలయించినా ఏ వ్యాసంలోనూ ఆయన ప్రౌఢత చూపలేకపోయారు. నిరూపణలు లేకుండా నిర్ణయాలు

ప్రకటించడమన్న ధోరణి ఇందులో బాగా కన్పిస్తుంది. ఉదాహరణకు క్రింది నిర్ణయాలను చూడండి.

1. ఇటీవలి కాలంలో తెలుగు కవిత్వాన్ని శాసిస్తున్న కొత్త ధోరణుల వేళ్లు నారాయణ బాబు కవిత్వంలోనే వున్నాయి.
2. తెలుగు కథ ఏనాడో కొడవటి గంటి కుటుంబరావుగారి దగ్గరే ఆగిపోయింది.
3. అభ్యుదయ కవిత్వంలో విలువలు క్షీణించిన దశలో తిలక్ కవిత్వమే గొప్ప రిలీఫ్.
4. తెలుగు కవులకి స్వేచ్ఛంగా ఒక అనుభూతిని ఎలా వ్యక్తం చేయాలో నేర్పింది దిగంబరులే.
5. జెండాలు సాహిత్య ఎజెండా నిర్ణయించి, శాసించే దుర్బల పరిస్థితుల్లోనే తెలుగు కథ కన్నుమూసింది.
6. ఆధునిక కవికి శ్రీశ్రీ కన్నా విశాలమైన రాజకీయ అవగాహన ఉంది.

ఇలా శ్రీ అఫర్స్ - నిరూపణ అవసరం వున్నవాటికి కూడా నిరూపణ ప్రయత్నమైనా చేయకుండా అనేక Statements ని చేయడం, ఆధునికత, అత్యాధునికత అన్నవాటిని ఏమాత్రం స్పష్టీకరించకుండా ఒక వ్యాసంరాసి,ఆతని పేరే మొత్తం సంకలనానికి పెట్టడం - చేశారు. స్త్రీవాదం, దళితవాదం వంటి వాదాలు కవిత్వంలోకి రావడమే అత్యాధునికత అని అనుకొన్నాడాయన.

భావుకసీనులో సుప్రసన్నగారి 'నవ్యకవిత్వారంభము' అన్న వ్యాసం గొప్ప పరిశోధక వ్యాసం. వర్తమాన కవిత్వ దర్శనము అన్న వ్యాసం కూడా ఎంతో మంచి వ్యాసం. అభ్యుదయోద్యమం వెనుకన జస్టిస్‌పార్టీ వ్యాపింపచేసిన భావ బీజాలను, ఆంగిలేయుల ధర్మరాజ్యాన్ని వర్ధిల్లాలని కోరిన గురజాడ కవి వారికి ఆదిపురుషుడు కావడాన్ని సుప్రసన్న ఈ వ్యాసంలో చక్కగా తేల్చారు. ఇదే వ్యాసంలో సుప్రసన్న జాతీయ ప్రగతివాద ప్రజాస్వామ్య ధోరణులెట్లా తెలంగాణాలో దాశరథిలో ఆవిష్కారమైనవీ, నవ్య సంప్రదాయోద్యమం, ప్రయోగవాదం ఇత్యాదులను చక్కగా చారిత్రక నేపథ్యంతో వివరించారు. నవ్య

సంప్రదాయోద్యమంలోని చారిత్రక కావ్యాలమీద చక్కని పరిశీలనాత్మక వ్యాసం కూడా ఇందులో సుప్రసన్న రచించారు.

ఒకే రచనమీద విమర్శ గ్రంథాలు విడిగా రావడం అంతగా జరగడం లేదు. విశ్వవిద్యాలయాలలో పరిశోధనలు చేసే విద్యార్థులు మాత్రమే అట్లాంటి విమర్శనలను డిగ్రీలకోసం రాస్తున్నారు.

శ్రీ భూమయ్య రాసిన 'మాలపల్లి - ఆధునిక మహాకావ్యం' లాంటివి ఒకటి రెండున్నాయి. వేమన్నది నాథ సంప్రదాయమని నిరూపిస్తూ వేమన్నమీద ఎం. సుజాతరెడ్డిగారు రాసిన గ్రంథం కూడా ఇలాంటిదే. కాని ఇందులో ఆమె సాహిత్యాంశాలను తక్కువగానే పరామర్శించింది.

వడలి మందేశ్వరరావుగారు రచించిన 'సాహిత్య తత్త్వవివేచన', కొండిపర్తి శేషగిరిరావుగారి 'సమన్వయ స్వరాలు', ముదిగొండ వీరభద్రయ్య రాసిన కళాతత్త్వశాస్త్రం మౌలికాంశ వివేచన అన్న గ్రంథాలు విమర్శ సూత్రాలకు మూలంగా ఉండే Aesthetics శాస్త్రానికి సంబంధించినవి. సాధన పత్రికలో మందేశ్వరరావుగారు అరిస్టాటిల్, ప్లాటోల మీద రాసిన వ్యాసాలు కూడా Aesthetics విభాగంలోకే చేరుతవి. ఆంధ్రప్రభ దినపత్రికలో రా.రా. మార్గం అన్న పుస్తకంమీద అద్దేపల్లి రామమోహనరావుగారు రాసిన సమీక్ష చాలా మంచి సమీక్ష. రా.రా. ని సమీక్షకునిగానే ఆయన నిర్ణయించాడు. చందు సుబ్బారావు దాన్ని ఖండిస్తూ రాసినప్పుడు దానిమీదట అద్దేపల్లి విమర్శకు - సమీక్షకు ఉండే భేదాలను తెలిపాడు.స్పష్టంగానే ఉన్నప్పటికీ అవి సమగ్రంగా లేవు.ఈ విషయంపై తెలుగులో ఇంకా కృషి జరగాల్సే ఉన్నది.

చివరగా ఒకమాట. వాద ప్రతివాద విమర్శలు సంపాదకుల దయాదాక్షిణ్యాల మీదనే ఆధారపడ్తున్నాయి. సంపాదకుల పక్షపాత దృష్టిచేత ఆ రంగంలోకి దిగడానికి పెద్దలు భయపడ్తున్నారు. ఇట్లాంటి ఒక సన్నివేశాన్ని వల్లభాచార్యులు తన మధుకళలోని 'ఇవీ సంగతులు' అన్న పీఠికలో శ్రీ జి. శ్రీరామమూర్తి అనే సంపాదకుడు చేసిన ఘనకార్యాన్ని వివరంగా తెల్పుతూ చివరగా "నేటి పత్రికలలోని కొందరు 'సంపాదక' శబ్ద వాచ్యుల పాత్రికేయ మూల్యాలు

ఇలా ఉన్నాయని వెల్లడించడానికి, సన్నిహితులకు వివరించడానికే ఇదంతా చెప్పవలసి వచ్చింది. ఇలాటి 'రాజకీయక్రీడ'కు నిరసనగానే నేను ఆంధ్రపత్రిక నుండి బైటకు వచ్చాను' అని రాశారు. వాద ప్రతివాదాలు **sensation** కి ప్రాధాన్యాన్నిచ్చినంతగా విషయానికివ్వడం లేదు. వస్తు చర్చలు ప్రాధాన్యం వహించినంతగా శిల్పం, సాహిత్యత్వంమీద వ్యాసాలుకాని చర్చలుకాని మృగ్యం.

మరొక్కమాట. అన్ని విమర్శ వ్యాసాలు కవిత్వం మీదనే వస్తున్నాయి. కథలమీద, నవలలమీద లేవనే చెప్పాలి. వల్లభాచార్యులు ఒక్క వ్యాసాన్నేదో రాశారు. అదీ సంతృప్తికరంగా లేదు. ఆనందారామంగారు రావిశాస్త్రిగారి భాష మీద రాసిందేకాని ఆయన కథలమీద రాయలేదు. ఇంకా ఏవైనా వచ్చాయేమో నాకు తెలియదు. రావిశాస్త్రిగారి బుక్కులు మీద మార్క యాదయ్య రాసిన సిద్ధాంత గ్రంథం ఎంతో గొప్పగా ఉన్నది. అనుసరించిన **technique** మాత్రం కవిత్వాన్ని విశ్లేషించే పద్ధతి. ఎంతో గొప్పగా అతను రచయిత హృదయాన్ని తన విశ్లేషణలో ఆవిష్కరించాడు. నవలలమీద సెప్టెంబరు (93) అరుణతారలో రాగో నవలను సమీక్షిస్తున్న వ్యాజంతో బాలగోపాల్‌గారు రాసిన "చరిత్ర, మనిషి, మార్క్సిజం" అన్న వ్యాసం మంచి వివేచనాత్మకమైన వ్యాసం. శాశ్వతమైన మానవ ప్రవృత్తి అంటూ ఏదీలేదని చెప్పే మార్క్సిజంను ఆ మేరకు ఖండించి అన్ని కాలాల్లో బలంగాఉండే కొన్ని లక్షణాలు మానవ ప్రవృత్తిలో ఉన్నాయని, దీన్ని గమనించక పోవడంవల్లనే మార్క్సిజం చాలా నష్టపోయిందనీ ఈ వ్యాసంలో బాలగోపాల్‌గారు ప్రతిపాదించారు. 'మనిషి'ని గురించి కొన్ని పడికట్టు సూత్రాలు జేబులో పెట్టుకొని, ఎదురయిన ప్రతి ప్రశ్నకూ రెడీమేడ్ జవాబులు చెప్పే కమ్యూనిస్టుల పద్ధతిని కూడా వారీ వ్యాసంలో ఖండించారు. సమసమాజ ధ్యేయం భౌతిక పరిస్థితుల నుండి కొన్ని వర్గాలలో అనివార్యంగా పుట్టే అసంకల్పితమయిన ఆకాంక్షగా అర్థం చేసికోవడం మార్క్సిజం మొద్దుబారడానికి ఏర్పడిన కారణాలలో ఒకటిగా వారు వివేచించారు. పీడిత ప్రజలు పీడకులపైన పోరాటాలు చేసినంత మాత్రంలో సమష్టి సహజీవన లక్ష్యాన్ని సాధించలేరనీ ప్రతి ఒక్క వ్యక్తి తన మీద తాను పోరాటం చేసికొన్నప్పుడే అది సాధ్యపడుతుందనీ, ఇప్పటివరకు మార్క్సిస్టులు ఇలాంటి 'మానవ ప్రవృత్తి' అన్నది ఒకటి ఉన్నదనే ఒప్పుకోలేదనీ బాలగోపాల్‌గారు ఈ వ్యాసంలో అన్నారు. మొత్తానికి ఈ వ్యాసం సాహిత్య

పక్షాన్ని - అంటే రాగో నవలని ఎక్కువగా విమర్శించకపోయినా, దాన్ని ఆధారంగా చేసికొని మార్క్సిజం యొక్క మౌలిక వివేచనను సామర్థ్యంతో చర్చకు తెచ్చింది.

ద్వానాశాస్త్రి, కడియాల రామమోహనరాయ్‌గారలు కాలెండర్ సంవత్సరం ముగియగానే పత్రికలలో ఆ వెనుక సంవత్సరంలో వచ్చిన వ్యాసాల సూచి నొకదాన్ని నిర్దుష్టంగా సిద్ధంచేసి ప్రచురిస్తూ ఉంటారు. అన్ని వ్యాసాలను చదవకున్నప్పటికీ, నేను చూసినంతలో డా॥ రెంటాల వేంకటేశ్వరరావు గారి 'కవిత్వంలో అస్పష్టత అవసరమా?.... అనివార్యమా?' అన్న వ్యాసం, పేరాల భరతశర్మగారు సాహిత్య ప్రాణంమీద రాసిన వ్యాసం, కల్లూరివారి 'మళ్ళీ కాల్పనికతవైపు' అన్న వ్యాసం, జి.వి.ఎస్. గారు రాళ్ళపల్లి వారి మీద (మధుర వ్యంగ్య శైలి) రాసిన వ్యాసం మంచి వ్యాసాలు. తమ వ్యాసంలో రెంటాలవారు "తెలుగు కవిత క్లిష్టతమీదుగా అస్పష్టతకు ప్రయాణించింది. పరోక్షతలోనూ, ప్రతీక కల్పనలోనూ, 'అతి', అజాగ్రత్తా ఉన్నప్పుడు అస్పష్టత ప్రవేశిస్తుంది. పరోక్షత ప్రత్యక్షతను సూచించి తీరాలి. కవి వస్తువును స్పష్టంగా చూడలేక పోయినప్పుడు ఇమేజరీ, రిఫ్లెక్షనూ రెండూ అస్పష్టంగానే ఉంటాయి. పాఠకునికి అర్థంకాని కవిత వ్యర్థమౌతోందని కవులందరూ గుర్తించటం మంచిది" అని అభిప్రాయపడ్డారు. చాలా ప్రయోజకమైన ప్రతిపాదన ఇది. అసలు మహాకవిత్వ శక్తి ఉన్నవాళ్ళల్లో ఈ సమస్యే లేదుకూడా.

ఇట్లాగే పేరాల భరతశర్మ గారు తమ వ్యాసంలో- "సాహిత్యం 'శరీరం'లో లేదు. ప్రాణంలో ఉంది. సాహిత్యస్రష్ట అయిన ప్రతివాడూ సమాజాన్ని తనలో ప్రతిబింబింప చేసుకుంటే అది రసత్వ సిద్ధి చెందినప్పుడే సమాజ హృదయాన్ని స్పందింపచేస్తుంది. సమాజాన్ని కదిలిస్తున్న కవుల గళాలు ఎప్పుడోగాని, ఎక్కడోగాని వినిపించడంలేదు" అని రాసిన మాటలు రచయితలు తప్పక గమనించాల్సినవి.

పద్య కవిత్వం మీద చెలరేగిన వాదోపవాదాలను ఒకరకంగా summing up చేసినట్లుగా రాసిన సి.వి. కృష్ణారావుగారు (ధ్యేయంలేని ప్రక్రియ ఉద్యమం కాదు.) వచన కవిత్వ ఉద్దేశ్యానికి కాస్త అతివ్యాప్తిని కల్గించారు. పీడిత వర్గ

విముక్తి ధ్యేయంగా వచన కవిత్వ ప్రక్రియ సాగిందంటారు వీరు. కుందుర్తి రాసిన హంస ఎగిరిపోయింది, సుప్రసన్న రాసిన శతాంకుర ఇత్యాదులన్నీ వచన కావ్యాలే మరి!

'విమర్శ వ్యాసాలు' పుంఖానుపుంఖంగా వచ్చినట్లుగా అనిపిస్తున్నప్పటికీ, వాటినన్నింటినీ విమర్శ వ్యాసాలనడం కష్టమే. కొందరు విమర్శకులు ప్రిజుడిసెస్ మీద నిజాయితీగానే రాసికొన్నారు! అలాంటప్పుడు సద్విమర్శ ఎట్లా వస్తుంది? అందువల్లే సుమనశ్రీ, కనపర్తి రామచంద్రాచార్యులు, యార్లగడ్డ రాఘవేంద్ర రావు, గన్ను కృష్ణమూర్తి, ఆదూరి సత్యవతి ఇత్యాది కవులు విమర్శకమ్మన్యుల చేత నిర్లక్ష్యం చేయబడుతున్నారు.

విమర్శకుండే మౌలికాంశాలను పట్టించుకోకుండా రాసే విమర్శలు విమర్శలు కావు. సాహిత్య విమర్శ - పచ్చిపులుసు విమర్శ ఒకటి కావన్న శ్రీశ్రీ మాటలు గొప్ప మాటలు. ఇవేళ వస్తున్న విమర్శ వ్యాసాలలో విశ్లేషణ ఉండదు. తులనాత్మక పరిశీలన అసలే ఉండదు. ఇక ఉండేదేమిటంటే- పుంఖానుపుంఖంగా నిర్ణయాలు! ఇలాంటి వ్యాసాలకే ఎక్కువ స్థానం ఇస్తున్నారు సంపాదకులు. సంపాదకులకి విమర్శమీద సరియైన అవగాహన లేకపోవడం, విమర్శ రాయబడిన గ్రంథాల విషయం వారికి బొత్తిగా తెలీకపోవడం, Sensationని కోరడం వంటివి ఇందుకు కారణాలు కావచ్చును. 1994 లోనైనా మంచి విమర్శ వస్తుందని ఎదురుచూద్దాం. ఈ సంవత్సరమైనా శేషేంద్ర, శివారెడ్డి, సుమనశ్రీ ఇత్యాది సత్కవుల మీద సరైన విమర్శలు శాస్త్రీయమైన పద్ధతులతో వస్తాయని ఆశిద్దాం.

# 1993 లో వెలువడిన మంచి పుస్తకాలు

డా॥ ద్వా. నా. శాస్త్రి

ప్రతి సంవత్సరం తెలుగులో కొన్ని వందల పుస్తకాలు వెలువడుతుంటాయి. అన్ని పుస్తకాలూ విలువైనవే అనలేం. వాటిల్లో విశిష్టమైనవి, విలువైనవి; విలక్షణమైనవి కొన్ని మాత్రమే ఉంటాయి. 1992 లో కంటే '93 లో వైవిధ్యం గల పుస్తకాలు ఎక్కువగా వెలువడటం విశేషం. తెలుగులో నవలలు ఎక్కువ సంఖ్యలో వెలువడుతూ ఉంటాయి. వాటిల్లో కొన్ని పత్రికలలో ప్రచురితమైనవి కాగా ఎక్కువగా "డైరెక్టు" నవలలే వెలువడుతుంటాయి. నవలల తరువాత కవితా సంపుటాలు విరివిగా వెలువడుతుంటాయి. కథా సంపుటాలు, విమర్శ గ్రంథాలు ఎప్పుడూ తక్కువే. హాస్య గ్రంథాలు, అనువాద గ్రంథాలు మరీ తక్కువ. 1993 లో వెలువడిన వివిధ గ్రంథాలలో కొన్ని మంచి వాటిని గురించి తెలుసుకుందాం ఇందులో పేర్కొనబడని మంచి పుస్తకాలు కూడా ఉండవచ్చు. ఈ వ్యాసం సింహావలోకనం మాత్రమే.

## పొయెట్రీ వర్క్‌షాప్ :

గత సంవత్సరంలో వెలువడిన విలక్షణమైన గ్రంథాలలో 'పొయెట్రీ వర్క్‌షాప్' ప్రథమ స్థానం సంపాదిస్తుంది. ఇంగ్లీషు పేరు పెట్టడం సముచితంగా కనిపించకపోయినా ఇటువంటి గ్రంథం తెలుగులో రావడం ఇదే మొదలు కాబట్టి దీన్ని పేర్కొని తీరాలి. 1862-1962 మధ్య గల శతాధిక తెలుగు కవుల చేతి రాతల కవితా సంకలనమే "పొయెట్రీ వర్క్‌షాప్." దీనిని డాక్టర్ ఏటుకూరి ప్రసాద్‌గారు చాలా శ్రమపడి సంకలనం చేశారు. ఈ సంకలనంలో నాటి గురజాడ నుంచి నేటి యాకుబ్ వరకు గల కవుల చిత్తు ప్రతుల్ని - వాటి సాపు ప్రతుల్ని ఆయా కవుల ఫోటోలతో సహా చూస్తాం. అయిదారుగురు కవుల్ని అనవసరంగా చేర్చారనిపించవచ్చు ఏమైనా సాహితీ ప్రియులకు వంద రూపాయలకి తరతరాలు నిలిచే అపూర్వ గ్రంథాన్ని అందించిన విశాలాంధ్ర ప్రచురణాలయం,

అరసం, శ్రీశ్రీ స్మారక సంస్థలవారు అభినందనీయులు. విశాలాంధ్ర ప్రచురణాలయం వారే తెలుగు కవుల, రచయితల విశిష్ట ఫోటోలతో, సంగ్రహ వ్యాఖ్యతో "అక్షర చిత్రాలు" అనే మరో విలక్షణ గ్రంథాన్ని ప్రచురించి, ఇరవై అయిదు రూపాయలకి అందించారు. విద్యారంగంలో అపారమైన అనుభవం సంపాదించిన డాక్టర్ కోటీశ్వరమ్మగారు "మీ పిల్లల్లోని సహజ మేధాశక్తిని ఎలా మేల్కొల్పాలి?" అనే మంచి పుస్తకం రచించారు. పిల్లల్లో సృజనాత్మక శక్తిని, అభ్యాసనా పటిమని ప్రోత్సహించి పెంపొందించడానికి మానసిక శాస్త్రం, సాంఘిక శాస్త్రం ఆధారంగా తల్లిదండ్రులకి చక్కని గుణపాఠంగా రాయబడిన ఈ పుస్తకం ధర డెబ్బయి అయిదు రూపాయలు. అయితే ఏం - మూడు వందల ముప్పయి పేజీల ఆలోచనాత్మకమైన గ్రంథం మరి!

శేషేంద్ర "ఆధునిక కవితా సంపుటాలు - మహాభారతం" కావ్యానికి అనుబంధంగా "జనవంశమ్" అనే కావ్యాన్ని వెలువరించారు.

"రైలెక్కించడానికే గానీ
మనతో రైల్లో ప్రయాణాలలో
నాన్నెందుకు రాడే?"
వాడిగా సూటిగా
మళ్ళీ పసిదాని సందేహం
ఉన్నపనులు ఎగవెయ్యడంకోసం
కొత్తపనులు సృష్టించుకుంటూ
తప్పించుకుందికే తమతో
నాన్నలనేవాళ్ళు రారని చెప్పలేదావిడ"

అంటూ ధిక్కార స్వరంతో స్త్రీ చైతన్య కవిత్వం రాసే జయప్రభ '93 లో "యశోధరా, ఈ వగపెందుకే?" అనే మంచి కవితా సంపుటిని ఇరవై అయిదు రూపాయలకే అందివ్వడం అభినందనీయం. స్త్రీ వాద కవితలలో మంచివి ఏరి "నీలి మేఘాలు" అనే కవితా సంపుటిని వెలువరించారు. చేరా దీనిని ఈ శతాబ్దంలో రెండవ గొప్ప కవితా సంకలనమని అతిశయోక్తి పలికారు. ఇది గొప్ప సంకలనం అనడంలో సందేహం లేదు. హెచ్చార్కె "అబద్ధం", జూకంటి జగన్నాథం "పాతాళ గరిగె", వేగుంట "పునరపి', అకెళ్ళ

"ఓ కొత్త మహంజదారో", శ్రీరాములు "వయోలిన్ రాగమో, వసంత మేఘమో", గోపి "వంతెన" వచన కవితా సంపుటి, విన్నకోట రవిశంకర్ "కుండీలో మర్రిచెట్టు" పేర్కొనదగిన కవితా సంపుటాలు. ఇంకా ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా అమెరికాలోని తానా సంస్థ వారు ప్రచురించిన "మచ్చు తునకలు", నెల నెలా వెన్నెల వారి మూడవ కవితా సంకలనం 'డిసెంబర్ 6' కంజిర కూడా చదవదగినవే. నాగభైరవ మాత్రా ఛందస్సులో 'కన్నెగంటి హనుమంతు' కావ్యం రచించారు. '93 లో మంచి పద్య కావ్యం వెలువడలేదని తెలుస్తోంది. అజంతా "స్వప్న లిపి" కవితా సంపుటిని అందంగా ఖరీదుగా తీసుకొచ్చిన త్రిపురనేని శ్రీనివాస్ అభినందనీయులు.

ఆచార్య కోవెల సంపత్కుమార గారి షష్టిపూర్తి సందర్భంగా సుప్రసన్నాచార్య గారి ప్రధాన సంపాదకత్వంలో వెలువడిన "సాహితీ సంపద"లో ఉత్తమ విమర్శ వ్యాసాలున్నాయి. దాదాపు ముప్పయి వ్యాసాలతో వైవిధ్యంతో కూడు కొన్న ఈ గ్రంథం నూట ఇరవై అయిదు రూపాయలయినా - విలువగల గ్రంథమే. తిరుమల రామచంద్రగారి గ్రంథాలు మూడు వెలువడ్డాయి. ఆ మూడూ ఉత్తమమైనవే. ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ గారు తమ బహుముఖ పాండిత్యాన్ని పరిశోధనకి జోడించి "తులనాత్మక సాహిత్యం" అనే వ్యాస సంకలనం వెలువరించారు.

తమిళ, మలయాళ సాహిత్యాలతో తెలుగు సాహిత్యాన్ని పోలుస్తూ రాయబడిన ఈ గ్రంథం తెలుగు సాహిత్యంలో విశిష్టమైన గ్రంథం. వల్లభాచార్య వాడిగా, సూటిగా, నిష్కర్షగా సంధించిన విమర్శనాస్త్రాలను "మధుకళ" అనే గ్రంథంలో పరిశీలించవచ్చు. కేవలం ఇరవై అయిదు రూపాయలకు సరికొత్త వ్యాసాలు చదవవచ్చు. మెదడుకు పదును పెట్టుకోవచ్చు. "చర్విత చర్వణవాదం ఎందుకు?", "అర్థతాత్పర్యాలు కూడా చెప్పాలా?", "పద్యానికి తాళంట" వంటి విలక్షణ వ్యాసాలు మధుకళలో కనబడతాయి. విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తిని చక్కగా విశ్లేషిస్తూ లక్ష్మణ యతీంద్రులవారు "ఆంధ్రప్రశస్తి - సమీక్ష" అనే మంచి పుస్తకం రచించారు. దీని వెల పది రూపాయలు మాత్రమే. ప్రసిద్ధ విమర్శకులైన వడలి మందేశ్వర రావు గారు "సాహిత్య తత్త్వవివేచన" అనే వ్యాస సంపుటి వెలువరించారు.

ఇందులో సాహిత్య తత్త్వం, సాహిత్య ప్రయోజనం, కావ్య సృష్టి, కావ్య విలువలు అనే అంశాలపై చర్చ జరిగింది. డాక్టర్ వి. చక్రపాణిరావు మొల్ల రామాయణం మొల్ల రాయలేదని నిరూపిస్తూ "సాహిత్య సుదర్శిని" రచించారు. అఫ్సర్ రాసిన "ఆధునికత-అత్యాధునికత" వ్యాస సంపుటి వివాదాస్పదంగా నిలిచింది. పొయెట్రీ ఫోరం (తెనాలి) వారు ప్రచురించిన ఈ వ్యాస సంపుటిలో "వైరుధ్యాల పంజరంలో అజంతా" "అత్యాధునికత", "కవిత్వంలో సంక్లిష్టత'', ''మాతృభాష వెతుక్కుంటున్న తెలుగుకవిత్వం'' వంటి విశిష్ట వ్యాసాలున్నాయి. పన్నెండు రూపాయల తక్కువ ధరలో దొరుకుతున్న ఆలోచనాత్మకమైన విమర్శ గ్రంథం ఇది.

మరికొన్ని మంచివి....

విశ్వవిద్యాలయాలకి సమర్పించబడిన సిద్ధాంత వ్యాసాలలో మంచివి, 'ఒరిజినాలిటీ' ఉన్నవి చాలా తక్కువే ఉంటాయి. ఆ తక్కువలో మంచిగ్రంథం ''తెలుగు సినిమాపాట'' తొంభై అయిదు రూపాయలు వెల గల ఈ సిద్ధాంత వ్యాసాన్ని పైడిపాల మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించి పిహెచ్.డి. పొందారు. సినిమా పాటలపై సాధికారికంగా పరిశీలించిన గ్రంథం ఇది. డాక్టర్ పవని ఆర్. హరినాథ్ విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని బాల కాండలో గల ఛందోవస్తు శిల్పం మీద రచించిన సిద్ధాంత గ్రంథం కూడా విలువైనదే - (ఇందులో విశ్వనాథవారిపై అభిమానం శృతి మించినాగాని.) అన్నమయ్యపై పరిశోధన చేసిన డాక్టర్ పొన్నా లీలావతమ్మ ఏభై వ్యాసాలతో "పదకవితా వైజయంతి" అనే మంచి గ్రంథం ప్రచురించారు. '93 లో వెలువడిన మంచి కథల సంపుటి ఒకటి, మంచి కవితల సంపుటి ఒకటి వెలువడటం చెప్పుకోదగిన విశేషం

కె.వి. రమణారెడ్డిగారి ''ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర'', సంపత్కుమారగారి "కావ్యం - కవిస్వామ్యం", వావిలాల సుబ్బారావుగారి ''చలంగారి కథానికా సాహిత్యము - అనుశీలనము'', పి.వి. రమణగారి ''పాశ్చాత్య సాంఘిక నాటకం - ప్రభావం'' అనే విమర్శ గ్రంథాలు సద్విమర్శ కలిగి ఉన్నాయి.

శ్రీపాద, బుచ్చిబాబుల కథాసంపుటాలు పునర్ముద్రణకి నోచుకున్నాయి. చంద్రశేఖర ఆజాద్ ''రోడ్డు మీద గులాబి'', ఎం. ఎస్. సూర్యనారాయణ 'ఆరోహణ', పొనుగోటి కృష్ణారెడ్డి కథలు - కథా సాహిత్యంలో చెప్పుకోదగినవి. మహీధర రామమోహనరావుగారు 'జ్వాలాతోరణం' అనే గొప్ప నవల రాశారు. డాక్టర్ ఆర్.వి.ఎస్. సుందరం ''భావన'' అనే యాత్రా సాహిత్య ప్రక్రియను కొత్తగా రచించారు. సౌభాగ్య ''వజ్రశకలం'', గోపాలచక్రవర్తి ''నవ్వు గోపాలం'' చదవదగినవి. ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు వాల్మీకి రామాయణాన్ని పూర్తిగా రెండు సంపుటాలలో వచనంగా అందించారు. '93 లో తెలుగు సాహిత్యం చైతన్యవంతంగానే ఉందనటానికి ఈ పుస్తకాలే సాక్ష్యం.

(ఆదివారం ఆంధ్రప్రభ 6-2-1994
సాహితీలతలో ప్రచురితం - ఆంధ్రప్రభ సౌజన్యంతో)

# 1993 లో తెలుగు కవితా వికాసం

—డా॥ కడియాల రామమోహన్ రాయ్

1993 వ సంవత్సరపు తెలుగు కవిత్వంలో ఆనందప్రదమైన వైవిధ్యం కన్పిస్తున్నది. స్త్రీవాద కవిత్వం, దళిత కవిత్వం పాఠక హృదయాలను రస ప్లావితం చేశాయి. జీవితపు చీకటి కోణాలపై వెలుగును ప్రసరింపజేయటంలో, బడుగుజీవుల బతుకు వెతలను వెల్లడించటంలో కవులు తమ బాధ్యతను గుర్తించి నట్లు తోస్తుంది.

భారతదేశాన్ని విషాదంలో ముంచెత్తిన మహారాష్ట్ర భూకంపం తెలుగు కవుల హృదయాలను కదిలించి కరుణరసభరితమైన కవితలను పలికించింది.

సారా వ్యతిరేకతను తెలిపే కవితల్లో ఎక్కువ భాగం ప్రచార ధోరణిలో వున్నప్పటికీ కొన్ని కళాత్మకంగా కూడా భాసించాయి.

పద్య కవిత్వానికి మళ్ళీ ఆదరాన్ని చేకూర్చే ప్రయత్నం జరిగింది. తెలుగు పద్యంలో కన్పించే లయ, నాద మాధుర్యం వచన కవిత్వంలో కానరావటంలేదని కవిత్వం పలచబడిపోతున్నదని కొందరు ఆవేదన చెందారు. పద్య కవిత్వం విరివిగా రావలసిన అవసరాన్ని కవిత్వాభిమానులు రాజమండ్రి, వరంగల్లు, విజయవాడలలో జరిగిన సదస్సులలో నొక్కి చెప్పారు. కవిత్వరూపం పద్య మైనా, వచన కవిత్వమైనా ఆస్వాదించటానికి పాఠకలోకం సిద్ధంగా వున్నది.

విప్లవ కవులు ప్రతిహింస అనివార్యమని తెలిపే కవితలు, ఎన్‌కౌంటర్ లకు నిరసన తెలిపే కవితలు రచించారు.

రాయలసీమ ప్రజల కన్నీటి గాథలను, బాంబుల సంస్కృతిని, తెలంగా ణలో పోలీసు కేంపులు, నక్సలైట్లవల్ల ప్రజలు పడుతున్న బాధలను కవితలు ప్రతిబింబిస్తున్నాయి. మానవ సంబంధాలను తెలిపే కవితలు ఈ యేడాది

పుష్కలంగా వచ్చాయి. అమ్మ, బాల్యం, పుత్రవాత్సల్యం, యవ్వనావిర్భావం, ప్రేమలో పడటం, గర్భవతుల మానసిక అనుభూతులు, వృద్ధాప్యాన్ని నిర్లక్ష్యం చేస్తుండటంపట్ల తీరని బాధను కవులు వ్యక్తం చేశారు.

**సాహితీవేత్తల మరణం :** మహా రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి మరణం సాహిత్యాభిమానులకు తీరని దుఃఖం కలిగించింది. కథానికను ఖండ కావ్యానికి దీటుగా కవిత్వ శక్తితో నడిపించినవారు రావిశాస్త్రి.

ఇంకా ఈ సంవత్సరం ప్రసిద్ధకవులు అబ్బూరి వరద రాజేశ్వరరావు కాలధర్మం చెందటం, అలిశెట్టి ప్రభాకర్ అకాల మరణం కవిత్వాభిమానులకు బాధాకరమైనాయి. ప్రసిద్ధ సాహిత్యవేత్తలు దేవులపల్లి రామానుజరావు, డి. రామ లింగం, సాహం, వద్దాది సీతారామాంజనేయులు, చక్రవేణు, మంథా వెంకట రమణరావు, మేకా సుధాకరరావు, భావరాజు నరసింహారావుల మరణాలు సాహిత్యాభిమానులకు వేదనను కలిగించాయి.

తెలుగు పాఠకులు చిరకాలంగా ఎదురుచూస్తున్న కవి అజంతా కావ్య సంపుటి స్వప్నలిపి ఈ ఏడాది పుస్తక రూపంలో వచ్చింది.

"మనిషి ఎక్కడ వున్నా ఒకడే. పృథ్వీతలంపై మనిషి అడుగుల చప్పుడు వినబడిన తొలిక్షణం నుంచి మనిషి అంతరాత్మ ఒక్కటే."

"భయవిభ్రమాల మధ్య విషాద వాక్యంవలె సాగే జీవితంలో మృత్యువు ఒక్కటే నిజం" అని తలచిన అజంతా కవితలన్నీ ఏదోవిధంగా మృత్యువుతో ఆయన సాగించిన ఎడతెగని సంభాషణతే.

'అగ్నిస్పర్శ,' 'సుషుప్తి', 'చెట్లు కూలుతున్న దృశ్యం', 'స్వప్నలిపి', 'కిటికీ ఆవల', 'రాజకీయ ఘస్మరుడు' కవితలు తెలుగులో 'ముక్తకవిత' గౌరవాన్ని ఇనుమడింప చేస్తున్నాయి.

**అబ్బూరి కవితా సంచిక :** సుప్రసిద్ధ కవి అబ్బూరి వరద రాజేశ్వర రావు సర్వ కవితల సంపుటి 'కవితా సంచిక.'

శ్రీ వరద ఛందోరహితమైన కవిత్వాన్ని ఇష్టపడలేదు. "ప్రకృతి ప్రతి బింబమే ఛందస్సు. ప్రకృతికి ప్రతిస్పందన కవిత్వం'' అని వరద విశ్వాసం. సాహిత్యంలో ఉద్యమాలకు ఆస్కారం లేదని ఈయన ఉద్దేశం.

కవితనొక తపస్సుగా భావించిన వరద మరణానందర జీవితాన్ని నమ్మ లేదు. హాసోపహాసాలతో జీవితాన్ని ఆనందంగా గడిపి, నవ్వుల్ని పంచియిచ్చి నిష్క్రమించారు. కవన కుతూహలం, కవితాసంచిక తెలుగు సాహిత్యానికి ఆయన ఇచ్చిన విలువైన కానుకలు.

**ఈ సంవత్సరం వచ్చిన ఉత్తమ కావ్యాలు :**

స్త్రీ చైతన్యాన్ని ధిక్కార స్వరంతో విన్పిస్తున్న కవయిత్రి జయప్రభ. ఈమె రచించిన "యశోధరా ఈ వగపెందుకే?" కావ్య సంపుటిని ఈ సంవత్సరం వచ్చిన కావ్యాలలో ఉత్తమమైనదిగా తలచవచ్చు.

'అమ్మమ్మ స్వగతం' అనే గీతంలో "అమ్మడూ/ఎనభై యేళ్ళ నా బతుకులో నా దిగులు తీరింది రెండుసార్లు, రెండే రెండుసార్లు/ఒకటి మా అత్తగారు పోయినప్పుడూ, రెండు మా ఆయన పోయినప్పుడూ" అనటం వెనకాల ఒక నిస్సహాయురాలి ఆర్తిని గుండెలు కదిలిపోయేలాగ వర్ణించారు.

గౌతమ బుద్ధుని భార్య యశోధరను సంబోధించి జయప్రభ "యశోధరా ఈ వగపెందుకే/వారు బౌద్ధులు, తాపసులు/చింతలంటవు వారిని/జరామృత్యు భయాలుండవు/సరిగ్గా బోధివృక్షం కిందే జ్ఞానోదయం అవుతుందని వారికి ముందే తెలుసు/.... నువ్వు మాత్రం/ అలా చుక్కలని చూడకే/యశోధరా/ నువ్వింక త్యాగాలు చేయకు" అనటంలో తరతరాలుగా స్త్రీ జాతికి జరిగిన అక్రమాలపై ఆక్రోశం ప్రకటించారు.

ఈ సంపుటిలో 'నాన్న లెందుకు రారని?' 'సవాలక్ష సందేహాలు,' 'తాచుల రేచుల ధనంజయుల ఆజ్ఞాపనలో' 'అగ్ని గర్భ ధరిత్రిని,' 'బహుళ చతుర్దశి రాత్రి,' 'నీల కాంతిలా దిగులు,' 'నిద్రా రావే' లాంటి ఉత్తమ కవితలున్నాయి.

**అబద్ధం :** విప్లవ కవిత్వం కొంత వెనుకంజ వేసిన దశలో, రష్యాలో తూర్పు యూరోపు దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూలిపోయిన కాలంలో మార్క్సిజం అజేయం అనే అచంచల విశ్వాసంతో శ్రీ హెచ్చార్కె రచించిన కవితల సంపుటి 'అబద్ధం.' హెచ్చార్కెలో కనిపించే ఆత్మ విమర్శ చాలామంది విప్లవ కవులలో కన్పించదు.

శ్రీ ఇంద్రవెల్లి రమేష్ రచించిన ప్రమాద సంగీతం' శ్రీ జూకంటి జగన్నాథం రచించిన 'పాతాళగరిగె' విప్లవ కవితా మార్గంలో వచ్చిన మరి రెండు కావ్య సంపుటాలు,

**సంకలనాలు:** ఒకే అంశంపై వివిధ కవుల కవిత్వాల సంకలనాలు,పలు రకాల కవితలను పుష్పగుచ్ఛంలా చేర్చిన సంకలనాలు ఈ సంవత్సరం విరివిగా వచ్చాయి.

1992 డిసెంబరు 6 వ తేదీ సంఘటనపై 'కంజీర' వారి కవితా సంకలనం, స్త్రీవాద కవయిత్రుల సంకలనం 'నీలిమేఘాలు', భూకంప బాధితుల కోసం కన్నీటి కానుక 'బాష్పాంజలి' ఇంకా 'నెలానెలా వెన్నెల'-హైదరాబాదు వారి మూడవ కవితా సంకలనం, కవుల రాతతో చిత్రప్రతికి మేల్ప్రతికి తేడాను చూపించిన 'పోయిట్రీ వర్క్‌షాప్' సంకలనం, తానా (యు.యస్.ఏ.) వారి తెలుగు కవితా సంకలనం 'మచ్చుతునకలు' వీటిలో ప్రసిద్ధమైనవి.

'6 డిసెంబరు, 1992' : 'కంజీర'

అయోధ్యలో జరిగిన దుస్సంఘటనపై ఆగ్రహాన్ని వెల్లడించే కవితల సంకలనం 6 డిసెంబరు 1992 వీటిలో కవులు మతోన్మాదంపై రకరకాలుగా తమ నిరసనను తెలిపారు.

**నీలిమేఘాలు :**

స్త్రీ వాద దృక్పథంతో రచించిన ముప్పై యొక్క మంది రచయిత్రుల కవితల సంపుటి నీలిమేఘాలు.

కవయిత్రులు తమ శరీర ధర్మాలను - బహిష్టు. ప్రసవం వంటి ఇబ్బందులపై ఆక్రోశాన్ని ప్రకటించటం, కొన్నిచోట్ల చదువరులను షాక్‌చేసే విధంగా అశ్లీల పదాలను వాడటం, స్త్రీ ఎదుర్కొనే కష్టాలకు సామాజిక సమస్యలు కారణమని తలచక, పురుషులే అన్నిఅనర్థాలకు మూలకారణమని భావించడంతో కొన్ని సంచలనాత్మక రచనలు చేశారు. స్త్రీ నోరెత్తడమే అపరాధమనే రీతిలో కొందరు అభ్యుదయ విప్లవవాదులనుకొనేవారు. నిందలకు పూనుకోవటంతో సమస్య తీవ్రతరమైంది. తిట్లే కవితలుగా ప్రకటించారు కొందరు.

పురుషాహంకారానికి, తమపై ఆరోపణలకు జవాబు చెపుతున్న రీతిలో 'నీలిమేఘాలు'లో చాలా కవితలు వున్నాయి. ఇటీవల వచ్చిన తెలుగు కవితలలో ఉత్తమమైనవి 'నీలిమేఘాలు'లో వున్నాయి.

స్త్రీ అణచివేతకు మూలకారణం దోపిడీ వ్యవస్థయేనని, ఆ వ్యవస్థకు పురుషుడొక సాధనమేనని కవయిత్రులు గుర్తించవలసిన అవసరం వున్నది.

మానవతార : షహీద్ భగత్‌సింగ్ అభిమాన సంఘం - నిజామాబాద్ వారు ప్రచురించిన కవితా సంకలనం 'మానవతార'. ఈ సంపుటిలో నగ్నముని 'రచయిత రాయని నాటకం', నందిని సిధారెడ్డి 'మేం తలెత్తుకునే వున్నాం'' కె. శివారెడ్డి 'కమలకుమారి స్వగతం', నాళేశ్వరం శంకరం 'చెరువు బతుకు, కవితలు ఉత్తమమైనవి.

**ఈ సంవత్సరం వచ్చిన కావ్య సంపుటాల వివరాలు, విశేషాలు :**

ఈ సంవత్సరం వచ్చిన కావ్య సంపుటాలలో ఆదూరి సత్యవతీదేవి 'రెక్క ముడవని రాగం', శేషేంద్ర 'జనవంశమ్', మాదిరాజు రంగారావు 'జైలు కార్నర్ నుండి', శ్రీ వేగుంట మోహనప్రసాద్ 'పునరపి', రామతీర్థ 'తెల్లమిరియం', కందుకూరి శ్రీరాములు 'వయొలిన్ రాగమో వసంత మేఘమో', విన్నకోట రవిశంకర్ 'కుండీలో మర్రిచెట్టు', ఆకెళ్ళ రవిప్రకాష్ 'ఓ కొత్త మహాంజదారో', ఆప్తచైతన్య 'గడ్డిపువ్వు', వేగుంట మోహనప్రసాద్, కె. శివ కుమార్‌ల సంయుక్త కవిత 'పద పారిపోదాం', మొక్కపాటి సుమతి 'రగిలే గొంతులు', గూడవరపు లక్ష్మీనారాయణ 'కళాకేళి', నాగభైరవ కోటేశ్వరరావు 'కన్నెగంటి హనుమంతు' సహృదయులు తప్పక చదివి ఆనందింపదగినవి.

సమాజ నియమాలపై అసమ్మతిని ప్రకటించకుండా, కుటుంబ జీవనం లోని మాధుర్యానికి స్పందించి శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి 'రెక్క ముడవని రాగం'లో కవితలు రచించారు.

'ఆధునిక మహాభారతం' తర్వాత శ్రీ శేషేంద్ర పాత కొత్త కావ్యాలను కలగలిపి 'జనవంశమ్' అనే మరో ఇతిహాసాన్ని రూపొందించారు.

శబ్దం అభివ్యక్తి అనుభవ సాంద్రతతో పొందే నిరాక్షిణ రూపమే కవిత్వ మని తలచే మాదిరాజు రంగారావు జైలు లోపలివ్యక్తి మానసిక అనుభూతులను చక్కగా వెల్లడించారు.

కవిత్వానికి, వచనానికి మధ్య గల సరిహద్దు రేఖను చెరిపివేయటమేగాక, వచనంలోను పంక్చుయేషన్, సింటాక్స్ పాటించని అతి నవీన కవి 'మో' ఈ కవి మనోవల్మీకపు వ్యక్తావ్యక్తాలావన 'పునరపి' ఇందులో 'దుఃఖస్మితం',. 'రాచపుండు' విశేషమైన కవితలు.

**విడిగా పత్రికలలో వచ్చిన కవితలలో శ్రేష్ఠమైనవి కొన్ని :**

పత్రికలలో ప్రచురితమైన కవితలలో అబ్బూరి వరద రాజేశ్వరరావు మరణంపై అజంతా రచించిన స్మృతిగీతం, ఆలిశెట్టి ప్రభాకర్ అకాల మరణానికి శోకించి వరవరరావు రచించిన 'ఎలిజీ' స్మృతిగీతాలలో ఉత్తమ మైనవి.

నేటి సమాజంలో విద్యావంతులైన దళితులెదుర్కొనే సమస్యను శ్రీ సతీష్ చందర్ ఒక జననం వాయిదా అనే కవితలో శక్తిమంతంగా తెలిపారు.

అజంతా 'స్వప్నలిపి'పై ఆరుద్ర కవిత్వ రూపంలో రచించిన పుస్తక సమీక్ష ఆసక్తికరమైంది. "కొన్ని పడికట్టు పదాలు పేటెంట్ ఇమేజ్‌లకు/ ఎన్నో పోతలు - పోసి ఆ స్ఫటికాల ఇటుకలతో కట్టిన/నీ రావణకోటలో నివ సిస్తున్న వారెవరు?" అనే ప్రశ్న అజంతా, ఆయన కవిత్వాన్ని అభిమానించేవారు కూడా ఆలోచించవలసినది.

రాయలసీమ బాంబుల సంస్కృతిని నిరసిస్తూ శ్రీ రాచపాళెం చంద్ర శేఖరరెడ్డి "ఇక్కడ జీవితాలు నిజంగానే నీటి బుడగలు/ఇక్కడ జీవితాలు పేలుతున్న బాంబులు/ఇక్కడ జీవితాలు తెగిపోతున్న పేగులు/ఇక్కడ ఎవడి జీవితమూ వాడి సొంతం కాదు/ఇది పరాధీన సీమ/.... ఇక్కడ భరతమాత బాంబు కిరీటం ధరిస్తుంది/అన్నపూర్ణ నాటు తుపాకి పట్టుకుంటుంది" అని వ్యంగ్యంగా పలికారు.

శ్రీ వెంకటరావు రచించిన హైకూలు ఈ పద్ధతి కవిత్వం పాతబడలేదని పిస్తున్నాయి. మళ్ళీ తలచుకోదగిన మధురమైన పంక్తులు వీరి హైకూలలో వున్నాయి.

ప్రేమ కవిత్వంలో శ్రీ కె. శ్రీకాంత్ భావ ప్రకటనా రీతి కొత్తగా ఆహ్లాదకరంగా ఉన్నది.

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ చక్కని ప్రకృతి దృశ్యాలను "చలి తెలవారగట్ల / పంటకాలవ నీటివాలులో / రాదారి పడవలా / అరటి దొప్పలో కార్తీకదీపం / రాత్రంతా ఎంచక్కని కలగని / దక్షిణపు ఇంటి కిటికీ తెరిస్తే/ పలకరించే / గ్రీష్మ ప్రత్యూష పవనం" అనే మాటలలో అందంగా చిత్రించారు.

నిరాశ మనిషి నెలా లొంగదీస్తుందో శ్రీ యార్లగడ్డ రాఘవేంద్రరావు "పిలవని అతిథిలా బెరుకు బెరుకుగా వస్తుంది / గుండె గదిలోకి అడుగుపెట్టి / బెదురు బెదురుగా దిక్కులు చూస్తుంది/.... పురుగును నాలిక్కద్దుకున్న బల్లిలా/ నిరాశ మనల్ని గుటకేస్తుంది" అనే మాటలలో నేర్పుగా తెలిపారు.

ఆకలి బాధకు అలవాటుపడిన అనాథ బాలుడికి అన్నీ ప్రశ్నార్థకాలే నంటారు శ్రీ శీలా వీర్రాజు ప్రశ్నార్థకం గీతంలో. ఇది సహృదయులకు చిర కాలం జ్ఞాపకముంటుంది.

శ్రీ త్రిపుర తన తల్లి మరణ దృశ్యాన్ని అధివాస్తవికరీతిలో "అమ్మ శవం గేటుదాటి వెళ్ళింది / చర్మం ఎముకలు అంతా దగ్ధం అయి / పొగగానూ బూడిదగానూ మారింది / .... తెల్లటి అమ్మలేని గదిగోడల వేపు / చూస్తూ / కాపలా కాస్తూ వుంటుంది / కళ్ళమీళ్ళ తెరవెనుక / అర్థంలేని అంతర్యుద్ధానికి ముందు" అనే మాటలలో వ్యక్తీకరించారు.

ఎదిగిన పిల్లలు రెక్కలొచ్చి తమ భవిష్యత్తును వెదుక్కొని సుదూర ప్రాంతాలలో స్థిరపడిపోగా, ముసలి దంపతుల జీవితంలో ఏర్పడే వెలితిని కె. అంజనీబాల 'ఆరనితడి'లో అర్ధ్రంగా వర్ణించారు.

గర్భవతి అనుభూతి శ్రీమతి కె. గీత 'నెలలు నిండేదాకా' గీతంలో అందంగా తెలిపారు. ఇంతకుముందెవరూ స్పృశించని కావ్యవస్తువిది - "నెలనెలా నా శరీరాన్ని భాగభాగంగా పంచుకుని రూపుదిద్దుకుంటావు నువ్వు/....తమాషాగా లోపల్లోపలే ఉదర కుడ్యాల మీద మెత్తని బాక్సింగ్ చేస్తూ/.... నా ప్రపంచం లోకి అడుగుపెడ్తావు నువ్వు/.... నా చిన్నారి పాపాయీ! నా కళ్ళల్లోకి మెత్తటి నవ్వు విసిరి/ అమాయకంగా రెప్పలు విప్పుతావు నువ్వు! మాటిమాటికీ నన్ను మాతృత్వపు క్షీరామృతంలో ముంచుతావు నువ్వు" అని శిశువుతో సంభాషించే తల్లి పాఠకులకు మరపురాని అనుభూతి కల్గిస్తుంది.

ఇంకా "రక్తం రంగు వెలిసిపోరాదు (సినారె), ఇవిగో నీ నేత్రాలు (శేషేంద్ర), కర్ఫ్యూ నీడలలో (అజంతా), స్థలం లేదు సమయం లేదు (కె. సంజీవి), నేపథ్యంలో (కె. రామమోహనశర్మ), మళ్ళీ బళ్ళోకి (పాటిబండ్ల రజని), మా రాత్రులు మాకు కావాలి (ఓల్గా), నేను మీ పాఠకుణ్ణి కాను మీ ప్రాతని (చలసాని ప్రసాద్), స్వర పరికరం, స్వాన్న (ఎండ్లూరి సుధాకర్), నెత్తురు మొగ్గ (కె. శివారెడ్డి), మా అమ్మాయి (ఎన్. గోపి), వలసపోయిన (వై. ముకుంద రామారావు), 'స్పర్శ', ముందుజాగ్రత్త చర్య (మహజబీన్), 'అమ్మ మనసు', 'రొట్టె సంగతి' (పసీరా), 'స్లీపింగ్ పార్ట్‌నర్' (కొండేపూడి నిర్మల), ఊరు ఎక్కడేదే చిలకా (కందాళై రాఘవాచార్య), పల్లె రమ్మంటుంది (భగ్వాన్) కవితలు కూడా సహృదయులకు ఆనందం కలిగిస్తాయి.

ఆధునిక జీవితంలోని అనేక కోణాలను ప్రదర్శిస్తున్న కవులు, అనుభూతి సాంద్రత లోపించటాన కొందరు, అనుభూతి గాఢంగా వున్నప్పటికీ భాష మీద అధికారం చాలక కొందరు అపరిపక్వమైన రచనలు అందించారు.

ఇటీవల తెలుగు కవితలు కొన్ని ఇంగ్లీషు ద్వారా ఇతర భాషల వారికి చేరటం ఒక శుభ పరిణామం.

పరిపూర్ణపు బ్రతుకు లక్ష్యంగా నవ్య కవిత్వం పురోగమిస్తున్నదని తలచ వచ్చు.

(27-12-1993 సోమవారం 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక 'సాహిత్య వేదిక'లో ప్రచురితం - ఆంధ్రజ్యోతి దినపత్రిక సౌజన్యంతో)

# 1993 లో సాహిత్య 'విమర్శా'వలోకనం

—డా॥ కడియాల రామమోహనరాయ్

తెలుగులో సాహిత్య విమర్శ ఏమాత్రం అభివృద్ధి చెందడంలేదని కొందరు రచయితలు, పాఠకులు ఆరోపిస్తుంటారు. పత్రికలు, ప్రచురణకర్తల నుండి తగినంత ప్రోత్సాహం లేకపోయినా విమర్శ తన ఉనికిని కాపాడుకుంటూనే ఉన్నది. సాహిత్యంలోని గుణాత్మక రీతులను, అవాంఛనీయ ధోరణులను గురించి హెచ్చరిస్తూనే ఉన్నది.

కొన్ని సంవత్సరాల నుండి ప్రముఖ దినపత్రికలు వారానికొకరోజు కవితలు, వ్యాసాలు, పుస్తక సమీక్షలను ప్రచురిస్తూండటంతో పరిస్థితి కొంత ఆశాజనకంగా మారింది. ఒక దశాబ్దం కిందటి పరిస్థితి కంటె ఇప్పటి పరిస్థితి సాహిత్య విమర్శనా రంగంలో బాగున్నదని చెప్పవచ్చు.

1993 లో వచ్చిన తెలుగు సాహిత్య విమర్శ గ్రంథాలు, వ్యాసాలను, చర్చలను గమనిస్తే ఈ రంగంలో వాడి, వేడి తక్కువేమీ కాదనిపిస్తున్నది.

ఫెమినిస్టు ధోరణులలోని మంచి చెడ్డలను బేరీజు వేసిన చర్చలు, దళిత సాహిత్యాభివృద్ధిని కోరేవారు ఇతరులపై ఎక్కుపెట్టిన బాణాలు, పద్య కవిత్వ భవితవ్యం గురించిన చర్చలు, కవుల అపరాధాలను సంకోచింపక వెల్లడించిన శ్రీకాంతశర్మగారి వ్యాసాలూ సాహిత్య విమర్శలో వైవిధ్యాన్ని తెలిపాయి - ఇవన్నీ ఒకఎత్తు, శ్రీ బాలగోపాల్ 'చరిత్ర - సమాజం - మార్క్సిజం' [అరుణతార - సెప్టెంబర్ 1993] వ్యాసం మరొక ఎత్తుగా తలచవచ్చు. బాలగోపాల్ వ్యాసం చాలా సంచలనం కలిగించింది; కొత్త ఆలోచనలు రేకెత్తించింది; చాలా వ్యతిరేకతను కూడా ఎదుర్కొన్నది. ఫెమినిస్టులు బాలగోపాల్ వ్యాసంపై స్పందించి 'మానవ ప్రవృత్తి, విప్లవ కార్యాచరణ, ఫెమినిస్టు రాజకీయాలు'

అనే పెద్ద వ్యాసం రచించి, ప్రచురించారు. (ప్రతులకు : 304, కిరణ్ అపార్ట్‌మెంట్స్, రెడ్‌హిల్స్, హైదరాబాదు - 500 004).

**విమర్శ గ్రంథాలు :**

1993 లో తెలుగు సాహిత్య విమర్శ గ్రంథాలు ఇరవైకి పైగా ఈ వ్యాస రచయిత దృష్టికి వచ్చాయి. వీటిలో కొన్ని ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు రచించినవి కాగా, మరికొన్ని విశ్వవిద్యాలయ పరిధిలో చేసిన పరిశోధనలు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్య శతజయంతి సందర్భంగా వెలువడిన 'సాహితీ నీరాజనం', శ్రీ కోవెల సంపత్కుమారాచార్య షష్టిపూర్తి సమయంలో సమర్పించిన 'సాహితీ సంపద', వరంగల్లు పట్టణ ప్రాచీన చరిత్ర, సంస్కృతులను తెలిపిన సంకలనం 'ఏకశిలా సాహిత్య సౌందర్యం' విమర్శ వాఙ్మయానికి విస్తృతిని సమకూర్చాయి.

**ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర - ఒక నిర్మాణ ప్రయత్నం :**

ప్రముఖ కవి, విమర్శకులు కె.వి.ఆర్. వ్యాస సంపుటి ఇది. 'నే నెలా రచయితనయ్యాను' వ్యాసంలో శ్రీ కె.వి.ఆర్. అనిసెట్టి సుబ్బారావు తనను గేయ రచనలో ప్రవేశ పెట్టినట్లు తెలిపారు. తన రాజకీయ అవగాహన అరకొరగా ఉన్న దశలో మావో పలికిన ''తుపాకి గొట్టం ద్వారానే రాజ్యాధికారం" అనే మాటను అవహేళన చేశానని 'మరి నా మాటో?' అనే వ్యాసంలో వివరించారు.

ఉద్యమ కవిత్వంలోని మూస ధోరణిని తాను గ్రహించినట్లు కె.వి.ఆర్. ఒక ఇంటర్వ్యూలో [ఆంధ్రప్రభ దినపత్రిక - 19-4-93] పేర్కొన్నారు. శ్రీ అల్లం రాజయ్య రాసిన 'మనిషిలోని విధ్వంసం' కథలో మనిషి కుటుంబం నుంచి పారిపోయాడని, తనకు ఈ పరాయీకరణ బొత్తిగా నచ్చదని చెప్పారు.

కె.వి.ఆర్. వ్యాసాలలో 'సి.ఆర్. రెడ్డి-రెండు వన్నెల మొగం, ఉన్నవ-వెలుగునీడలు, కొడవటిగంటి నవలలు - ఒక పరిశీలన' అనేవి చరిత్ర రచనకు ముడి సరుకుగా పనికి వస్తాయిగాని, అబ్బూరి, నాయని, చలం మొదలైన వారిపై రచించిన వ్యాసాలు కేవలం "అబిచ్యువరీ" స్థాయిలోవే. శ్రీశ్రీ, గుర

జాడలపై కె.వి.ఆర్. రచనలు విడిగా ఉండటాన ఈ సంపుటిలో చేర్చలేదు. అందువల్ల ఈ సంపుటికి 'ఆదునికాంధ్ర సాహిత్య చరిత్ర - ఒక నిర్మాణ ప్రయత్నం' అనే శీర్షిక నప్పలేదు.

**తెలుగు కవిత - లయాత్మకత :**

శ్రీ సి. నారాయణరెడ్డి ప్రసంగ వ్యాస సంపుటి ఇది.

"ఏ భాషలోనైనా కవిత మంత్రంగా పుట్టనీ, శ్లోకంగా వెలువడనీ, పాటగా సాగనీ, పద్యంగా నడవనీ మొదట్లో తాళబద్ధంగానే ఉద్భవించి ఉండా లని నేను గాఢంగా నమ్ముతున్నాను. మాత్రాగణాలు ఏ భాషకైనా సహజ లక్షణాలు, అక్షర గణాలు ఆరోపిత లక్షణాలు" అన్నారు. అక్షర గణబద్ధమైన పద్యం తాళం వేస్తూ పాడటానికి అనుకూలంగా ఉండదు కాబట్టి లయాత్మకంగా చదువుకుపోవచ్చునన్నారు.

అభినవగుప్తుడు 'అభినవ భారతి'లో మాత్రా ఛందస్సుకు గానంవల్ల, స్రగ్ధరాది అక్షర ఛందస్సులకు పఠనంవల్ల శోభ సిద్ధిస్తుందని చెప్పిన విషయాన్ని ప్రస్తావించి, శ్రీ వల్లభాచార్య పద్యం పాడటానికి తాళానికి ఒదగటంలేదనుకోవటం పొరపాటు అన్నారు.

పద్యం, గేయం, వచన కవిత్వమూ అన్నీ లయాత్మకమైనప్పుడే శోభిస్తా యని సి.నా.రె. ఈ ప్రసంగాలలో వివరించారు.

**కావ్యం - కవి స్వామ్యం :**

—శ్రీ కోవెల సంపత్కుమార సాహిత్య వ్యాస సంపుటి ఇది.

1930 - 35 ప్రాంతాలలో తెలుగులో భావకవిత్వంపై తిరుగుబాటుగా వచ్చిన కవిత్వాన్ని అభ్యుదయ కవిత్వమని సాహిత్య చరిత్రకారులు పేర్కొనటం పరిపాటి. కాని విశ్వనాథ సత్యనారాయణగారి "శ్రీ మద్రామాయణ కల్ప వృక్షము" నవ్య సంప్రదాయానికి అంకురార్పణ చేసిందని, అది ఉద్యమరూపం ధరించిందని శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యం, సంపత్కుమార ప్రభృతులు భావిస్తు న్నారు.

''విశ్వనాథ సత్యనారాయణ బాధ్యత గుర్తించిన ఉద్యమకారుడు. ఉద్యమ నాయకుడు" అని సంపత్కుమార అంటున్నారుగాని, విశ్వనాథవారు భావ కవిత్వాన్ని సంపత్కుమార దృష్టితో చూడలేదు. "భావ కవిత్వమనేది అర్థమయ్యే విషయం కాదు. హృదయానికి అవగతమయ్యే విషయం. అది వ్రాయగలవా డొక్కడే. అతని పేరు కృష్ణశాస్త్రి. అతని ననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవరూ అతని నందుకోలేదు. అతని కాంతే మా సౌధమంతా వ్యాపించి ఉంది" అన్నారు. జీవుని వేదన, తండ్రి యానతి కారణంగా రామాయణ రచనకు పూనుకున్నారేగాని నవ్య సంప్రదాయ ఉద్యమాన్ని ప్రారంభించే ఉద్దేశ్యంతో కాదు. విశ్వనాథవారు తన జీవితకాలంలో తానొక ఉద్యమాన్ని ప్రారంభించినట్లు తలచలేదు.

'కవిసేన' ఉద్యమాన్ని గురించి సంపత్కుమార విశేషంగా తలపోయటం వింతగా తోస్తుంది - కవిసేన ఉద్యమం (?) ఆచిరకాలంలోనే కాలగర్భంలో కలిసిపోయిన సంగతి సంపత్కుమార గుర్తించలేదా?

**తెలుగు ఛందస్సుపై సంపత్కుమార వెలుగులు :** ఛందశ్శాస్త్రాన్ని మథించి విశేషాలను వెల్లడించిన కొద్దిమందిలో సంపత్కుమార ప్రముఖంగా గుర్తింపదగినవారు.

'పద్యం రసభావ స్ఫోరకంగా చదువదగినదే తప్ప పాడతగింది కాదు. గ్రథన కౌశలం సువ్యక్తం కావాలంటే పద్యం చదువవలసిందే తప్ప పాడవల సింది కాదు' అని శ్రీ సంపత్కుమార భావించారు.

ఛందస్సును విద్యార్థులకు బోధించేవారు గణాల విరుపులకూ, పదాల విరుపులకూ లంకె లేదనీ, పద్యం పద్యంగా కవి శక్తిని బట్టి రకరకాల పోక డలు పోగలదనీ, ఎంతో వైవిధ్యం సాధించగలదనే అవగాహన కలిగించాలని శ్రీ సంపత్కుమార సూచించారు.

'తెలుగు ఛందస్సుపై కొన్ని వెలుగులు' పుస్తకంలో సంపత్కుమార జిజ్ఞాసువులకు ఉపయోగపడే విలువైన విషయాలు తెలిపారు.

**సుప్రసన్న భావలహరి 'భావుక సీమ' :**

'సంక్షుబ్ధ వర్తమానంలో భారతీయ సంస్కృతి', నవ్యకవిత్వారంభము' వ్యాసాలద్వారా శ్రీ సుప్రసన్న ఆధునిక సాహిత్యాన్ని సంపన్నం చేశారు. నవ్య కవిత్వారంభమునకు రాయప్రోలువారు చేసిన కృషిని సుప్రసన్న సోదాహర ణంగా వివరించారు.

'వర్తమాన కవిత్వ దర్శనము'లో శ్రీ సుప్రసన్న "ఏడోదశకం నడుమ నుంచీ ఒకటి రెండుసార్లు చీకటి వర్షం కురిసింది. కవిత్వంపేర అశ్లీలాన్నీ జుగుప్సనూ సమకూర్చిన దిగంబర కవులు వచ్చినదారినే వెళ్ళిపోయారు. ఆ దశకం పూర్తయ్యేసరికి సాయుధ పోరాటం ద్వారా సమాజపు మార్పుని ఆహ్వానించే విరసం ఆవిర్భవించింది" అన్నారు. నగ్నముని, చెరబండ రాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ లు విప్లవ కవులుగా మారారుగాని వచ్చినదారినే వెళ్ళి పోలేదుగదా! దిగంబర కవిత్వం ఒక చారిత్రక అవసరంగా వచ్చింది. దాన్ని చీకటివర్షంతో పోల్చటం సరికాదు.

**ఆధునికత - అత్యాధునికతలపై అఫ్సర్ ఆలోచనలు :**

'ఆధునికత నుండి అత్యాధునికత వరకూ' వ్యాసంలో శ్రీ అఫ్సర్ "1980 ఒక సందిగ్ధ దశాబ్దం. పద్దెనిమిది నెలల అత్యాయిక పరిస్థితి తర్వాత రాజకీయ వ్యవస్థలో మౌలికంగా కొన్ని మార్పులు వచ్చాయి. సామాజికంగా నిరాశాపూరిత వాతావరణం నెలకొంది. ఆ పరిస్థితుల ఆధిక్యం వల్ల 'శూన్యా వరణ'లో చిక్కుబడిపోయిన నిరాశావాద కవులు కొందరు ఈ తరంలో కన్పి స్తారు" అని ఆనాటి సాహిత్య స్థితిని చక్కగా వివరించారు.

'ఆధునికత' అనే వ్యాసంలో అఫ్సర్ అధివాస్తవికత రెండవ ప్రపంచ యుద్ధానికి తర్వాతిదిగా పేర్కొన్నారు. ఇది పొరపాటు. అధివాస్తవికత అంత కన్నా ముందే ఉన్నది.

"తెలుగు కథ ఏనాడో కొడవటిగంటి కుటుంబరావు గారి దగ్గరే ఆగి పోయింది."

"శ్రీశ్రీ సంస్కృత భాషాడంబరంతో విసిగిపోయి నయాగరా కవులు వచ్చారు."

"జెండాలు సాహిత్య ఎజెండా నిర్ణయించి, శాసించే దుర్భల పరిస్థితుల్లోనే తెలుగు కథ కన్నుమూసింది" లాంటి అనాలోచితమైన ప్రకటనలతో అఫ్సర్ విమర్శ దారి తప్పింది. ఇటువంటి విమర్శ వ్యాసాలు తెలుగు విమర్శనే అప హాస్యంపాలు చేసే ప్రమాదం ఉన్నది.

**వల్లభాచార్య వ్యాస సంపుటి 'మధుకళ' :**

శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం రాసిన 'నవ్య సంప్రదాయ ఉద్యమ ప్రయోక్త విశ్వనాథ' వ్యాసంపై శ్రీ త్రిపురనేని మధుసూదనరావు, వల్లభాచార్యుల మధ్య చర్చ తీవ్రరూపంలో సాగింది. ఉద్రేకాలు ఎక్కువై, విషయం గందరగళంలో పడింది. 'మధుకళ'లోని వల్లభాచార్య వ్యాసాల వల్ల మధుసూదనరావు గారి అభి ప్రాయాలు తెలియవు. ఇరువురి వ్యాసాలు కలిపి ప్రచురించినప్పుడే నిష్పాక్షిక పరిశీలనకు వీలుంటుంది.

ఆధునిక కవిత్వంలో అవాంఛనీయమైన ఇంగ్లీషు పదాల ప్రయోగా ధిక్యాన్ని, కవిత్వం పేరిట చలామణీ అవుతున్న శుష్క వచనాన్ని, కర్ణకఠోర మైన సమాసాలను ప్రస్తావించి శ్రీ వల్లభాచార్య 'ఆకవితా నీకు జోహార్' వ్యాసంలో ఆందోళన వెలిబుచ్చారు.

**తెనాలి రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి కాదు :**

జర్నలిస్టులు 'స్కూప్'లతో సంచలనం సృష్టించినట్లు శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం 'తెనాలి రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవికాదు' అనే పుస్తకం రాశారు.

సాహిత్య పరిశోధకులు చూపవలసిన ఆధారాలు చూపకనే వీరు "తిప్పాంబ [తుళువ నరసరాజు భార్య] కృష్ణరాయలపై విషప్రయోగం చేయించింది", "పెద్దన యుద్ధవిద్యలలో ఆరితేరిన యోధుడు" లాంటి విశేషాలు రానేశారు.

అష్టదిగ్గజ కవుల సంప్రదాయం నరసరాయల కాలానికే ఉన్నదంటూ, "అష్ట భాషా కవిత్వాబ్జ సంభవులైన సుకవి పుంగవులు సంస్తుతులు చేయ" అనే వరాహ పురాణంలోని పద్యం ఉదాహరించారు. ఇక్కడి అష్ట భాషలు ప్రాకృత భాషలను ఉద్దేశించినవి గాని, అష్టదిగ్గజ కవులను కాదు.

**తెలుగులో అలబ్ధ వాఙ్మయం :** పూర్వకవులు రచించిన కొన్ని గ్రంథాల సమాచారం లాక్షణికుల వల్ల, ఇతర విధాలుగా తెలియవస్తున్నా ఆ గ్రంథాలిప్పుడు లభించటంలేదు. అటువంటి 650 గ్రంథాల సమాచారాన్ని శ్రీ ఆర్. శ్రీహరి చాల శ్రమపడి 'తెలుగులో అలబ్ధవాఙ్మయం' లో చేర్చారు. ఇందులో ఎఱ్ఱాప్రెగడ రామాయణము, శ్రీనాథుని 'శాలివాహన సప్తశతి' అంటి గ్రంథాల నెవరైనా సంపాదించగలిగితే తెలుగు సాహిత్యం మరింత పరిపుష్ట మవుతుంది.

**సిద్ధాంత వ్యాసాలు :** తెలుగు విశ్వవిద్యాలయం, తిరుమల - తిరుపతి దేవస్థానం వారి తోడ్పాటుతో తెలుగులో చాల సిద్ధాంత వ్యాసాలు ప్రచురితమవు తున్నాయి. 1993లో వచ్చిన 8 సిద్ధాంత వ్యాసాలను చదివే అవకాశం రచయితకు లభించింది.

**చలంగారి కథానికా సాహిత్యము - అనుశీలనము :** చలం కథల అంతస్తత్వాన్ని శ్రీ వావిలాల సుబ్బారావు సరిగా ఆవిష్కరించగలిగారు. ప్రతి కథానికను విశ్లేషించటమేగాక, చలం కల్పనలలో కొన్నిచోట్ల కనిపించే అసహజత్వాన్ని ఇతర శిల్పాల లోపాలను నిస్సంకోచంగా తెలిపారు.

శ్రీ ఆమళ్ళదిన్నె వేంకటరమణ ప్రసాద్ "తెలుగు సాహిత్యంలో మృచ్ఛకటికం'లో శూద్రక, భాస మహాకవుల దేశ కాలాలను తెలుగులో వావిలాల వాసుదేవశాస్త్రి నుండి అవధానం చంద్రశేఖర శర్మగారి వరకు 15 మంది వేర్వేరుగా చేసిన అనువాదాల బాగోగులను చక్కగా వివరించారు. మృచ్ఛకటికం పాత్ర చిత్రణ, భాష, పంచసంధి సమన్వయం, సాంఘిక పరిస్థితుల వంటి అంశాలను సాంగోపాంగంగా విమర్శించారు.

**చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర సమగ్ర సమీక్ష :** శ్రీ జంగా లూకానందం సారంగధర కథ చారిత్రకమా? అని చర్చించటమే గాక ఇటువంటి కథలు ఇతర భారతీయ భాషలలో, ఇతర ప్రపంచ భాషలలో ఏ విధంగా ఉన్నదీ సాకల్యంగా పరిశీలించి, పరిశోధనకు సమగ్రతను సంతరించారు.

**శ్రీశ్రీ రేడియో నాటికలు - ప్రయోగవాద ధోరణులు :** రేడియో నాటిక ప్రారంభ వికాసాలను, శ్రీశ్రీకి శ్రవ్యనాటిక రచనలో గల సామర్థ్యాన్ని, నాటికలలో వస్తు, శిల్పాల విశిష్టతను, ప్రయోగరీతుల చమత్కారాలను శ్రీమతి పి. శివలక్ష్మి వివరించారు.

ఇంకా ఈ సంవత్సరం వచ్చిన సిద్ధాంత వ్యాసాలలో శేషేంద్ర కవిత్వా నుశీలన [పెన్నా శివరామకృష్ణ] పాశ్చాత్య సాంఘిక నాటకం - ప్రభావం [పి.వి. రమణ] తెలుగు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు. కవులు - రచ యితలు [వి. వీరాచారి], కృష్ణశాస్త్రి గేయాలు, కవితా తత్వం [డి. కామేశ్వర రావు], తెలుగులో సంకలనాలు [గొల్లకోడి సూర్యభాస్కరరావు], నాలోని నీవు - ఒక పరిశీలన [యడ్లపల్లి నాగేశ్వరమ్మ]లు చదివి ఆనందించదగినవి.

**చేరాతలు :** శ్రీ చేకూరి రామారావు 'చేరాతల' ద్వారా తెలుగులో వస్తున్న కవిత్వ తత్వాన్ని దూషణ భూషణ తిరస్కారాలకు వెనుదీయక వివ రిస్తున్నారు. కొత్త కవులను, కవయిత్రులను బాగా ప్రోత్సహిస్తున్నారు. చేరాత లతో తీవ్రంగా విభేదించేవారుకూడ చదవకుండ ఉండలేని ఒక informal style రామారావు గారి రచనలో ఉన్నది.

**జీవియస్ కాలమ్ :** శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం రాస్తున్న 'జీవియస్ కాలమ్'లో సంప్రదాయంపై ప్రీతి, పద్య కవిత్వంపై అభిమానం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ రాసిన 'తెలుగు కవుల అపరాధాలు' వ్యాస పరంపర కొత్త ఆలోచనలు కలిగించింది. పెద్దలు చెప్పారని తప్పు అభి ప్రాయాలను శిరోధార్యంగా ఎంచనవసరంలేదని స్పష్టం చేశారు.

శ్రీ కల్లూరి భాస్కర్ 'సమాంతరమ్'లో వచన సాహిత్య విమర్శకు చక్కని మార్గం ఏర్పరచారు. మరుగుపడిన నవలల్లోని విశిష్టమైన అంశాలపై కాంతిని ప్రసరింపజేశారు.

'మళ్ళీ పద్యమా?' అనే రచనలో శ్రీ భాస్కర్ ఆధునిక భావ చైతన్యాన్ని పద్యంలో ఇమడ్చడం సాధ్యం కాదన్నారు.

పాశ్చాత్య సాహిత్య ప్రమాణాలను ఆధునిక తెలుగు కవిత్వానికి అన్వయిస్తూ శ్రీ జి. లక్ష్మీనరసయ్య చేసిన విశ్లేషణలో సరికొత్త ఆలోచనలు రేకెత్తించాయి.

శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు - జాషువా, తుమ్మల, ఏటుకూరి రచనల లోని వైశిష్ట్యాన్ని వివరించిన తీరు బాగున్నది.

**ఫెమినిస్టు విమర్శ** : శ్రీమతి జయప్రభ దిగంబర కవిత్వాన్ని స్త్రీ దృక్కోణం నుండి విమర్శించారు. శ్రీ జ్వాలాముఖి స్త్రీవాద కవితలను నీలి కవితలని నిందించగా- దిగంబర కవుల కవిత సంగతి ఏమిటని, అందులో స్త్రీలను కించపరచే వ్యాఖ్యల పట్ల జయప్రభ అభ్యంతరం తెలియజేశారు. శ్రీ వెల్చేరు నారాయణరావు గారన్నట్లు దిగంబర కవిత్వం వచ్చిననాడు, దాన్ని స్త్రీలు చదువుతారేమోనన్న అభిప్రాయం ఆనాటి కవులకు, విమర్శకులకు కలుగలేదు.

జ్వాలాముఖి.జయప్రభల పరస్పర ఆరోపణలు విమర్శ ప్రమాణాలను దిగజార్చాయి.

1980 - 90 మధ్య కాలం కవయిత్రులదేనని, ఈ దశాబ్దం [1990 - 2000] కూడ స్వంతం చేసుకోమని శ్రీ చేరా కవయిత్రులను ప్రోత్సహిస్తూ అన్నారు. "ఈ శతాబ్దపు రెండవ గొప్ప కవితా సంకలనం" అని చేరా "నీలి మేఘాలు" [స్త్రీ వాద కవితా సంకలనం] ను ప్రశంసించారు.

1990 తర్వాత వచ్చిన కవిత్వంలో విప్లవ భావాలతోపాటు విప్లవేతరమైన, జీవిత వైవిధ్యాన్ని తెలిపే కవితలు వచ్చాయిగాని, స్త్రీల కవితలే ప్రముఖ

బాలగోపాల్ వ్యాసంలో ప్రతిపాదించిన విషయాలకు స్పందించి ఫెమినిస్టులు 'మానవ ప్రవృత్తి విప్లవ కార్యాచరణ, ఫెమినిస్టు రాజకీయాలు' అనే సుదీర్ఘ వ్యాసంతో జవాబు చెప్పారు.

'స్త్రీలలో, దళితుల్లో పెరుగుతున్న చైతన్యం చూసి చాలా మంది మార్క్సిస్టు మేధావులు కలవరపడుతున్నారు. కొందరు చాలా మొరటుగా దాడి చేస్తే మరికొందరు తెలివిగా తప్పులు ఒప్పుకొంటున్నట్లు కన్పిస్తూనే ఆ చైతన్యాన్ని గురించిన తప్పుడు అవగాహనను ఇస్తున్నారు.' వీరిలో బాలగోపాల్ ఈ రెండో వర్గానికి చెందినవారని వీరి ఉద్దేశ్యం.

గోపాల్ ''సమస్యల సైద్ధాంతిక భౌతిక పునాదిని పరిశీలించ నిరాకరించి వాటిని మానవ ప్రవృత్తి మీదా, మార్క్సిస్టు సిద్ధాంతం లోపాల మీదా పెట్టి ఉద్యమ వైఫల్యాన్ని గురించీ లోపాలగురించీ నిశ్శబ్దాన్ని సృష్టించడంలో చురుగ్గా సహకరిస్తున్నాడు'' అని తమ నిరసనను తెలియజేశారు.

''మన తాత్విక దారిద్ర్యం మన సాంస్కృతిక దారిద్ర్యంతో జతగూడిందా అని ఆలోచించుకోవాలి....అండర్ గ్రౌండ్‌లో ఉండే సామాన్య కార్యకర్తలు ఒక పూట మాత్రమే భోజనం చేస్తుంటే తనకు కోడి కూర కావాలనే నాయకుడి కోరిను గురించి ఆలోచించాల్సిన రీతిలో ఆలోచించకుండా ఉపేక్షించి ఊరుకుంటే. కార్యకర్తల నుంచి నాయకులకు లైంగిక సేవలు కావలసి వచ్చినప్పుడు దాన్ని చూసీ చూడనట్లు ఊరుకుంటే - ఆ ఉద్యమంలోని యువకులు ఇంటికి దూరంగా కుటుంబాలకు దూరంగా ఉన్నారు గనుక, అనుకుంటే - ఆ ఉద్యమంలో వైఫల్యం నిర్మాణమై ఉంది. విప్లవంలో కూడ అధికారం అనేది తిరుగు లేకుండా ఉన్నప్పుడు ఆ అధికారం అవినీతి మయంగా, వికారంగా ఉండి తీరుకుంది....తప్పుడు లక్ష్యాల కోసం ఎవరైనా సరే మరణించ నక్కరలేదని చెప్పే హక్కు మాకుందని స్త్రీలుగా మేమనుకుంటాం. విప్లవ కార్యాచరణకూ (**Revolutionary proxis**) విప్లవ ఆదర్శాలకూ మధ్య ఉండే అగాధాలకు మానవ ప్రవృత్తిని నిందించి లాభంలేదు....అది బాలగోపాల్ తెచ్చిన గందరగోళం."

ఈ చర్చలో ఫెమినిస్టులు విప్లవాదులపై చేసిన ఆరోపణలు కాదనరానివి. విప్లవవాదులను సమర్థిస్తున్న మేధావులు పునరాలోచించుకొనవలసినవి.

**మరికొన్ని విమర్శ వ్యాసాలు :** 'ముత్యాల సరము'పై చేరా, అబ్బూరి గోపాలకృష్ణల వ్యాసాలు ఛందోవిమర్శకు ఆదర్శప్రాయమైనవి.

పరిశోధనకు, విమర్శకు అంకితమైన పత్రికలు రావాలి. తెలుగు సాహిత్యంలో ఇతర ప్రక్రియలతో పాటు విమర్శ కూడా సమానంగా ఎదిగి వచ్చే మంచిరోజులకోసం ఎదురుచూద్దాం.

(ఆంధ్రప్రభ దినపత్రిక - 1994 జనవరి 17 వ తేదీ
'సాహితీ గవాక్షం'లో ప్రచురితం. ఆంధ్రప్రభ సౌజన్యంతో



